# భారతి



సాహిత్య మాసపత్రిక

వెల ఒక రూపాయి

# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

మే 1960

సంపుటము 37 : : సంచిక 5

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## మే 1960


| | | |
|---|---|---|
| వైశాఖము | శ్రీ విశ్వనాథ సత్యనారాయణ | 1 |
| నటరాజ శేఖరుడు డి. వి. సుబ్బారావు | శ్రీ జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి | 3 |
| మొహల్లా మెలిక | శ్రీ కొలకలూరి ఇనాక్ | 11 |
| కాతంత్ర వ్యాకరణం | శ్రీ శ్రీనివాస సోదరులు | 17 |
| ఈశాన | శ్రీ సుప్రసన్న | 23 |
| వర్ణవ్యవస్థ : సంఘ శ్రేయస్సు | శ్రీ రాచకొండ రామదాసు | 25 |
| పిచ్చివాడు! | శ్రీ ఇసుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి | 29 |
| షష్ఠ్యంతముల పుట్టుపూర్వాలు | శ్రీ అమరేశం రాజేశ్వరశర్మ | 44 |
| హిమాస్ఫీ హృది | శ్రీ వేగుంట మోహన ప్రసాద్ | 47 |
| కస్తూరి గుమగుమల కన్నడ వచనాలు | శ్రీ కే. కుశాలప్ప గౌడ | 51 |
| తొలుతటిదశ | శ్రీ సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రి | 58 |
| మనుచరిత్రము-సందేశము | శ్రీ దివాకర్ల వేంకటావధాని | 60 |
| అంతా దొంగలే! | శ్రీ సర్వేపల్లి రామారావు | 65 |
| హంసపదిక | శ్రీ యస్వీ జోగారావు | 79 |
| సాహితీ సుగతుని స్వగతం | రామచంద్ర | 82 |
| శ్రీరామునికి భార్య లెందరు! | శ్రీ గొట్టిముక్కల కృష్ణమూర్తి | 85 |
| కలగూరగంప | | 90 |
| గ్రంథవిమర్శనము | | 95 |


## జూన్ నెల సంచికలో


| | |
|---|---|
| బ్రౌనుదొర లఘురచనలు | శ్రీ కొత్తపల్లి వీరభద్రరావు |
| అథర్వణకారికావళి కాలము | శ్రీ దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డి |
| కాకతి గణపదేవుని కొలవెన్ను తామ్రశాసనము | శ్రీ కె. హెచ్. వి. శర్మ |
| కథా సరిత్సాగరమునకు మూల మేది? | శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి |
| లా అంటే ఏమిటి? | శ్రీ కామరాజుగడ్డ రామచంద్రరావు |
| రాబర్ట్ డి నోబిలి | శ్రీ చల్లా రాధాకృష్ణశర్మ |
| శారికా విలాపము | శ్రీ భట్టారం మల్లికార్జున కవి |



ఆంధ్రదేశమంతటా గల ప్రధాన కేంద్రము
లన్నింటిలో యిప్పుడు ప్రదర్శింపబడుచున్న

# జెమినీవారి

## మహత్తర సాంఘిక
## చిత్రం



# పైగాం

(సందేశం)



దిలీప్ కుమార్ • వైజయంతిమాల • రాజ్ కుమార్
బి. సరోజా దేవి • పండరీ బాయ్ • మోతీలాల్ • జానీ వాకర్

# వార్తలు

## నెహ్రూ-చౌ మంతనాల వైఫల్యం

భారత చైనా సరిహద్దు వివాదంపై చర్చల కోసం చైనా ప్రధాని శ్రీ చౌ ఎన్ లై ఏప్రిల్ 19 వ తేది భారత రాజధానికి వచ్చి ఆరు రోజులపాటు ప్రధాని శ్రీ నెహ్రూతో చర్చలు జరిపారు. ఆరు రోజులలో ఏడుసార్లు దాదాపు 20 గంటలపాటు చర్చలు జరిగాయి. చైనా ప్రధాని ప్రధానాంశాల విషయంలో ససేమిరా కలిసిరానందున వివాదాంశాలు యథాతథంగానే ఉండిపోయినవి. ఉభయదేశాల ఉద్యోగులూ జూన్ నెలలో సమావేశమై సరిహద్దు ప్రాంతాల పటాలు, చారిత్రకాధారాలు పరిశీలించి నివేదిక అందజేయాలనే నిర్ణయం జరిగింది. శ్రీ చౌ 26 వ తేదీన ఖట్మండుకు బయలుదేరారు.

## సింగ్మన్‌రీ పతనం

దక్షిణ కొరియాలో పుష్కరంగా ఏకచ్ఛత్రాధిపత్యం వహించిన అధ్యక్షుడు డాక్టర్ సింగ్మన్‌రీ జనవాక్యానికి తలఒగ్గి తన పదవికి రాజీనామా యిచ్చారు. రీ స్థానాన్ని విదేశాంగమంత్రి శ్రీ హూచుంగ్ స్వీకరించి ఆపద్ధర్మ ప్రభుత్వం ఏర్పాటు చేశారు. నూతన రాజ్యాంగం ముసాయిదా సిద్ధపరచడానికి తొమ్మిది మందితో ఒక సంఘం నియమించబడింది.

## మహారాష్ట్ర, గుజరాత్‌ల అవతరణ

మేనెల 1 వ తేదీకి బొంబాయి రాష్ట్రం భాషాప్రయుక్తంగా విభక్తమై మహారాష్ట్ర, గుజరాత్ రాష్ట్రాలు ఏర్పడ్డాయి. మహారాష్ట్రకు బొంబాయి, గుజరాత్‌కు అహమదాబాద్ రాజధానులు. మహారాష్ట్రానికి ప్రధాని నెహ్రూ ప్రారంభోత్సవం జరిపారు. నూతన మహారాష్ట్ర మంత్రివర్గం శ్రీ వై. బి. చవాన్ నాయకత్వాన ప్రమాణ స్వీకారం చేసింది. గుజరాత్ మంత్రివర్గం శ్రీ డాక్టర్ జీవరాజ్ మెహతా నాయకత్వాన అహమదాబాద్‌లో ప్రమాణస్వీకారం చేసింది. గుజరాత్‌కు శ్రీ మెహిదీ నవాజ్ జంగ్ గవర్నరుగా నియమించబడ్డారు.

## స్వామీ సీతారాం అస్తమయం

ఉత్తమ దేశభక్తుడు, స్వాతంత్ర్య సమర మహాయోధుడు, ఆంధ్రప్రదేశ్ అగ్రనాయకులలో ఒక్కరు అయిన స్వామీ సీతారాం ఏప్రిల్ 9 వ తేదీ రాత్రి విజయవాడ ఆశ్రమంలో పరమపదించారు. వీరి వయస్సు 75 సంవత్సరాలు.

పూర్వాశ్రమంలో వీరి నామధేయం గొల్లపూడి సీతారామ శాస్త్రిగారు. ప్రముఖ న్యాయవాదులైన వీరు 1920 నుండి 1942 వరకు మహాత్ముని నాయకత్వాన దేశంలో కొనసాగిన జాతీయోద్యమంలో పాల్గొని పెక్కుసార్లు కారాగారవాస శిక్ష అనుభవించారు. 1951 సంవత్సరం 15 వ తేదీ మొదలు 38 రోజులపాటు ఆంధ్రరాష్ట్ర సాధనకోసం నిరాహార దీక్ష సాగించారు.

## ఇరాన్‌లో భయంకర భూకంపం

ఏప్రిల్ 24 వ తేదిన దక్షిణ ఇరాన్‌లో కలిగిన భయంకర భూకంపంలో లార్, గహమ్ అనే పట్టణాలు రెండు ధ్వంసమై 3000 మంది మరణించారు. మూడువేలమంది గాయపడ్డారు.

## సింహళంలో తిరిగి ఎన్నికలు

సింహళంలో మార్చి నెలలో డడ్లీ సేనానాయకే ప్రధానిగా ఏర్పడిన ప్రభుత్వం ఏప్రిల్ నెలలో పార్లమెంటులో ఓడిపోవడంతో మళ్ళీ జనరల్ ఎన్నికలు జరుగనున్నవి. సేనానాయకే సలహాపై గవర్నర్-జనరల్ పార్లమెంటును రద్దుచేశారు. జులై 20 న ఎన్నికలు జరుగుతాయి. పార్లమెంటు తొలిసమావేశం ఆగస్టు 5 న జరుగుతుంది.

## అధికారభాష - రాష్ట్రపతి ఉత్తర్వు

భారతప్రభుత్వం అధికారభాష విషయంలో పార్లమెంటు సంఘం నివేదిక చేసిన సూచనలు ఆధారంగా రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్రప్రసాద్ జారీచేసిన ఉత్తర్వును దేశీయ వ్యవహార శాఖామంత్రి పండిట్ గోవింద వల్లభపంత్ ఏప్రిల్ నెలలో లోక్‌సభకు అందజేశారు. కేంద్రప్రభుత్వానికి సంబంధించిన వివిధ వ్యవహారాలలో ఇంగ్లీషుతోపాటుగా హిందీని అదనంగా ఉపయోగించడానికి దోహదమిచ్చే ఏర్పాటుచేసే నిమిత్తం ఒక పథకం రూపొందించి అమలుపరచడానికి దేశీయశాఖ అవసరమైన చర్యలు తీసుకోవచ్చునని ఈ ఉత్తరువులో తెలుపబడినవి. 1965 తర్వాతకూడా హిందీతోపాటు ఇంగ్లీషుకు అధికార భాషగా స్థానం వుండాలని కూడా ఈ ఉత్తర్వులో తెలుపబడింది.

# వైశాఖము

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

పులకల్ కూర్చెడు మొగ్గమల్లియల తావుల్ గ్రీష్మ మధ్యాహ్న బం
ధులు రాఁగా బరిభుక్త చూత ఫలగంధోదార వేళా పరీ
మళ నానాభరమై మహోష్ణ పవన మ్లానాననుల్ బిట్టు కౌ
గిళులన్ బట్టు దురార్ద్ర వృత్తులు పికీ గీతానుకూలంబుగన్.

కణముల్ గా నడిమింటి సూర్యకిరణ గ్రామంబు లాగ్నేయముల్
తొణఁకన్ రోదసి నింటి చావడులయందున్ బండుకొన్నట్టి కం
దణఫున్ మై ముడులన్ నడల్చుకొనుచుం దాళీఫలాంతస్థ చి
క్కణ సారాక్షము లారగింతురు మరిన్ గ్రామీణ జిహ్వాగ్రఘుచున్.

నఘుసీకంబగు స్వేద మొప్ప బర భాషా దంశయాత్రా పరి
శ్లథ బంధంబులు తెల్గు పద్దెములు నా, శయ్యాగతుల్ దంపతుల్
వ్యథితాత్ముల్ పయి చీరలన్ విసరుచుం బట్టీ మరిం బట్టన
ట్టి ధృతి వ్యాహత నిద్రలన్ నిశల పొందెల్ బొందుచుం గుందఁగన్.

చలిదేశంబుల ముద్రగా నొడలి వస్త్రంబు ల్బన్నియై దంశ మూ
ర్తులు నుద్యోగులు తీవియై యొడవలందున్ వేడిమి న్నించుకోన్
వలిపంపున్ నును చీరలం దొలచుచున్ వక్షోభవ స్వేద వ్యా
త్తుల శయ్యా విధుతాత్మ దేహాలకు చెందుం బొల్తురుచి బొల్తుకల్.

నిండువా వేగముచే దడల్ తెగిన మొండెంబుల్ బలెన్ వెచ్చగా
లులు చంద్రోదయ మయ్యు సాగి నడకల్ లోపింప వంబోవహం
బులు మై తీగలు తూలిపోయెడు మహంబుం బాసి నేసాదు ప్రా
ద్దులు దిద్దుల్బలె బొల్చు తారకలబిందుల్ స్వేదవాగ్బిందులై.

క్రొంబసుముల్ కపోలములు గోళ్లను నొక్కుక నొక్కినట్టిగా
సిం బురణించుచుండ జిరజీవి సమూహక భుక్తముక్తముల్
నింబఫలార్ద్ర బీజములు నిండిన దాపెర దూడ్చి వెంకటం
చంబులు పెట్టి భోజనము నల్చుదు రద్దమరేయి నంగనల్.

నవవైశాఖ నరత్ప్రసూనశర కాంతా మల్లికా చాప బాం
ధవ దిగ్వాయు పరిమళంబులకు పౌనఃపున్యముల్ నూత్న నూ
త్న వధూ భావములన్ లిఖించెడిని బంగారు బొప్పగా దమ్మి లే
బుప్రొంబుట్టువు భూర్జపత్ర నిభముల్ పూబోడి చెక్కిళ్లపై.

ఎగచుణా స్వీయ సరస్వతిన్ బరుల సాహిత్యంబుపై నీగ ప్రా
లగనీ డాగతి బశ్చిమానిలము వేళా శైత్యముం గాంచ దీ
తొగరున్ సంజల పట్టివేళ్లపయి జిందుల్ ద్రొక్కుచుం ద్రామిణో
విగతాళించు గృతాభిషేక గుణ సాహిత్యాదికిన్ బాన్సై.

విమల నిశీథిని మధుర
వేళల వెచ్చని గాలులందు సం
భ్రమపడు గాయకుండు పరి
పలిత మన్మథ చిత్తవృత్తి, పూ
వు మొగడలం బ్రియాసితక
పోలములందున బూయు వచ్చి గం
దము తడియారిపోక యెడ
దంగల యార్ద్రిత చే నెఱుంగకన్.

# నటరాజ శేఖరుడు డి. వి. సుబ్బారావు

శ్రీ జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి

కళాదీపకుడైన డి. వి. సుబ్బారావుగారు తాను భూమిమీదికి వచ్చినపని అయిపోయి, రంగం మీదనుంచి నిష్క్రమించారు. తెర వెనుకకుపోయి, రంగు కడిగేసుకొని విశ్రాంతి తీసుకుంటున్నారు. "అనాయాసేన మరణం, వినాదైన్యేన జీవనం" అన్నదానికి ఒక తార్కాణగా జీవయాత్ర చేసిన బందరు పౌరుల నటరాజు డి. వి. సుబ్బారావు.

డి. వి. సుబ్బారావు బందరువాడు. 1923 నాటికి, ఆనాటి మన నాట్యసంపదను విమర్శించి నెరనిగ్గులు తేల్చే విమర్శక సత్తములచే బందరుపౌరుల నటరాజుగా ఎన్నిక అయి రాణించాడు. [నాట్యాంబుజం, 114 పేజీ] ఆ డి. వి. సుబ్బారావే 1943 లో ఆ బందరులోనే బళ్ళారి నట సార్వభౌముడు తాడిపత్రి రాఘవాచార్యులచే మహాసభలో నటరాజ శేఖరుడుగా గౌరవింపబడ్డాడు. అది సామాన్యమైన సంగతి కాదు.

ప్రతిభావంతులై, సాధనలో మునిగి, స్వాంతఃకరణ ప్రేరణనంది, కొత్తదారులు తొక్కి సాధన చేసేవారు సాధన సిద్ధించినా కూడా తమ తమ ఊళ్ళలో తగిన గౌరవప్రతిష్ఠ అందుకోడం — సామాన్యమైన సంగతి కాదు. ఈసడింపబడడమే సామాన్యం. డి. వి. సుబ్బారావు బందరువాడై, బందరులోనే పెరిగి పెద్దవాడైనా ఆ బందరులోనే గౌరవప్రతిష్ఠలనందుకొనడం యాదృచ్ఛికం కాదు. పైగా, బందరువాళ్ళు ఎవర్నీ ఒకపట్టాన గౌరవించరు!

"బందరువాళ్ళకు పొగరు" అని ఇతరులు అనుకోవచ్చుగాక. అది వాళ్ళ హృదయాలలో వగరూ కాదు; చేష్టలలో పొగరూ కాదు. వాళ్ళ తత్త్వం అది. ఎంతటివాణ్ణయినా సరే పట్టిచూస్తారు. నాణెం కడతారు. తమ దృష్టికి నచ్చితేనో — బందరువాళ్ళు చూపే భక్తిశ్రద్ధలు ఇతరత్రా లభ్యమయ్యేవి కావు. కులదేవతలనువలె కొలుస్తారు.

శ్రీ కోలవెన్ను రామకోటీశ్వరరావుగారు ఆనాటి బందరుకు ఆనాటి గ్రీకుల ఏథెన్సుకూ పోలికలు ఉన్నాయ్ అన్నారు. దిగ్దంతులవంటివాళ్ళు ఉండేవారు అక్కడ. యడవల్లి అప్పావధాన్లగారి వంటి వేదపండితులుండేవారు. కోరాడ రామచంద్ర శాస్త్రి, కోరాడ దుర్గానాగేశ్వరశాస్త్రి (బుడ్డిచెంబు శాస్త్రులుగారు) శిష్టా నరసింహశాస్త్రి (ఎర్రశాస్త్రులగారు), ముక్కపాటి సూర్యనారాయణశాస్త్రి (నల్లశాస్త్రులుగారు), జంధ్యాల గౌరీనాథశాస్త్రి, పరిమి నరసింహశాస్త్రి, కె. టి. రామారావుగార్లు ఉండేవారు బందరులో. వీరంతా విద్యామహారణ్యాలు. అక్కడి జంగం (గరికిపర్తి) కోటయ్యగారు గాంధర్వ దీక్షితులు; సంగీత విద్యలో 'సోహమస్మి' అనతగ్గవాడు. సంగీత సాహిత్యాలలోనూ, సంచికట్టు వైద్యంలోనూ చేబ్రోలు వెంకటరత్నం, పాపయ్య సోదరులు చెప్పుకోతగినవారు. పండిత శాలువలు కప్పుకొని ఆ సోదరులు ఏ సభకైనా వస్తే — ఎంత సభ అయినా సరే — వింజమూకిడిన ట్లయ్యేది.

హరినాగభూషణంగారు సంగీతపండితులే కాదు, బ్రహ్మసూత్రభాష్యం పాఠం చెప్పేవాడు. వావిలాల శివావధాన్లుగారి పాండిత్య ప్రకర్షలూ, రఘుపతి వెంకటరత్నం నాయుడుగారి విశాల ప్రేమతత్త్వబోధనలూ, ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్‌దొర తెలుగుభాషకు చేసిన ఉపకారకృతులు బందరులో గుబాళించినవి. బ్రౌన్ అక్కడి నీటిఎద్దడికి వగచి చెరువు తవ్వించాడు. ఆ బ్రౌను చెరువే, బుర్రాం చెరువుగా మారింది. ఇప్పుడు పూడ్చేశారు. మాగంటి సుబ్బారావుగారు, మహానటులుండేవారు. కంచిపట్టుచీర తలపాగా చుట్టి ఆయన వస్తూంటే ఆ అందగాణ్ణి, ఆ నటుణ్ణి చూడడానికి జనం ఉండేవారట! ఈమని లక్ష్మణస్వామిగారు, మహారాష్ట్రుల శిరోవేష్టనం ధరించి — సర్వత్రా దేశభక్తిని ప్రబోధన చేసినవాడు. ఈయన నటలోక చక్రవర్తి. ఆయన సుమేర్ సింగ్ వేషం బహుప్రసిద్ధం.

దేశాన్ని దేశాన్నే తమ అత్యాశ్చర్య కవితారీతులతో ఉర్రూతలూగించినవారు తిరుపతి వెంకటేశ్వర కవీశ్వరులు. ఆ కింకవీంద్రఘటాపంచాననులలో

ప్రముఖులు చెళ్ళపిళ్ల వెంకటశాస్త్రిగారు తమ కవితా సింహాసనాన్ని బందరులోనే ప్రతిష్ఠించారు. ఆయన్ని బందరువాళ్ళు ఓ పట్టు పట్టిచూచారు. తిరుపతి వెంకటకవులు చేసిన అవధానాలలో బందరు శతావధానం ప్రసిద్ధమైనది. ఆ శతావధానం జరిగాకే, తిరుపతి వెంకటకవులు కవితా సింహాసనాన్ని ప్రతిష్ఠించింది. ఆ కవితా సింహాసనానికి త్రికరణశుద్ధిగా మొక్కిన సాహిత్య తపస్వులే, ఘనులే – అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి, వేటూరి ప్రభాకరశాస్త్రి, త్రిపురనేని రామస్వామి చౌదరి మున్నగు మనీషులు. ఆ కవితా సింహాసనం భగభగలలో స్నాతులే – వేలూరి శివరామశాస్త్రి, రాయప్రోలు సుబ్బారావు, విశ్వనాథ సత్యనారాయణ, పింగళి లక్ష్మీకాంతం, కాటూరి వెంకటేశ్వరరావు గార్లు మొదలయినవారు.

దేశంలో ఎందరెందరో కవులు పండితులు పుట్టారు. తమ తమ ప్రాభవాన్ని చెల్లించి పోయారు. తిరుపతి వెంకటకవుల విద్యావంశంవంటి విద్యావంశాన్ని మరి చూడబోము. తెలుగుదేశంలో పద్యగద్య విద్యాపసాధులయినవారు, నెమ్మదిగా తమ విద్యావంశం మూలం స్మరిస్తే—ఎంత ఎందరికో—తమ విద్యావంశం తిరుపతి వెంకటేశ్వరులదిగా తేలుతుంది. వీరందరూ ఏవో నాలుగు పద్యాలు ఎప్పుడో గీకి—మీసాలపై తేనియవంటి కీర్తితో వర్తించినవారు కారు. దివాకర్ల తిరుపతి శాస్త్రిగారు— "విద్యావంశము పేరు నిల్పగదవే విద్యారతీ!" అని చెప్పిన ఆదేశాన్ని తమ తమ శిష్యులకు కూడా అన్వర్థం అయ్యేట్లు చేసినవారు. బందరులో ఒకపక్క ఇట్లాంటి వాతావరణం ఉండేది. భారతదేశంలో జాతీయ కళాశాల ఒకం ప్రథమంగా వెలిసింది బందరులోనే. కాంగ్రెస్ చరిత్రను, కాలంతో పరుగెత్తుతూ వ్రాసిన ఘనుడు—కాంగ్రెస్ గద్దెనెక్కిన మొదటి ఆంధ్రుడు భోగరాజు పట్టాభి సీతారామయ్య, తెలుగు దేశానికి ఒక ప్రజ్ఞానేత్రంగా కృష్ణాపత్రికను నడిపిన ముట్నూరి కృష్ణారావు. కోపల్లె హనుమంతరావు గార్లు ఆ బందరువారు—లాల్, బాల్, పాల్ లవంటివారై వాసిగాంచారు. ఈ ఈ అతిరథులూ, మహారథులూ అర్ధరథులూ ఒకపక్క ఉండేవారు. ఇంత సంస్కారబలం ఉండేది గనుకనే — తెలుగుల సంస్కృతికి మూల స్తంభాలలోనిది అయింది బందరు. అచటి గాలికొక విశిష్టమైన తీవ్రత, అచటి మిఠాయికొక విశిష్టమైన విశిష్టత, అచటి నీటికొక తేట, అచటి మాటకొక నీటూ, అచటి తోటాలకొక ప్రతాపం వుండేవి. ఇట్లాంటి వాతావరణంలో పెరిగి పెద్దవాడై ప్రతిష్ఠావాచకుడైనవాడు డి. వి. సుబ్బారావుగారు బాలనటుడై, నటుడై, నటరాజై నటరాజశేఖరుడు అయ్యాడు.

సుబ్బారావు సంపన్నుల ఇంటిబిడ్డ కాడు. బొడ్డున మాణిక్యం పెట్టుకొని పుట్టలేదు. ఏ గొప్పవాడికో దగ్గిర రక్తబంధువు కాడు, ఆయన పేరు ముందు పెట్టుకొని చెప్పుకొని పోవడానికి. విద్యాధికుడు కాడు. పెద్ద పెద్ద ఉద్యోగాలు వెలిగించలేదు. ఒక సామాన్యుల ఇంటిబిడ్డ. చకచకా పైకిరావడానికి సందు ఇవ్వని సంసారుల పిల్లవాడు. హైస్కూలు చదువు కూడా ముగించుకొనేపాటి పరిధవం కలవాడు కాడు. సాంసారక తాపత్రయాలకు లొంగి రంగస్థలంమీదికి దూకాడు. సహజమైన కళాభిరుచి నాటకరంగానికి లాగింది. పదమూడు పద్నాలుగేళ్ళ ప్రాయంలో, బందరు భువనరంజనీ థియేటర్‌లో మంజువాణి అనే బాలికత్తెగా రంగు పూసుకున్నాడు. లసర్ దీపాల తక్కువ కాంతిలో ఆ మంజువాణి తన ఉత్సాహ దీప్తులతోనే ప్రకాశించింది.

ఆనాడు రంగస్థలంలో కాంతికోసం లస్టర్ దీపాలు వుపయోగించేవారు. ఆ లస్టర్ దీపాలు రంగానికి అటూ యిటూ వెలుగుతూండేవి Footlights గా చిమ్నీ దీపాలు వుండేవి. గానానికి సహాయంగా ఫిడేలు వుండేది. అంతే. ఆ తరువాత గ్యాసులైట్లు వచ్చాయి. ఆ తరువాత విద్యుద్దీపాలు హార్మోనియం తబలాలూ "సైడు పక్క"నూ. నేడు సినిమా పద్ధతులు వెలుగొందుతున్నాయి. లస్టరుదీపాల తక్కువ కాంతిలో ఆనాడు ప్రకాశించిన నట శిఖామణుల అభినయవిన్యాసాలకూ ఈనాటి నటుల స్పాట్‌లైట్ కింద విన్యాసాలకూ చాలా తేడా వుండటంలో వింత వుండదు.

భువనరంజనీ థియేటర్‌లో సుబ్బారావు వున్నది రెండు సంవత్సరాలు. మూడు రూపాయలు నెలకు జీతం. నాలుగు రూపాయలు జీతం చెయ్యండి అని సుబ్బారావు కోరితే ఆ కంపెనీవారు తిరస్కరించారట. ఒక సంగతి—కళాప్రపూర్ణులు వేదం వేంకటరాయశాస్త్రిగారు పరిసీపట్నం అసిస్టెంట్ కలెక్టరు ఆఫీసులో కాపీస్టుగా పని చేశారు. 'జగదాశ్చర్యకరావధాన కవితాసంపత్తిగల చెళ్లపిళ్ళ వెంకట

శాస్త్రిగారు, ఓ హైస్కూలులో తక్కువ జీతానికి కుదురుకోవలసినవారైనారు. నటపితామహుడని కీర్తింపబడిన హరిప్రసాదరావుగారు కొవ్వూరు రైల్ స్టేషన్‌లో సిగ్నలర్‌గా కాలక్షేపం చేశారు. రంగోద్ధారకుడు బళ్లారి నాగరాజరావుగారు డ్రాయింగు మాస్టరుగా జీవయాత్ర చేశారు. మేలితరగతి నటుడు ముంజులూరి కృష్ణారావుగారు హోటల్ గల్లంతుతో సతమతమయ్యారు. డి. వి. సుబ్బారావుగారు కొంతకాలం, నెలకు నాలుగు రూపాయల జీతం తెచ్చుకుంటూ ప్లీడరు గుమాస్తాగా రోజులు వెళ్ళదీశాడు. ఈ సందర్భంలోదే ఈ ముచ్చట—

ఒక సంపన్నుడైన ప్లీడరుగారికి గుమాస్తా కావలసి వచ్చింది. సుబ్బారావుగారు తనకు ఆ పని ఇప్పించమని అడిగాడు. "అదుగో యిదుగో, రేపురా, మాపురా" అంటూ ఆ ప్లీడరు పదిహేనురోజులు తిప్పాడు. చివరికి—'అబ్బాయి! నువ్వేమో నాటకాలలో ఆడవేషాలు వేస్తావుట. మా యింట్లో ఎదిగిన ఆడపిల్లలున్నారు మరి. చూస్తూ చూస్తూ నిన్ను గుమాస్తాగా పెట్టుకోలేను." అని చెప్పి పంపారట. ఆ మాటల సొంపు ఆ అన్నగారికే తెలియాలి గాని, ప్లీడరు గుమాస్తాగానే సుబ్బారావుగారు ఉండిపోవలసివస్తే మాత్రం తెలుగుల నాట్య రంగస్థలానికి లోటు వచ్చేది. ఆ నష్టం రాకుండా చేసి ఆ ప్లీడరుగారు పూజ్యులయ్యారు.

1908 నుంచి 1910 దాకా భువనరంజనిలో సుబ్బారావుగారు నాభిరామం, చంద్రకాంత, చారుమతి, నందినీవర్ధనీయం, కుశలవ, లంకాదహనం, ప్రసన్నయాదవం, రసపుత్ర విజయం పాఠం చేశారు. పాఠం చెయ్యడం అంటే—తన పోర్షన్ కాగితాలు చూసుకుని రంగం ఎక్కి, అప్పచెప్పిరావడం కాదు. తన పాత్ర పోర్షనే కాక నాటకం అంతా వాచోవిధేయంగా వుండడం. మంజువాణి, చిన్న చంద్రకాంతుడు, సీత, అక్షయకుమారుడు, చారుమతి పాత్రలను ధరించేవాడు. "సుబ్బారావు స్త్రీ పురుష వేషము రెంటిని సమానపాత్రౌచిత్యముతో నిర్వహింపగలిగియుండెను" అని నాట్యాంబుజం (116 పేజీ).

భువనరంజని వారిని - సుబ్బారావు కోరేది తనకు జీతం ఐదు రూపాయలు చెయ్యమని. వారు ససేమిరా అన్నారు. అభిమానధనుడైన సుబ్బారావు ఆ కంపెనీ నుంచి వైదొలగాడు.

ఆ మర్నాడు—

సుబ్బారావుకోసం ఒకరు కాపు వేసుకుని ఉన్నారు. ఆయనే ఇండియన్ డ్రామెటిక్ కంపెనీ స్థాపకుడు, బళ్లారి బ్రహ్మానందం. ఈ బ్రహ్మానందం డి. వి. సుబ్బారావు అంటే పంచప్రాణాలుగా చూసుకుంటాడు. సుబ్బారావుకోసం ఏ త్యాగమైనా చేస్తాడు. తన చెవులకున్న ఎర్రరాళ్ళ కమ్మలను తీసి, మెరుగు పెట్టించి తెచ్చి సుబ్బారావు చెవులకు పెట్టాడు. ఆనాడు ఎర్రరాళ్ళ కమ్మలంటే - అమ్మో! ఎంతో ఫాషన్! డి. వి. సుబ్బారావును బ్రహ్మానందం ఇండియన్ డ్రామెటిక్ కంపెనీలోకి చేర్చాడు. ఇది సుబ్బారావు అనుకోని సంఘటన. ఆ (1910) నాటి నుంచీ సుబ్బారావు ఇండియన్ డ్రామెటిక్ కంపెనీని చివరిదాకా వదలలేదు. తానే ఆ కంపెనీగా వ్యవహరించాడు.

1910 సంవత్సరం నాటి పరిస్థితులివి:

"ప్రథమకాలమునందు ఆంధ్రులకు ఆంధ్రమునందు అభిమానము లేకయుండెను. మన ప్రబంధములు బూతులనియు మన శాస్త్రములు కల్లలనియు, మన ఆచారము లమానుషములనియు, నేర్చుకోవలసినది ప్రేమింపవలసినది ఆంగ్లేయమేనన్న యభిప్రాయము జనసామాన్యమున వ్యాపించియుండెను.

"1901 మొదలు 1906 వరకు జరిగిన ఐదు సంవత్సరముల ద్వితీయకాలములో హిందూదేశమందొకింక సమస్తవిషయములందు వెలిగియుండెను. మన కేవిధమైన నాగరికత, శాస్త్రములు, మర్యాదలు శిల్పాది కళలు వున్నవి? మనము మనుష్యులమేనా? పశువులమా? మన ప్రభువులు మనకు ఎక్కువ కారా? అను శంక కలుగసాగెను. ఈ కాలములో కొన్ని చరిత్ర నాటకములు, కొన్ని ప్రబంధాత్మకమైన నాటకములు ప్రచురింపబడుచుండెను. 1906 తో మూడవ కాలము ప్రారంభమగుచున్నది. మన మంచిచెడ్డలు మనచేతులలోనే యున్నవనియు, మన సంఘమభివృద్ధిలోనికి రాదలంచిన యెడల, సంఘ సంస్కరణమున్న సంఘములోని పూర్వచరిత్రలను విద్యలను ఆచారములను బ్రతికించి వాని వెలుగున నూతన మార్గము ద్రొక్కవలయునని ప్రజలకు గోచరించినది. చక్కని ప్రబంధములు అన్నియు నాటకములుగా మార్చబడినవి. వీరరసమును పుట్టించు భారత కథలు మిక్కుటముగా నాటకములలో జేర్చనవి" (పురాణం సూరిశాస్త్రి, నాట్యాంబుజం).

సంస్కృతిపరమైన వాతావరణం దేశంలో ఎలా వుండేదో పై పంక్తులు స్థూలంగానైనా చెప్ప గలవి. ఆ వాతావరణంలో, నవ్యభావోదయ వేళల్లో డి. వి. సుబ్బారావు బాలనటుడై తన జీవయాత్రను ప్రారంభించాడు.

ఇండియన్ డ్రామెటిక్ కంపెనీలో సుబ్బారావు "హాస్య ఓం" అని చదివి, మననం చేసి, రక్తి కట్టించింది 'సతీబకావళి' నాటకం. ఆ తరువాత ఆయన ఎన్నెన్ని వేషాలలో ధరించి ప్రజలకు సంతోషపు విందులు చేశాడు

ఈ నాటకంలో యశోద, మరో నాటకంలో జాలి కొని వెంకయ్య-ఇట్లా మారుతూండేవాడు. గయోపాఖ్యానంలో అర్జునుడుగా నటించేవాడు. "గజ్జెలందియలు ఘల్లు ఘల్లు మ్రోయ", "కడమున నెవ్వడైన" అన్న పద్యాలు సుబ్బారావు వ్యాఖ్యాన దీధితులతో ధగధగలాడి, నటసాధకులకు ఆదర్శపాఠాలు అయినవి. గయోపాఖ్యానంలోని అర్జునపాత్రను ఎంతగా వ్యాఖ్యానించి మెప్పుల జడికి నిలబడ్డాడో, అంతగానూ ప్రశంసావర్ష పాతానికి నిలబడ్డాడు శ్రీకృష్ణ నిర్యాణంలో అర్జునపాత్ర ధరించి. ఒక్క శ్రీకృష్ణ వేషాన్ని — సాత్రాజితీయం, ప్రపన్న యాదవం, పాండవోద్యోగం, పాండవ విజయాలలో నటించి, ఎక్కడికక్కడికి ఎప్పటి కప్పటికి నవం నవంగా భాసించాడు. తన నిరుపమాన గానాభినయాలచే ప్రేక్షకహృదయాలపై చెరగని ముద్ర వేశాడు.

ఒక్క హరిశ్చంద్రలోనే డి. వి. సుబ్బారావు చంద్రమతిగానూ నటించాడు; హరిశ్చంద్ర సార్వభౌముడుగానూ నటించాడు. హరిశ్చంద్ర నాటకం ఆయనకు అభిమాన నాటకం అయినా కాకున్నా, తెలుగులకు డి. వి. సుబ్బారావు హరిశ్చంద్రుడుగా ఎక్కువవాడు అయ్యాడు. బి. టి. రాఘవాచార్యులు గారనే విద్వాంసులు నాటకాలంటే ప్రాణం ఇచ్చేవారు. ఈయన్నే అష్టతలకాయల ఆచారి అంటారు. ఈయన నటులకు శిక్షణ యివ్వడంలో ఘటికుడు. ఈ బి. టి. రాఘవాచార్యులు గారే ఆ తరువాత 'భరతముని బృందం' అనే నటసంస్థను ఏర్పాటుచేసి తన ఆదర్శాలను సఫలం చేసుకోవాలని చేతులు కాల్చుకున్నారు. ఈయనకూ డి. వి. సుబ్బారావుకూ స్నేహం చంద్రమతి, హరిశ్చంద్ర బాహుక వేషాల సందర్భంలో, సుబ్బారావుకు ఈ రాఘవాచార్యులు గారే శిక్షణ నిచ్చారు. పారుపల్లి సుబ్బారావుకు (రాధాకృష్ణ) రాధపాత్ర నిర్వహణకు శిక్షణ నిచ్చి తీర్చిదిద్దింది ఈయనే.

అది 1916, 17 సంవత్సరాలు. గుంటూరులో హరిశ్చంద్ర నాటకం పోటీలు. డి. వి. సుబ్బారావు చంద్రమతి పాత్రకు సిద్ధం అయ్యారు. కాని, హరిశ్చంద్ర పాత్ర ధరించాడు. ఆనాటి సంగతి—

తెర తీశారు. వేటకుపోయిన హరిశ్చంద్రుడు పెద్దపులులను గూర్చి పద్యం పాడుతూ రంగంమీదికి అవతరిస్తాడు. సుబ్బారావు సగం పద్యాన్ని నేపథ్యంలోనే పాడాడు. చుక్కలాంటి మనిషి, ధనుర్ధరుడు, వర్చస్వి రంగంమీదికి వచ్చారు. పద్యం పూర్తి అయింది. హరిశ్చంద్ర నాటకాన్ని రచించిన బలిజేపల్లి లక్ష్మీకాంతం పట్టలేని సంతోషంతో బిగ్గరగా అన్నారట—"వాచకం, ఎంత బాగుంది! పద్యాన్ని ఎంత గొప్పగా అన్నాడ్రా!" అని.

అరణ్యానిలోని వివిధ క్రూరమృగాలను ఎదిరించి వాటిపైకి కుప్పించి ఎగసిపడి, చీల్చి చెండాడేవాడు. దయాసత్యశౌచాలకు కుదురు అయినవాడు, చతురంబోధిపరీతభూవలయాన్ని పరిపాలించగలవాడుగా డి. వి. సుబ్బారావుగారు తోచి ప్రేక్షకుల మనోబుద్ధిచిత్తాహంకారాలను ఆక్రమించుకున్నారు. సగం నాటకం అయ్యాక హరిప్రసాదరావు అన్నారు— "ఏమిటోయ్! మిమ్మల్ని మించిపోతున్నాడు." అని, హరిప్రసాదరావుగారి ఆ మాట అక్షరాలా నిజం అయింది. సుబ్బారావు హరిశ్చంద్రుడుగా తెలుగుదేశం అంతటా ఆసీ, పాసీ, అఖండమైన విజయాన్ని సంపాదించాడు. 1917 లో గుంటూరులో హరిశ్చంద్ర పాత్రధారిగా విజయశ్రీ సనాథుడైన డి. వి. సుబ్బారావును దేశం మరవలేదు. ఆయనా అక్కడితో ఆగిపోలేదు.

హరిశ్చంద్ర పోటీలో గెల్చాక మాట — డి. వి. సుబ్బారావు చంద్రమతి; మల్లాది గోవింద శాస్త్రి హరిశ్చంద్రుడు. బందరు గొడుగుపేట హాలులో నాటకం. గోవిందశాస్త్రి గారు 'జవదాటి ఎరుగదీ యువతీలలామంబు' అని పాడాడట. చంద్రమతి వేషంలో ఉన్న సుబ్బారావు సంతోషం పట్టలేక, శాస్త్రి గారికి నమస్కరించాడట, భార్య భర్తకు నమస్కరించినట్లుగా. ఇది ఆయిన బహుకాలానికి, డి. వి. సుబ్బారావు తన కుమారునికి చెప్పినమాట లివి: "నాన్నా! నేను హరిశ్చంద్రుడు వేషం వేశాను! దేశం

# నటరాజ శేఖరుడు డి. వి. సుబ్బారావు

హర్షించింది. నిజమే ననుకో. మల్లాది గోవిందశాస్త్రి గారు హరిశ్చంద్రుడుగా, నేను చంద్రమతిగా ఒక సారి నాటకం ఆడాము. ఆనాడు గోవిందశాస్త్రి 'జవదాటి యెరుగడే' పద్యం చదివాడు! ఏం గొప్పగా చదివాడు అని. నేను అట్లా ప్రయత్నించి కూడా అనలేను!" అని. మరొకరిని మనస్ఫూర్తిగా మెచ్చుకోగల సహృదయత దైవం ప్రసాదించే వరాలలోది. ఈ వరంతో పుట్టినవారు తాము అందలము ఎక్కగలరు; మరొకర్ని అందలం ఎక్కించగలరు.

'దేవ బ్రాహ్మణ్యముల్ విడిచి' రాజ్యమంతా కౌశికునికి ధారపోసే సందర్భంలో విశ్వ ప్రతిధాత అయిన విశ్వామిత్రుని చేయి కిందు కావడం, మీది తన చేయి వుండడం, 'రాజ్యము గీజ్యమున్ పతితమే, కాయంబు నాపాయమే' అన్న భావంతో పాటు, దాతకు సత్పాత్ర దొరికినప్పటి ఆనందాన్ని నటించి డి. వి. సుబ్బారావు మూటగొన్న యశస్సు అసాధారణం అయింది.

ప్రధానపాత్రలు ధరించేవారు సాధారణంగా ప్రతినాయక వేషాలకు, చిల్లర వేషాలకు మొగ్గరు. కించిదూన ప్రాధాన్యంగా పాత్రలను ధరించడం వారికి కులనవం కొల్లగొట్టబడినట్లుగా వుంటుంది. స్త్రీపాత్రధారులు మొగవేషాలజోలికి పోరు. స్త్రీ పాత్రధారులలో కూడా—ఒక తరహా పాత్రలను ధరించేవారు మరొక తరహా పాత్రలను ధరించరు. అల్లా అయితే పాకం తప్పుతుందని వారికి తెలుసు. సాధ్వీపాత్రలను ఒప్పించడంలో నిరుపమానస్వామి అయిన ముప్పిడి జగ్గరాజుగారు చింతామణిగాను, భవానీ శంకరుడుగారూ రక్తి కట్టించి వుంటారన చెల్లదు. డి. వి. సుబ్బారావు పట్టుబట్టల ఆహార్యంతో భవానీ శంకరుడై గడించిన ప్రాభవం అంతా యింతా కాదు.

హరిశ్చంద్ర పాత్రధారిగా నిన్న రాణించిన సుబ్బారావు, మరి రెండురోజులకు పఠాన్‌గ రాణించేవాడు. డి. వి. సుబ్బారావుగారిలోని గొప్ప విశేషం ఇది. ఆయన ఏపాత్ర ధరిస్తే—ఆ పాత్రలో మునిగిపోయేవాడు. ఆ పాత్రే కనిపించేది. ఆ పాత్రను మరొకరు అల్లాగ చేయలేరు అన్నట్లు నిర్వహించేవాడు. ఇక్కడ తాడిపత్రి రాఘవాచార్యులుగారు అటూ, సుబ్బారావుగారు ఇటూ. రాఘవాచారి ఏ పాత్ర ధరించినా మనకు కనిపించేది రాఘవాచారే. పాత్రధారి కనబడగూడదు, పాత్ర కనిపించాలి. ఇందుకించుకగాను—ఆహార్యం మొదలయినవన్నీని. ఎన్ని తొడుగులు తొడిగినా వేషం మాయమై, వేషధారి వెలుగులోకి రావడం గొప్పదికాదు. భ్రమ కల్పించలేనివాడు మరెవరైనా కావచ్చుగాని నటుడు కాడు. నెల్లూరు నాగరాజరావుగారు పాపారాయుడుగా వస్తే పాపారాయుడే; యుగంధరమంత్రిగా వస్తే యుగంధర మంత్రే. శకునిగా వస్తే శకునే. ఆయన ఆహార్యం చూపించే నేర్పు కూర్పులు నిస్తులాలు. అల్లాగే డి. వి. సుబ్బారావు హరిశ్చంద్రలో హరిశ్చంద్రుడే. పాండవ విజయంలో శ్రీకృష్ణుడే. నా రాజులో—"నా విధి నేనే నియమించుకొందును స్వయం వేనస్క్రి మూర్ఛభిన్నై" అన్న విశ్వపతే. ఫాల్ ఆఫ్ విజయనగర్ లో పఠానే.

పురాణం సూరిశాస్త్రిగారి వాక్యాలు ఇవి:— "నేను చూచిన పఠానులు బళ్ళారి రాఘవాచారిగారు అందమైన విగ్రహము కలిగి, యావాబితి డి శృంగార ఘట్టములందును, తుట్టతుదను బీభత్స ప్రదర్శనము నందును చక్కగా అభినయించుచున్నారు. వీరి బ్రహ్మతేజము పఠాను దుస్తులలో మరుగుపడలేదు. రోషావేశము వీరి ముందంత కనపడలేదు. బందరులోని దేవరకొండ వెంకటసుబ్బారావుగారు విగ్రహమున చిన్నలయినను, కొంత గాంభీర్యమున లోపము కలిగియుండినను, వారి నైజరూపగుణములు పఠాను మీస గడ్డములచాటున మరుగుపడి... రోష భీషణ స్ఫురణ మానేత్రములనుండి యెంతగా వెలువడుచున్నను, మన పఠాను నైజగుణము లన్నిటిని అతి శ్రద్ధతో విమర్శించి చక్కగా అభ్యసించి, ప్రవేశము మొదలు తుదివరకు పఠాను నైజస్వభావమును స్వాభావికముగా ప్రదర్శించిరి. పఠానునికి భావసంక్షోభము కలిగినప్పుడును, ఆశాభంగసమయమునను నాటకాంత ఉన్మాదమునను వీరు కోలాచలం శ్రీనివాసరావుగారి నాటకానికి చేసిన రూపక వ్యాఖ్యానము మిక్కిలి జాగరూకతతో, రసజ్ఞతతో విశేషాభ్యాసముతో జగత్ స్తవనీయముగా చేసిరి" (నాట్యాంబుజం). పై వాక్యాలు గమనించతగినవి. ప్రారంభం ఎట్లావున్నా నిజం దాగలేదు ఆ వాక్యాలలో.

నాటకం అంటే సమష్టికృషి. అన్ని పాత్రలకూ, అన్ని పాత్రధారులకూ నాటకం రక్తికి రావడంలో బాధ్యత వుంది. ఏ ప్రధాన పాత్రధారో

గొప్పగా నటించి, మిగిలినవారు తట్టుకొగలేస్తే—ఆ ఆట అట్లాగే వుంటుంది. ఇందుకింకను గాను, శిక్షణ అవసరం. సాహిత్యంలో ప్రతిమాటకూ ఎలాగ సార్థకత వుంటుందో, జీవితంలో ప్రతిమనిషికీ ఎట్టి స్థానం వుంటుందో, నాటకంలోనూ అంతే. నాటకాన్ని కాళిదాసు "కాంతం క్రతుం చాక్షుషం" అనీ, "నాట్యం భిన్నరుచేర్జనస్య బహుధాప్యేకం సమారాధనం" అనీ (మాలవికాగ్నిమిత్రం ప్రథమాంకం), చెప్పిన మాటలను ప్రతినటుడూ అస్థిగతం చేసుకోవలసివుంటుంది. ఆనాటి ప్రసిద్ధనటులు కట్టుబాటును కాదన్నారు. ఎవరికి వారు హిమాలయాలంత ఎత్తున కనబడాలని తాపత్రయపడ్డారు. ఇది ఒక ఉద్యమమా? అన్నట్లుగా సాగింది. ఈ ఉద్యమానికి పరోక్షంగానో ప్రత్యక్షంగానో బళ్ళారి నట సార్వభౌముడు నాయకత్వం వహించాడు. లోకస పిల్లుబికి ప్రవహిస్తున్నది కాలంలో. సంస్కృతి ప్రచారకులు అయిన నటులు దీనికి దోహదం చెయ్యడం ప్రారంభించారు. ఎవరికి వారే వెలగాలంటే—విశేషం కావలసి వచ్చింది కబీరు పాత్రను ధరించి ఒకరు 'కహాఁ కొతిగి సే' అన్న పాట ప్రారంభించి 'కహాఁ' అన్న ముక్కను గావుకేకగా నాలుగైదు నిమిషాలు శ్రుతిలో కలిపి అరిచేవారు. ఇంకొకరు ఈలపాటను ఎత్తుకొనేవారు. కె. రఘురామయ్యగారు ఏ వేషం ధరించినా, ఆయన ఈలపాట పాడాలిసి వచ్చేది! కపిలవాయి రామనాథ శాస్త్రిగారు ఏ వేషం వేసినా తాను గ్రామఫోను కంపెనీకి రికార్డులు ఇచ్చిన పాటలను పాడి నమస్కరించి వెళ్ళిపోయేవారు! మరొకరు "ఘత్తినం కోయ మారోయ్ బావా!" అని అందుకొనేవారు ఏ వేషంలో మునిగివున్నాను. సమష్టి ప్రయత్నం చచ్చింది. ఇక ప్రేక్షకులు కూడా అల్లాగే వుండేవారు. అభినీతమైన సీనును తిరిగి అభినయించమని, సందర్భశుద్ధి లేనిపాటలు పాడమనీ కోరి, పట్టుబట్టి నెగ్గేవారు. అల్లూరు సభ వారు రామదాసు నాటకం ఆడితే, పర్వతరెడ్డి రామచంద్రారెడ్డిగారివంటి మహానటుని కబీరు కాదు ప్రేక్షకులు కావలసింది, అహమ్మక్ షా-బీబీల చిల్లర శృంగారం. లచ్చారెడ్డిగారు అహమ్మక్ వేషాన్ని అంతంగా అభినయించేవారు; నిజమే. కాని ప్రజలు తిరిగి అసీన చే అభినయించమనడం, నటులు అభినయించడం గువ్వారి రామిరెడ్డిగారివంటి సౌమ్యుణ్ణి కూడా కలతపెట్టింది. (నాటక కళా సంస్కరణం వ్యాసం) కంట్రాక్టు నాటకాలు వెలిశాయి. ప్రసిద్ధులయిన నటులను ఒకచోటికి చేర్చేవారు. వారు వచ్చేవారు. కలెక్షన్ కనకవర్షం కురిసినట్లుగా వుండేది. నాటకం రోజున రాత్రికి నటులు హాలుదగ్గిరికి చేరేవారు. వారూ వీరూ కలిసి సంప్రదించుకోడం లేదు. రంగస్థలాన తమ తమ స్థానాలను చూచుకోవడం లేదు. చివరకి వీరందరికీ ఒక పాఠం అయినా కాదు. ఎవరి పాఠం వారిది, ఒకే యితివృత్తాన్ని ఎవరికి వారు ఏ పూరకవిచేతనో వ్రాయించుకొనేవారు. దాన్నయినా చదివి మననం చేసేవారు కారేమో. అప్పటి కప్పుడు ఆశువు చెప్పి దాటుకొని పోలేమా అనే ధీమా ధైర్యమని నలిగేది వారిలో. ఫలితం—పొందికలేని పాఠం, ఏదో పింజారీ పాఠం తయారు అయ్యేది. క్రమశిక్షణ కొలిపోయింది గనక, ఎవరికి వారు గుమ్మడికాయలంత ముత్యాలుగా కనబడిపోయేవారు! రసాభివ్యక్తికంటె రసాభాసయూ, నియమనిష్ఠలకంటె విశృంఖలత్వమూ పెరిగి—నాటకం బూటకంగా తయారయ్యేది.

ఈ విధానానికి ఎదురీత యీది నిల్చినవాడు డి. వి. సుబ్బారావు. తాను ఎంత ప్రఖ్యాతుడైనా, తన ఒక్కడికే సంచులు కుమ్మరిస్తారని ఆశలు పెట్టేవారు పోగయినా, అది భప్పభప్పన లాభించేది అయినా, ఆయన తన నటసంఘాన్ని వదలలేదు. తన క్రమశిక్షణను, నాటక పాఠ శిక్షణను, తన నియమాలను వదలలేదు. సమష్టి ప్రయత్న ఫలితం నాటకం విజయం గాంచడం అని మరవలేదు. తాను, తన నటసంఘం అభాసుపాలు కాలేదు.

కాలానికి కట్టుబడి తానూ కంట్రాక్టులు ఇచ్చినా, మితంగానే సొమ్ము పుచ్చుకున్నాడు. డబ్బు చేదా అని పొగరు కోసుకొని పాలుతాగుదాం అనుకోలేదు.

మాలకరి పుష్పములు గోయు మాడ్కిఁ జేటి
పువ్వుఁదెరి యూఁగొనియెడి పోల్కిఁ జెఱుచు
గంపకుండంగఁ గొనునది కార్యఫలము
బొగ్గులకుఁబోలె మొదలంటఁ బొడుచఁజనదు.

[భారతం, ఉద్యోగపర్వం 2 వ ఆశ్వాసం]

అన్న తిక్కన్నగారి నీతిని సుబ్బారావు సర్వత్రా పాటించాడు; కృతకృత్యుడయినాడు.

డి. వి. సుబ్బారావుగారి ప్రాభవం అంతా ఆయన పద్యం పాడడంవల్ల వచ్చిందేగాని — అనేవారున్నారు. అంటే వారు తత్ క్షణంలోనే మరుపు

కావడానికి వీలు ఉన్న అభినయాన్ని కళ్లకుకట్టినట్టు చూపక — చెవుల్లో గింగురుమనే పద్య సంగీతాన్ని మాత్రమే అనుభవిస్తున్నారన్నమాట! డి. వి. సుబ్బారావుగారి పద్యపఠనం అంతనా? అని తెలిసినవారు ఇలా చెబుతారు: తెలుగుపద్యాన్ని అనడంలో నలుగురు మార్గదర్శకులు. ఒకరు: నెల్లూరివారు, కందాళై శ్రీనివాసన్ గారు. ఈయన్ని దొరస్వామి అంటారు. దొరస్వామి దుష్యంతుడు బహుప్రసిద్ధుడు. ఈ దొరస్వామి పద్యం అనడంలో ఓ విశేషం వుంది. పద్యం అయ్యాక కూడా రాగం విస్తరింపచేసేది పద్యగతభావాన్ని చివరిరాగం విస్తరింపువల్ల కూడా అనుభవించడానికి అని ప్రారంభం అయిన దీ పద్ధతి. ఈ కోవకు చెందిన వారే జొన్నవిత్తుల శేషగిరిరావు ప్రభృతులు. పద్యం అయ్యాక వారి వారి గుక్క బలంతో, రాగాలాపన బలంతో నలుగుపెట్టేవారు.

రెండవవారు: హరిప్రసాదరావుగారు. వారి సంగీత నైపుణ్యం అంతా పద్యం అనడంలోనే ఇమిడేది! పద్యం అయిందంటే పాడినట్టుగా అయిపోయేది!

మూడవవారు: బలిజేపల్లి లక్ష్మీకాంతంగారు. పద్యంతోపాటు సంగీతం అయిపోవడం మాత్రమే కాక, ఏ మాటను ఎలాగ అనాలో అనడం ఈయన విశేషం.

నాల్గవవారు: డి. వి. సుబ్బారావు. పద్యం అంటూంటే - సంగీతం చెవుల తుప్పు వదిలించేది. గానం చెవుల్లో గింగురెత్తించేది. పద్యగత సందర్భం విశదపరిచేది. మాటకు ఎంత ఊతం ఇవ్వాలో మోతాదు, సరిపడేది. అర్థస్ఫూర్తి అందరికీ కలిగేది. శ్రావ్యంగా గంభీరంగా వుండేది.

కొందరు అంటారు గదా, "డి. వి. సుబ్బారావుకు ఓ బాణీ అంటూ వుంది. బాణీ అనేది వుండకూడదు. బాణీ ఒక చట్రంలాగా వుండి అడ్డుపడుతుందీ!" అని. బాణీ అన్నది తప్పుగాదు. అది ఓ ప్రమాణం (Standerd). అంటే, బాణీ అంటూ వున్నవారి కృషి ఎన్నడూ ఆ మామూలు స్థాయికి కిందపడదు. ఆ మామూలుస్థాయిని ఆ ఆ విద్వాంసులు మించి సంచరిస్తూనే వుంటారు. మిగిలిన కళల్లోనూ యీ యిది వుంది. అవనీంద్రనాథ ఠాకూర్, గగనేంద్రనాథ ఠాకూరు, నందలాల్ బోసు, మహమ్మద్ అబ్దుర్ రహమాన్ చొగతాయి, దేవీ ప్రసాదరాయ్‌చౌధురి, ప్రమోదకుమార ఛటర్జీ, దామెర్ల రామారావుల చిత్రాలను చూడగానే తెలుస్తుంది, వారి బాణీ. అది వారి ప్రత్యేకత. ప్రతివారికీ బాణీ అంటూ ఏర్పడదు. నవీనాంధ్ర కవులలో కూడా శ్రీ వేలూరి శివరామశాస్త్రి, శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి, శ్రీ శ్రీ, శ్రీ గుడిపాటి వెంకటచలం, శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రి గార్ల రచనలు చదువుతూంటే — యిట్టే తెలిసిపోతుంది. శ్రీమతి ఎం. ఎస్. సుబ్బులక్ష్మి, శ్రీమతి డి. కె. పట్టమ్మాళ్‌ల గాత్రసౌష్ఠవం, ద్వారం వెంకటస్వామి నాయుడు గారి వయొలిన్ నాదం, పన్నాలాల్ ఘోష్ గారి వేణునాదం, బిస్మిల్లాఖాన్ గారి సన్నాయి, అలీ అక్బర్ ఖాన్‌గారి సరోద్, పాల్ఘాట్ మణిఅయ్యర్ గారి మృదంగనాదం — పేరు తెలియనప్పుడు కూడా యిట్టే తెలిసిపోతుంది. అది వారి వారి బాణీ మహిమ. డి. వి. సుబ్బారావుగారికి స్వంతబాణీ వుందని విచారించనక్కరలేదు.

నటలోకంలో నియమనిష్ఠలు తక్కువగా వుంటాయి. విద్యాప్రీతి ఎంతగావున్నా సమయం కుదరదు. ఎప్పటికప్పుడు ఏదో ఒకటి అడ్డంకి వస్తూండడం, చేసినపని రక్తికీ రంగానికీ రావడం, చేతిలో నాలుగు పిచ్చుకలు ఆడుతూండడం, పేరు పెంపులు ఏర్పడడం. కొందరు అయినా ఆరాధకులు అమరడం, వయఃపాటవం వీట్లవల్ల కొందరైనా విచ్చలవిడితనపు జీవితానికి బాహాటంగా దిగుతారు. మహా ఉదాత్త ప్రకృతుల తద్భావభావనల బలంవల్ల ఆ ఆ మహాపురుషులను కళ్ళకు కట్టిచూపి, జనసామాన్య మనోమాలిన్యాలను కనబడకుండా కడిగివేయగల నటుడు వీళ్లల్లో పడితే — అపాంక్తేయుడుగా నలుగురినోళ్ళల్లోనూ పడతాడు. కాని, ఏ కొందరో, తమకు తామై నియమ శృంఖలాలను తగిలించుకొని, విద్యాదీక్షలో మునగానాం తేలానాంగా వుంటారు; చిత్తశుద్ధితో జీవిస్తారు. వీరు తమ నటలోకంలోనూ, మిగిలిన లోకంలోనూ గౌరవప్రతిష్ఠలను చూరగొంటారు.

డి. వి. సుబ్బారావుగారు ముట్నూరి కృష్ణారావుగారివలె మితభాషి. వావిలాల శివావధానులగారివలె నియమనిష్ఠలు గలవాడు. కె. టి. రామారావుగారివలె కుదురుపాటు గలవాడు. కోరాడ దుర్గానాగేశ్వరశాస్త్రిగారివలె మననశీలి. (ఈయన నోబుల్ కళాశాల పండి

టులు. దాహం వేస్తే అక్కడివాళ్ళ నీరు తాగవలసి వస్తుందని, ఓ బుడ్డిచెంబు తీసుకు వెళ్ళేవారట. అందుచేత వీరిని బుడ్డిచెంబు శాస్త్రులుగారనేవారు.) రఘుపతి వెంకటరత్నం నాయుడుగారివలె విశాల ప్రేమతత్త్వం కలవాడు. చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారివలె ఏకలవ్య శిష్యులు కలవాడు. హరినాగభూషణంగారివలె విద్యాపక్షపాతం కలవాడు. చేబ్రోలు వెంకటరత్నంగారిని తన నటసంఘానికి అధ్యక్షుడుగా వరించినవాడు. కాళిదాసు 'రాజ్యం స్వహస్తధృతదండమివాతపత్రం' అన్న సుభాషితాన్ని జీవితాంతం గుర్తుంచుకున్నవాడు.

పురాణం సూరిశాస్త్రిగారు నాట్యాంబుజంలో వ్రాసిన ఈ వాక్యాలు డి. వి. సుబ్బారావుగారిని స్పష్టంగా చెప్తాయి. ఆయన మాటలు ఇవి—"సుబ్బారావు బందరువాడు. బందరులో పుట్టి పెరిగి, యినటనే కాలవరకు, నైజమునీవచే నాట్యకళాభ్యాసమొనరించినవాడు. ఈతని కీర్తి తెలుగుదేశము దిగంతముల వ్యాపించి, బళ్ళారి, విజయనగరము, చెన్నపురి, రంగూన్ మొదలైన తావులకు పెద్ద జీతముల ఆశతో పిలువబడినను తనకున్న హంగు తక్కువ కంపెనీని నమ్ముకొని బందరు పురమును వదలివెళ్ళని నిలుకడగలవాడు. ప్రసిద్ధనటులలో ఇట్టి కుదురు అరుదు. ఇతని స్వభావము కుదురుగల దయానిధి శాంతత్వములది. సుబ్బారావు నమ్మినవారిని విడనాడనివాడు. స్వతంత్రాపేక్ష కలవాడు. ఇమిటేషన్ రాళ్ళనడుమ రాజిల్లు మేలిపచ్చవలె, యితడా చిన్ననాటి సాంగత్యమును విడువజాలక, దొరికిన హంగులతో—బందరు హాలు చింపితెరలలో, సమాన నట సహకార సౌలభ్యముండక కాలయాపన మొనరించుచున్నాడు. ఈతని రంగసంపాదకుడు తన వృత్తిలో బందరుకెల్ల మేటి. అయినను సుబ్బారావు యితర పరిస్థితులలో యిప్పటికన్న యెక్కువ విఖ్యాతి కలిగియుండునన సంశయింపను.

"ముక్కుపొడిచెడి వేకువవేళ, కమ్మతెమ్మెరల మాపునవేళ పికకూజితము నిద్రాలసుల కెట్టి అవ్యక్త సుఖలీల నిచ్చునో, అట్టి ప్రశాంత నిరాడంబరగాన సౌలభ్యము ఇండియన్ డ్రమెటిక్ వారి కథానాయకుడు డి. వి. సుబ్బారావునందగపడును." ఇవి 1923 నాటి మాటలు.

డి. వి. సుబ్బారావుగారు 1906 నుంచీ 1946 దాకా "ప్రమాదం వై మృత్యుమహం బ్రవీమి" అన్న ఉపనిషద్వాణి ప్రకారం అప్రమత్తుడై నలభై సంవత్సరాలు నాట్యకళలో నానిపోయాడు. మొత్తం ముప్ఫయ్యారు నాటకాలను ఆయన పాఠం చేశాడు. యాభై నాలుగు వేషాలు ధరించాడు. విశ్వేశ్వరగ్రాహ్యమైన తన శక్తియుక్తులతో, విశ్వేశ్వరస్వరూపమైన లోకాన్ని వ్యాఖ్యానం చేస్తూ తన ఉనికిని సార్థకం చేసుకున్నాడు.

1941 సంవత్సరం ఆంధ్రనాటక కళాపరిషత్తుకు అధ్యక్షత వహించాడు. ఆనాటినుంచీ తుదినాటిదాకా ఏ పరిషత్తుగాని, ఎవరుగాని ఆయనద్వారా ఆంధ్రనాటక సంప్రదాయాలు తెలుసుకుందామనిగాని, ఆంధ్రనాటక చరిత్ర వ్రాయించుకుందామనిగాని అనుకుని పనిచేసినట్లు కనబడదు.

## ఆశ్వాసాంతం

మొన్నటి జనవరి 7వ తేదీన గుండెనొప్పి అనుకున్నాడు. ఇంట్లోకిపోయి భార్యకు చెప్పాడు. ఓ పావుగంట తనలో తానున్నాడు. రంగస్థలంమీద కేక వేసినట్లుగా "డి. వి. సుబ్బారావు! ఓ డీ. వీ. సుబ్బారావు!" అని గావుకేక పెట్టాడు. అప్పగింతలు చెప్పి రంగు కడుక్కోడానికి తెరవెనుకకు వెళ్లాడు.

కారణజన్ములకు మృత్యువు రాక తెలుసుంటారు. సుబ్బారావుగారికి ముందుగా తెలిసినట్లు తోస్తుంది. నిర్భయంగా, నిర్విచారంగా, తనకు తాను "నారాయణా, నారాయణ!" అని చెప్పుకుంటూ వేషాన్ని విప్పేసుకున్నాడు ఆ జీవుడు!

# మెడుల్లా మెరిక

## శ్రీ కొలకలూరి ఇనాక్

ఇది కథ కాదు. ఒక సంఘటన్ని కథగా మార్చే ప్రయత్నం.

జరిగిపోయిన ఘట్టంలోని విషయాన్ని కథగా వ్రాయటానికి పూనుకుంటే రచయిత ఎంతవరకు కృతకృత్యుడు కాగలడో పరిశీలించుకుంటున్నాను.

కథకు అవసరమయ్యే ప్రణాళిక సంఘటనకు ఉండకపోవచ్చు. జీవితంలోనూ, రచనలోనూ, అనుభవంలోనూ చిన్నవాణ్ణి కనక ఈ సంఘటనలో వున్న గొప్పతనం ఏమిటో నాకు తెలియటంలేదు. ఏదో బలవత్తర శక్తిమాత్రం కనిపిస్తోంది. అది ఏమిటో నేను పోల్చుకోలేదు.

కథ నీరసంగావుంటే నన్ను తిట్టకండి; ఇది కథ కాదు కనక.

నా కిప్పుడిరవై సంవత్సరాలు!

నా ప్రవర్తన వయస్సుకంటే అతీతంగా వుంటుందని ఒక అమ్మాయి చెప్పింది. అంతేకాదు అలా కనిపిస్తాను కూడా. ఆ ప్రయత్నంకూడా వుంది.

“నీ వయస్సు ఎంత వుంటే మా కేమిటి?”

నాకు తెలుసు, ఈ ప్రశ్న మీకు కలుగుతుంది. అందుకే జవాబు చెప్పుకుంటున్నాను. ఆలకించండి!

పది సంవత్సరాలనాడు నేను వయస్సుకి మించిన సమున్వయం ఒకటి చేశాను. దాన్ని కథగా మలుద్దామని ఆలోచిస్తున్నాను.

అదే వ్రాయబోయేది.

మా వూరులో హైస్కూలు లేదు. గుంటూరులో వుంది. దూరం పద్దెనిమిదిమైళ్ళు. రోజూ వుదయం రైలు. సాయంకాలం రైలు. అన్నం గుంటూరులో. చదువు హైస్కూలులో. ప్రయాణం రైలులో. ఇదీ పద్ధతి. జేమ్సు నాకంటే పెద్దవాడు. ఇద్దరం కలిసివుండేవాళ్ళం. మేం ఫస్టుఫారం.

మార్చినెల చివరిభాగం.

ఉదయంపూట స్కూలు అయిన తరవాత ఇంటికి వెళ్ళటానికి రైలులేదు. మూడుగంటలు కాళీ.

షెడ్డుల్లో మాకు క్లాసులు జరుగుతూ వుండేవి. అన్నంకూడా అక్కడే తినేవాళ్ళం. అక్కడే కూర్చుని హోంవర్కు చేసుకునేవాళ్ళం.

టైం ఒంటిగంటయింది. మూడు గంటలకి రైలు. రెండుగంటలు కూర్చోవాలి.

ఊరికే కూర్చోవాలంటే నీరసంగా వుంటుంది కదూ! తప్పదు. వుంటుంది. అలా వుండకుండా నే చేస్తాను ఈ కథ చదవండి! అసలు నే నీకథ వ్రాయటానికి ఆధారం ఆ సంఘటన. సంఘటనలో గొప్పతనం నేను వేరుచేసి చూపలేను. అది విచిత్రమైంది. ఎప్పుడైనా గుర్తువస్తే కదిలించి, కుదిలించి, అల్లల్లాడించి, వూపేసి వెళ్ళిపోతుంది. ఆ వూపు తట్టుకోలేక, మీకు భాగం పంచి, నేను తగ్గించుకుందామని చేసే ప్రయత్నమే కథ వ్రాయటం.

పైన చెప్పినదంతా వట్టి వూక, అది అవసరం లేదు. అనవసరం. అంత అనవసరం కూడా కాదు. అయినా మీకు ఓపికవుంటే నిరభ్యంతరంగా మరిచిపోండి.

అసలు విషయం చెప్పబోతున్నాను.

నెరసిన బొద్దుమీసాల పెద్దవాళ్ళిద్దరు షెడ్డులోకి వచ్చారు.

జేమ్సు జడుసుకున్నాడు. నాకు భయం కలగ లేదు.

ఒకడు నన్నడిగాడు “అబ్బాయిలూ మీతో పని వుంది వస్తారా?”

కంఠం కరుగ్గా బొంగుపోయినట్టుంది. ముఖం నిర్మలంగా వుంది. విషయం భయం కలుగజేసేట్టుగా వుంది.

తల విటవాటంగా పెట్టి ఎనభైమైళ్ళ స్పీడ్‌తో ఎడా పెడా వూపాను.

రెండవవాడు బ్రతిమాలాడు

“చిన్నపిల్లలు కావాలి. ఇప్పుడిక్కడ మరెవరూ లేరు అవసరం. రావాలి బాబూ.”

నాకు భయం వేసింది. అమ్మ చెబుతుండేది ‘దయ్యాలు కూడా మనుష్యుల్లాగా మాట్లాడతారని.’

జేమ్సు లేచాడు. నన్ను పొడిచాడు. బైటికి పోబోయాడు. బైటివాడు అడ్డంవచ్చాడు.

ఆంజనేయదండకం అమ్మ నేర్పింది కానీ, నాకు పూర్తిగా రాదు.

రెండోవాడు మళ్ళీ అడిగాడు.

ఏవేవో చాలా చెప్పారు తినుబండారాల పేర్లు; కొని పెడతాం రమ్మన్నారు.

అమ్మ చెబుతూ వుండే విషయం గుర్తొచ్చింది.

మనకు తెలియని వాళ్ళు పెట్టేవి తినకూడదు. అందులో మత్తుమందులు పెడతారు. పిల్లల్ని మాయ చేసి తీసుకెళ్ళి చాలా చాలా దూరంలో అమ్మేస్తారు. పరాయివాళ్లు పెట్టేవి తినకూడదు.

నా కిట్లాని బద్ధ ముసలతన్ని తప్పుకుపోదామని వంగిపోబోయాను.

ముసలతనికి కోపం వచ్చింది ఎర్రగా నావైపు చూశాడు. నాకు ఏడుపు వచ్చింది.

అమ్మ చెప్పిన విషయం గుర్తొచ్చింది.

పిల్లల మెదడు తినే పిశాచాళ్ళు గుంటూరులో తిరుగుతున్నారు

నాకు ఏడుపు రెట్టింపయింది. జేమ్సు కూడా మొదలుపెట్టాడు.

వాళ్ళిద్దరు మాకు వినిపించకుండా ఏమేమో మాట్లాడుకున్నారు. ఒకతను బైటికి వెళ్ళిపోయాడు.

మరొకతను మంచి మంచి మాటలు చెబుతూ ఓదార్చుతూ మమ్మల్ని బైటికి పోనివ్వకుండా చూస్తున్నాడు.

డ్రిల్లుమాస్టరు సైకిలుతో షెడ్డుదగ్గరకు వచ్చారు. ఆయనతో పాటు మమ్మల్ని బెదిరించిపోయిన అతను వున్నాడు.

మాస్టర్ని చూడగానే ఆరిపోతున్న దుఃఖజ్వాల ప్రజ్వరిల్లింది.

జరిగిన సంగతి వినుస్తూనే ముసలివాళ్ళను ముద్దాయిను చేస్తూ ఫిర్యాదు చేశాను.

మాస్టరు నవ్వారు.

స్కూల్లో చేర్పించినప్పుడు మమ్మల్ని గూర్చి మా నాన్న 'పిల్లు జాగ్రత్త' అని చెప్పినవారిలో డ్రిల్లు మాస్టరు ఒకరు.

నన్నూ, జేమ్సునీ సైకిల్ మీద కూర్చోబెట్టుకొని వాళ్ళ బారినుండి తప్పించుకొని తీసుకువస్తున్నారు మాస్టరుగారు.

మా సైకిల్ వెనుక రిక్షాలో ఆ పెద్దమీసాల ముసలాళ్ళు వస్తున్నారు.

నాకు మళ్ళీ భయం పుడుతోంది. మాస్టరు గారికి వాళ్ళని చూపించాను. "నేనున్నానుగా. భయం లేదు." అన్నారాయన.

మాస్టరు మమ్మల్ని సైకిలు దించారు

వాళ్ళిద్దరూ సైకిల్ రిక్షా దిగారు.

మాస్టరు వాళ్ళవైపు చూశారు. వాళ్లు మమ్మల్ని దాటి ఒక గొందిలోంచి నడుస్తున్నారు. మాస్టరు వాళ్ళవెనక నడుస్తున్నారు.

చెరో ప్రక్క మేం నడుస్తున్నాం.

వెనక్కి పరుగెడదామనుకున్నా. కానీ అక్కణ్ణుంచి నాకు తోవ తెలియదు. అది నగరం పాలెం.

నా ముఖం ఎలా వుందో నాకు తెలియదు. జేమ్సు ముఖం నల్లగా వుంది. వాళ్ళు ఒక యింట్లోకి పోయారు. ఆ తరవాత మాస్టరు పోయారు. ఆయన వెంట మేం వున్నాం.

ఇప్పుడా పూరిపాక స్థలంలో మేడ వుంది.

ఇంతవరకూ మనం అసలు విషయానికి రాలేదు. చెప్పిందంతా చెత్త. అది అసలు కథ కేమీ అవసరం లేదు

నిజంగా నేనిదేమీ చెప్పకూడదు. దాని అవసరం లేకపోయిందీ లేదు. మీ యిష్టానికి వదులుతున్నాను. చదవండి. తరవాత, ముందు చెప్పింది అవసరమో కాదో ఆలోచించండి.

సరిగ్గా సంఘటన ప్రారంభంలో మీకు అడ్డం వచ్చాను. తప్పుకుంటాను. కథ చదవండి.

ఆ యిల్లు చిన్నది.

లోపల చిత్రంగా అలంకరణ వుంది. ఇక్కడ మరొకడు కనిపించాడు. వాణ్ణి అందరూ 'శాంబరీ' అని పిలుస్తున్నారు. వాడి కళ్ళు ఎర్రగా వున్నాయి.

భూమిమీద ఏదో పూజ వుంది పసుపునీళ్ళూ ఎఱ్ఱనీళ్ళూ కలిపి భూమిమీద జల్లారు, రంగు రంగుల దారాలూ వున్నాయి. పచ్చ పచ్చగా ఏవో ఆకులు వున్నాయి. వాడి చేతులో ఏదో జపమాలిక వుంది.

వాళ్లు జేమ్సువైపూ, నా వైపూ చూశారు.

శాంబరి నావైపు చూచి నవ్వాడు.

నాకు భయంపుడుతూ చిరాకెత్తింది,

మాస్టరు నాకు చోటుచూపి కూర్చోమన్నారు. ఆ చోటు కొంచెం ఎత్తుగా వుంది. కూర్చున్నాను.

శాంబరి ఒక తెల్ల తమలపాకు తీశాడు. దాని మీద కాటుక రాశాడు. ఆపైన నూనెలాంటి దేదో వ్రాశాడు; నాకివ్వబోయాడు. నేను తీసుకోలేదు. మాస్టరు తీసుకోమన్నారు. తీసుకున్నాను.

శాంబరి చెప్పాడు.

'నీకు తమలపాకులో ఏం కనిపిస్తే అది కనిపించిందని చెప్పు.'

నేను మాట్లాడలేదు.

'సరే నను' అన్నారు మాస్టరు.

నేను తల వూపాను.

శాంబరి అడిగాడు ‘ఏం కనిపిస్తోంది?’

నేను చెప్పాను ‘ఆకు’.

‘జాగ్రత్తగా చూడు! ఆకులో ఏం కనిపిస్తోందో చెప్పు.’

నేను మాట్లాడలేదు.

‘చూస్తున్నావా?’

‘ఆఁ!’

‘ఏం కనిపిస్తోంది?’

‘ఏమీ కనిపించటం లేదు.’

నాకు నిజంగా ఏమీ కనిపించటంలేదు. ఆకు మాత్రం తెల్లగా నల్లగా కనిపిస్తోంది, ఎత్తుపల్లాలవల్ల మెరుస్తూ.

‘ఏం కనిపిస్తోంది?’

‘ఏమీ లేదు.’

‘జాగ్రత్తగా చూడు! కొంచెం అరచేతిలో పెట్టుకొని ఆంజనేయస్వామి కనిపిస్తాడు. భయపడకు. జాగ్రత్తగా చూడు.’

నేను మాట్లాడలేదు.

‘చూస్తున్నావా?’ శాంబరి అడిగాడు.

‘ఊఁ!’ జవాబు చెప్పాను.

‘కనిపించాడా?’ ముఖంలోకి చూస్తూ మళ్ళీ అడిగాడు.

‘లేదు.’

‘ఈసారి కనిపిస్తాడు. జడుసుకోకు. జాగ్రత్తగా చూడు, వస్తున్నాడు. జాగ్రత్త! కనిపించాడా?’

‘ఏమీ కనిపించటం లేదు.’

చుట్టూ చూశాను. శాంబరి నా ముఖంలోకీ, ఆకునూ చూస్తున్నాడు. వాళ్ళిద్దరూ నావైపు చూస్తున్నారు. జేమ్సు దిగాలుపడి చూస్తున్నాడు. మాష్టరు చూస్తున్నారు.

‘అదిగో! వచ్చాడు. కనిపించాడా?’

‘ఊఁ!’

ఇప్పటికీ నాకా సంఘటన గుర్తుంది. ఆకులో నాకేమీ కనిపించలేదు. అబద్ధం ఆడానని తెలుసు. కాని కనిపించని ఆంజనేయస్వామి కనిపించాడని చెప్పాను. పర్వతంతో కనిపించాడని చెప్పాను. పచ్చి అబద్ధం.

నే నిప్పుడనుకుంటాను. అప్పట్లో ఏదో బలవత్తరమైన ఒత్తిడివల్ల తెగింపు తెచ్చుకున్న చిన్న వయస్సు కారణమని.

శాంబరి ఎగిరి గంతేశాడు.

జేమ్సు నా ముఖంలోకి చూశాడు.

మాష్టరు సిగరెట్టు ముట్టించారు.

వాళ్ళిద్దరూ సర్దుకొని కూర్చున్నారు.

శాంబరి మళ్ళీ అడిగాడు.

‘ఆంజనేయస్వామి ఏమో చెబుతాడు. చెబుతున్నాడు విను. ఏం చెబుతున్నాడు?’

‘ఏమీ చెప్పటంలేదు.’

‘జాగ్రత్తగా విను! ఏదో చెబుతాడు.’

కదలకుండా కూర్చున్నాను.

‘మాట్లాడుతున్నాడా?’

నేనుమాత్రం నిశ్శబ్దంగా వూరుకున్నాను. ఆడిన అబద్ధంమీద అంతులేకుండా గోడలు లేస్తున్నాయి. పునాదులు లేని కట్టడాలు.

‘ఆంజనేయస్వామి వున్నాడా? వెళ్ళిపోయాడా?’

వెంటనే చెప్పాను ‘వెళ్ళిపోయాడు’. చుట్టూ పెరిగిన కట్టడాలు నేలమట్టమయ్యాయి. కొంచెంలో కొంచెం తృప్తి

‘వెళ్ళిపోయాడా? సరే! ఊసలుదిగిన స్త్రి ఎట్టు పెద్దది కనిపిస్తుంది చూడు!’

జవాబు చెప్పాను ‘కనిపించటం లేదు.’

‘జాగ్రత్తగా చూస్తున్నావా?’

బుర్ర గట్టిగా వూపాను.

‘ప్రవహిస్తున్న నీరు కనిపిస్తోంది కదూ!’

‘లేదు.’

‘నువ్వు సముద్రం చూశావా?’

‘చూడలేదు.’

‘నదిని చూశావా?’

‘ఊహూఁ!’

‘కాలువ చూశావా?’

‘లేదు.’

‘చెరువు చూశావా?’

‘చూశాను.’

‘ఆకులో చెరువు కనబడుతుంది చూడు!’

నేను సమాధానం చెప్పలేదు.

‘చెరువు కనిపిస్తోంది కదూ!’

‘లేదు.’

‘నువ్వు చదువుతుంది ఎక్కడ?’

చెప్పాను.

‘మీరు కొండవీడు ఎక్స్‌కర్షన్‌కు పోయారు కదూ!’

‘అవును.’

‘జాగ్రత్తగా చూడు! కొండ కనిపిస్తుంది. చూస్తున్నావా?’

‘ఊఁ!’

‘కొండ కనిపిస్తోంది కదూ!’

'కనిపించటం లేదు.'

'పెద్ద అడవి కనిపిస్తోంది కదూ!'

'అడవి?'

'అవును. అడవి. చెట్లూ, కొమ్మలూ, పచ్చగా, నల్లగా, తెల్లగా.'

నేను వూగుతున్నాను.

'కనబడుతోంది కదూ!'

'లేదు.'

'తారు రోడ్డు?'

'లేదు.'

'సిమెంటు రోడ్డు?'

'లేదు.'

'దగదగా వున్న భూమి?'

'కనిపించటం లేదు.'

'ఎగుడు దిగుడు రోడ్డు?'

'కనిపించటం లేదు.'

'ముళ్ళ డొంక?'

'ఏదీ కనిపించటం లేదు.' నాకు విసుగెత్తింది. శాంబరి గమనించాడు.

'ఎడారి?'

'ఎలా వుంటుంది?'

'ఇసుకలాగా, ఎత్తుపల్లాలతో.'

'ఎక్కడ?'

'అడవిలో.'

'ఏదీ?'

'కనుపించటం లేదా?'

'లేదు.'

వాళ్ళిద్దరిలో నిరాశ, స్పష్టంగా కనబడుతోంది.

మాస్టారు సిగరెట్టు నేలకేసి కొట్టారు. సరిగ్గా సర్దుకొని కూర్చున్నారు.

జేమ్సు ఆవులిస్తున్నాడు.

శాంబరి కోపం పెరిగింది. రౌద్రంగా వున్నాడు. వాళ్ళతో చెప్పాడు.

'వీడు రాడు పనికిరాడు.'

నావైపు తిరిగి నన్ను చూస్తూ 'ప్రయత్నిస్తా' నన్నాను.

'అడవిలో స్టీమరు చూడు.'

శాంబరి నాముఖంలోకి తీవ్రంగా చూస్తూ అడిగాడు.

నేను భయపడ్డాను. అయినా చెప్పాను 'కనిపించటం లేదు.'

'అడవిలో స్టీమరు లేదా?'

'లేదు.'

'లేకపోవటమేమిటి? వుంటుంది. చూడు! వుంది. కదూ!'

'లేదు.'

'బస్ స్టాండ్?'

తల అడ్డంగా వూపాను.

'ఏమైనా కనిపిస్తుందా?'

ఆ రోజు నాకిప్పటికీ గుర్తు. అప్పుడు నాలో ఒకరకమైన మార్పు వచ్చింది. మార్పు స్వరూపం ఇదమిత్థమని నిర్ణయించలేను. కోపం కావచ్చు, ప్రేరణ— ఏమో! నిరాశ—ఊహించలేను. జ్ఞాన-తృష్ణ వచనం కూర్పు. దుఃఖం-అపాత్రమని. అనుభూతి-నరాలలో మెదడులో, మానవత్వంలో. పెలిక-అనుభవంలో. ఆనందంలో, ఆహ్లాదంలో. ముళ్ళు-గుండెల్లో కంపల్లో. డొంక. ఇసుక, మట్టి, ఎడారి- ఇసుక తెరలు, గాలి విసరులు, కొండ, లోయ-పడిపోయిన మనస్సు. ఆకాశం, భూమి, జారిపోయిన తార, సూర్యగ్రహం, చంద్రుడు-కలిసిపోయిన నీడ. పగలు, రేయి, మిళితమైన నిప్పు. గడ్డివాము-తగలబడుతోంది. రైలు క్రింద -ప్రాణం పోయింది. చెట్టు మీద-కొమ్మ విరిగింది. చెరువుగట్టు-చేపవచ్చింది. తుమ్మచెట్టు-ముల్లు పెరిగింది. బావిగడ్డు-రావికొమ్మలో నిప్పుల పేట. మంచుముక్క - గాజు పెంకు చంద్రరేఖ-దూదిపింజ. గాలివిసురు- గుండె దిగులు, కంపజ్వాల-నిద్రమత్తు. కునుకు, ఆలోచన. అక్కడ నిప్పులూ నీరులూ, పొగలు. అంగుళంచి భావన, అంతులేని యాతన. నరాలు తెగుతున్నాయి. అంతే క్షణంతో—

శాంబరి మళ్ళీ అడిగాడు.

'ఏమైనా కనిపిస్తోందా?'

'ఆఁ!' జవాబు చెప్పాను.

శాంబరి ఆశగా చూశాడు.

వాళ్ళు కొంచెం కదిలారు.

జేమ్సు నన్ను చూస్తున్నాడు.

మాస్టారు సిగరెట్టు ముట్టించారు.

శాంబరి ప్రశ్నించాడు.

'ఏం చూస్తున్నావ్! కనబడేదేమిటి?'

'బ్రిడ్జి!!!'

అడవిలో ఏ బ్రిడ్జీ లేదు. మరి నేనెందుకలా చెప్పానో, ఇప్పుడూహించుకోగలను. మార్పులు మనం కోరినవి కొన్ని, మన ప్రమేయం లేనివి కొన్ని. ఏ మార్పు ఏలాటిదో అందరికీ అన్ని వయస్సుల్లో తెలియదు. నాకు ఈ మార్పు అంతే.

శాంబరి అడిగాడు.

'క్రింద కాలువ వుందా?'

'లేదు.'

'రైలు వుందా?'

'లేదు.'

'రోడ్డు వుందా?'

'లేదు.'

'అసలేం బ్రిడ్జి?'

'మామూలు బ్రిడ్జి. ఓవర్ బ్రిడ్జి. రైలుస్టేషనులో వుండే ఓవర్ బ్రిడ్జి.'

మరొక్కసారి అబద్ధం. పచ్చి అబద్ధం. ఏమైన నిజంలేని అబద్ధం. ఎందుకు నేనిలా చెబుతున్నానో నాకు అప్పుడు తెలియదు. ఇప్పుడు సమన్వయం చేసుకోగలను. సంతోషంతోనో భ్రాంతితోనో బుర్రపగిలిపోతోంది. మాగన్ను వొచ్చింది. పరిణామం ఎలావుంటుందో?

శాంబరికి కుతూహలం హెచ్చింది.

'ప్లాటుఫారం కనబడుతోందా?'

'కనబడటం లేదు.' నిక్కచ్చిగ చెప్పాను.

'రైళ్లూ!'

'ఏమీ లేవు.'

'సిగ్నలు కనబడుతోందా?'

'లేదు.'

'బ్రిడ్జి చూస్తూనే వున్నావు కదూ?'

'అవును.'

అప్పుడు నాకు, వాళ్లు శాంబరిని ఏమి అడిగారో తెలియదు. నే నేం చెబుతానో శాంబరికి గానీ, వాళ్ళకు గానీ తెలియదు. వాళ్ళు ఏమి వుద్దేశించారో బహుశా శాంబరికి కూడా తెలియదు. మాస్టారుగారికి తెలుసునేమో!

అసలో చూచి నేను ఏదో సమాధానం చెబుతాను. శాంబరి ఎదుటివాళ్ళు మనస్సులో వూహించుకున్న ప్రశ్న గ్రహిస్తాడు. సమాధానం, ప్రశ్న సమన్వయించి వాళ్ళకు జవాబు చెబుతాడు. వాళ్ళకది నచ్చుతుంది. శాంబరి ప్రయత్నం ఫలిస్తుంది. శాంబరికి అపజయం లేదుట. నాకుమాత్రం ఆవిషయంలో అప్పుడు చీకాకు కలగలేదు

సరైన సమాధానం దేవుడే చెప్పగలడు. దేవుడి అంశవున్నవాళ్ళు చెప్పగలరు. దేవుడి అంశ నాకుగానీ, శాంబరికిగానీ, పరిస్థితికిగానీ, మూడువిధాల సమన్వయానికిగానీ వుండాలి—సమాధానం సరైనదే?

శాంబరి కోపంగా ముఖం పెట్టాడు. ప్రశ్నలు వేయటం మానలేదు మానితే జవాబు రాదు జవాబు రాకపోతే డబ్బురాదు. డబ్బు రాకపోతే పొట్టగడవదు. ఇది అప్పటి భావన.

'బ్రిడ్జిపైన జనం వున్నారా?'

'లేరు!'

'జాగ్రత్తగా చూడు! చూచి చెప్పు! నాకు తెలుసు వున్నారు. వున్నారు కదూ!'

'అవునవును.'

'ఎంతమంది వున్నారు?'

'ఎక్కువమంది లేరు.'

'తక్కువమంది వున్నారా?'

'చాలా తక్కువమంది వున్నారు.

'ఎంతమంది?'

'ఇద్దరు.'

వాళ్లు ఆశగా చూస్తున్నారు. ముఖాల్లో తృప్తి చూశాను శాంబరి ప్రశ్నిస్తున్నాడు.

'ఏం చేస్తున్నారు?'

'ఏమీ చేయటం లేదు. నడుస్తున్నారు.'

'మాట్లాడుకొంటున్నారు. వినపడుతోందా?'

'వినపడటం లేదు.'

'మాట్లాడుకొంటున్నారు కదూ!'

'అవును.'

'ముసలివాళ్ళా?'

'కాదు.'

'పసిపిల్లలా?'

'కాదు.'

'మరెలా వున్నారు?'

'కుర్రవాళ్ళు.'

'ఆడవాళ్ళా?'

'కాదు.'

'మగవాళ్ళా?'

'కాదు.'

'మరి?'

'ఆడఅమ్మాయి; మగఅబ్బాయి!'

'యువకుడెలా వున్నాడు?'

'సదాశివశాస్త్రి అంతగా వున్నాడు.'

'సదాశివశాస్త్రి ఎవరు?'

'మా వూరి'

'బట్టలు ఎలా వున్నాయి?'

'మా డి. యి. ఓ బట్టలు లాగ వున్నాయి.'

'మహమ్మదీయుడి బట్టలు లాగా వున్నాయా?'

'అవును నెత్తిన ఎర్రని టోపీ.'

వాళ్ళిద్దరు ఒకేసారి అరిచారు.

'వాహ్!'

'యువతి ఎలా వుంది?'

'మా అక్కలాగా వుంది.'

'తేడా ఏమీ లేదా?'

'వుంది!'

'ఏమిటది?'

'నా పెట్టె మీద బొట్టు.'

'మీ అక్క వయస్సు ఎంత?'

'పద్దెనిమిది సంవత్సరాలు.'

'ఓవర్ బ్రిడ్జి దిగారా?'

'కనిపించటం లేదు?'

'వాళ్ళిద్దరూ కనిపించటం లేదా?'

'ఇద్దరూ కనిపించటం లేదు.'

'మరేమి కనిపిస్తోంది?'

'ప్లాటుఫారం.'

'రైలుందా?'

'రైలు కదిలింది.'

'ఎటు వెళుతోంది?'

'బెజవాడవైపు.'

ఇక చాలు నన్నాడు కాంబరి. నా చేతిలో ఆకు తీసుకున్నాడు. వాళ్ళతో చెప్పాడు.

'మీ అమ్మాయి కనిపించకపోవటంతో ఏం జరిగిందో తెలుసుకుందామని వచ్చారు. అవునా?'

'అవును.' అన్నారు ఇద్దరూ ఒకేసారి.

'ఒక మహమ్మదీయ యువకుడితో లేచి పోయింది. రైలులో బెజవాడ పోయారు. మీరు బెజవాడ పోతే వారు కనిపిస్తారు కాని ఆమె మీతో రాదు. వాళ్ళిద్దరూ మీరు పోయేసరికి పెళ్ళి చేసుకుంటారు.'

వాళ్ళు చప్పున పైకి లేచారు.

మాస్టరు లేచారు సిగరెట్టు ముట్టించుకున్నారు.

కాంబరి చేతిలో డబ్బులు పడ్డాయి.

మాకేవో వాళ్ళు కొనిపెట్టారు. మేం తీసుకో లేదు.

మాస్టరు మమ్మల్ని సైకిల్ మీద ఎక్కించుకొని స్టేషను వైపు నడుస్తున్నారు.

ఇంతవరకు నేను మీకు సంఘటనలోని ప్రాణం వంటి ఘట్టం మా పెట్టలేదు. జరిగిందంతా ఏమీ లేదు. చెప్పబోయే ముఖ్యం ఇది కథ అయితే ప్రాణమైన పట్టు చెప్పబోయే విషయం. తప్పు కుంటున్నాను. కథ చదవండి!

నేమా జేస్తూ ఓవర్ బ్రిడ్జి దాటి ప్లాటుఫారం మీదికి వచ్చి రైలెక్కాం. కదిలింది.

నా కప్పుడే ఆలోచనలు వచ్చాయో తెలియదు. కాని ఇప్పుడు మాత్రం ఏదో అనుకుంటాను.

విచిత్రమైన అభిప్రాయం సంబంధిఅనుభూతి. చెప్పిన అబద్ధంలో చెప్పలేనంత నిజం వుంది. వెలుక్కి నిజకీ మధ్య వున్న గోడ పోతే రెండూ ఒకటే. జరిగిన అబద్ధం ఎలా అబద్ధం కాదు? నా హృదయంలో, మనస్సులో రక్తంలో నా కాల్లో ఎక్కడో ఏదో విచిత్రమైన, పరాత్పరాంశవున్న శక్తి పనిచేసింది.

అబద్ధం నానోటలోంచి రావటానికి వెనక ఏదో గొప్పమైన సమాచారానికి సంబంధించిన విషయ విస్తరణ నా మెదడులో తెరలు తెరలుగా, పొరలు పొరలుగా వున్న అనుభవాల ఫలకాల మీద ఎక్కడో ఏదో ముద్రపడి వుంటుంది. ఎలాంటి పరిణామం లేకుండా ఇలాంటి విషయాలు ఎవరైనా ఎలాగ చెప్పగలరు? నేను చెప్పిన దానికి కారణం నా అక్క మెట్టిల్లా విషయం నాకు తెలిసి వుండటమేనని నేను ఇప్పుడిప్పుడు ఆవిషయం గుర్తు వచ్చినప్పుడు అప్పుడప్పుడు అనుకుంటూ వుంటాను.

అక్క ప్రేమగాన నా హృదయ కుహరాంతరాళంలో ఎక్కడో మరుగుపడి పూడిపోయి నిద్రాప్రవృత్తితో జోగుతూ వుంటే, పరిస్థితులు బలవత్తరమైనప్పుడు పొంగిపోయి పిల్లకాలువలో ప్రవహించి. చైతన్యాన్ని ప్రసాదించి విద్యుత్తుని ప్రసారం చేసి, వివేకాన్ని కలిగించి కంఠంలోంచి అప్పుడు వెలువడిందేమో! ఏమో! ఏదో జరిగింది. అది కావచ్చు!

రైలు దిగాను.

ఇంటికి వెళ్లాను.

అక్క కనపడలేదు. వచ్చి పుస్తకాలు తీసుకెళ్ళలేదు. ఇల్లు బోసిపోయినట్టుంది. అమ్మ, నాన్న దిగాలుపడి కూర్చున్నారు

నాన్న అన్నాడు.

'దాన్నెవడో లేపుకు పోయాడు.'

అమ్మ అంది.

'మీ అక్క ఎవడితో లేపుకు పోయింది'

నేను అనుకున్నాను 'మా అక్కా సదాశివశాస్త్రి కలిసి లేచిపోతారని నాకు తెలుసు. పదిరోజుల నాడే నాకు తెలుసు.' నాన్నని బెజవాడపోయి రమ్మన్నాను.

పోయివచ్చాడు. పెళ్ళి చేసుకున్నారని చెప్పాడు.

ఇప్పుడు అక్కకు తొమ్మిది సంవత్సరాల చిన్నారి రాణివుంది.

దాన్ని నాకు ఇచ్చి పెళ్ళి చేస్తాననీ, అక్కా బావా ఇద్దరూ అంటున్నారు.

నేను రాణిని పెళ్ళి చేసుకుంటాను.

ఇంకా సంఘటన ముగియలేదు. పెళ్ళి తరవాత చాలా వుంది కథ.

# కాతంత్ర వ్యాకరణం

శ్రీ శ్రీనివాస సోదరులు

హితాయ సుకుమారాణాం
కుమారాణాం కుమారధీః,
చక్రే వ్యాకరణం ధీరః
శర్వవర్మా ఋషూత్తమమ్,
కాతంత్రం లఘుతంత్రత్వాత్
కాలాపక మపీరితమ్,
కుమారార్య మయూరస్య
కలాపే లిఖితం యతః.

ఆంధ్ర మంత్రి శేఖరుడొకడు సంస్కృత వ్యాకరణాధ్యయనంలో సౌలభ్యం కలిగించటానికి చేసిన ఉత్తమకృషికి ఫలితం కాతంత్ర వ్యాకరణం. కాని ఆంధ్రదేశం మాత్రం దీన్ని ఏనాడో మరచిపోయింది. ఒకప్పుడిది ఆసేతుహిమాచలం అధ్యయనం చేయబడింది. అంతే కాదు. సింహళం, టిబెట్టు, చీనా మొదలయిన దేశాంతర సంస్కృతాధ్యేతలకు మహోపకారం కలిగించింది. పాణినీయులకూ కాతంత్రీయులకూ ఒకప్పుడు వాదోపవాదాలు విపరీతంగా వుండేవి. హెచ్చుకుందడుకోటం హెచ్చుగా వుండేది. శూద్రకకృతమైన పద్మప్రాభృతక భాణంలోని యీ క్రింది పంక్తులు ఇందుకు సాక్ష్యమిస్తున్నాయి:—

"ఏష హి పాణినిపూర్వకో దండకాకపుత్రో దత్తకలశి ర్నామ వైయాకరణః. అపీదానీ మస్మాద్వాక్యవాగురా ముక్తేయమ్?" (ఇదుగో దండకాకపుత్రుడైన దత్తకలశి. ఇతను పాణినీయాభిమాని యైన వైయాకరణి. ఇతని వాగ్జాలాన్ని దాటి నిర్విఘ్నంగా బయటపడగలనా?) అనుకుంటాడు విటుడు. "తథా హి — అస్య కలహకండూతిబంధురా వాగీవ దపి స్పృష్టా దేవకులఘంటేవానుస్వనతి." (ఎందుకంటే ఇతడికి నోటిదురద హెచ్చు. కొంచెం కదిలిస్తే చాలు, దేవాలయంలో గంటలాగా మోగిపోతాడు.) అని భయపడుతాడు. అయితే 'సంరబ్ధమివైనం పశ్యామి. అస్తు. వాదనిఘట్టితే నానేన భవితవ్యమ్." (హడావిడిగా వున్నట్టున్నాడు. బహుశా వాదంలో ఓడిపోయి వుండవచ్చు.) అనుకొని తన వాక్కై పీడించకపోవచ్చునని ఊరడిల్లాడు. "స్వాగత మక్షరకోష్ఠాగారాయ." (అక్షరాల కొట్టానికి స్వాగతం) అని స్వాగతం చెప్తాడు. దత్తకలశిని కుశలప్రశ్న చేశాడు. అతడంటాడు "ఏషోఽస్మి బలిభుగ్భి రివ సంఘాతబలిభిః కాతంత్రికై రవస్కందితః" (కాకుల్లాగా మూకవుమ్మడిగా మీదికివచ్చి కాతంత్రికులు ముట్టడించారు) అని. విటుడంటాడు. "హంత ప్రవృత్తం కాకోలూకమ్? సఖే, దిష్ట్యా త్వా మలూనపక్షం పశ్యామి." (హయ్యో, కాకోలూకం ప్రారంభమైందీ? మిత్రమా, అదృష్టవశంచేత కన్నుకాలూ పోగొట్టుకోకుండా బయటపడ్డావు. సంతోషం.) అని విటుడు ఓదార్చాడు. దత్తకలశి "కాచేదానీం మమ వైయాకరణ పారశవేషు కాతంత్రికేష్వాస్థా?" (కాతంత్రికుల గొడ్డలిపెట్లసంగతి నాకు ఇప్పుడెందుకు?) అంటాడు. ఈ సంభాషణనిబట్టి ఆరోజుల్లో పాణినీయులకూ కాతంత్రికులకూ ఎంత కచాకచి జరుగుతూండేదో తెలుస్తున్నది.

సంస్కృత వ్యాకరణ రచనలో మూడు పంథాలు స్పష్టంగా కనపడుతున్నాయి. సౌకర్యంకోసం వాటిని 1. ప్రాచీనపద్ధతి, 2. పాణినీయపద్ధతి, 3 మధ్యమ పద్ధతి అని చెప్పుకోవచ్చు.

ప్రాతిశాఖ్యాలనుండీ ప్రచలితమైన స్వరవ్యంజనాది ప్రాచీన సంజ్ఞలూ, అ ఆ ఇ ఈ మొదలైన వర్ణమాలాక్రమమూ ఉపయోగించి చెప్పిన పద్ధతి మొదటిది. ఈ మార్గాన్ని అనుసరించినవారు ఇంద్రుడు (ఐంద్ర వ్యాకరణం), కాశకృత్స్నుడు (శబ్దకలాప వ్యాకరణం?), శర్వవర్మ (కాతంత్రం), హేమచంద్రుడు (హైమశబ్దానుశాసనం) మొదలైనవారు. భరతుడి నాట్యశాస్త్రంలో వున్న వ్యాకరణభాగం కాతంత్రానుసారియైనదే. వీరి సంజ్ఞలనూటికి తొంభై తొమ్మిదిపాళ్లు అన్వర్థములైనవీ, సుబోధమైనవీని. వీరి పద్ధతిలో, వివరణలో డొంకతిరుగుడు లేదు. లౌకిక భాషా వ్యాకరణం విషయంలో తన నాటివరకూ ఉన్న ప్రయోగాలదృష్ట్యా చెప్పవలసినదంతా పూర్తిగా చెప్పినవాడు హేమచంద్రుడు. ఇతని హైమ శబ్దానుశాసనం కాతంత్ర పద్ధతిని పూర్తిగా అనుసరించి సరళంగా కట్టుదిట్టంగా వ్రాయబడిన ఉత్తమ

వ్యాకరణం. (దీన్ని గురించి వేరే వ్యాసపరంపర వ్రాస్తాము.)

రెండోది పాణినీయపద్ధతి. పాణిని తననాటి వరకూ వున్న సమస్త లౌకిక వైదిక భాషనూ అనుశాసనం చెయ్యటం లక్ష్యంగా పెట్టుకున్నాడు. అందుచేత లాఘవం అత్యావశ్యకమైంది. లాఘవం సాధించటానికి అతను కనిపెట్టిన గొప్పపద్ధతి ప్రత్యాహారపద్ధతి. 'అ ఇ ఉణ్' ఇత్యాది చతుర్దశసూత్రి అతని ప్రతిభకు నిదర్శనం. అవి మాహేశ్వరసూత్రాలుగా ప్రసిద్ధి పొందాయి. "నృత్తావసానే నటరాజరాజో. ననాద ఢక్కాం నవపంచవారమ్"1 ఇత్యాది శ్లోకంలోని కథ అందరికీ తెలిసిందే. ఈ సూత్రాలు మహేశ్వర ప్రసాదంగా పాణినికి భాసించాయని చెప్పుకుందాం. ఈ సూత్రాలు పాణినివేననే విషయంలో దయానంద సరస్వతి తనవ్యాకరణ భాష్యంలో యిలా వ్రాశాడు: "అత్ర ప్రత్యాహారేషు కేచిత్ భట్టోజీ దీక్షితాదయః సంప్రవదంతి ఇమాని మాహేశ్వరాణి సూత్రాణీతి. మహేశ్వరా దాగతాని, మహేశ్వరేణ వా ప్రోక్తాని. ఇదిన మసత్యమ్. కథమ్: తత్ర ప్రమాణాభావాత్. అత్ర తు ప్రమాణమ్—'ఏషా హ్యాచార్యస్య శైలీ లక్ష్యతే యత్తుల్యజాతీయాం స్తుల్యజాతీయే షూపదిశతి, అచోఽక్షు హలో హల్షు' (భాష్యమ్. ౧ అ. ౧ పా. ౨ ఆ. పు. 137). అత్ర ఉపదిశతి ఇతి క్రియాయాః కర్తా పూర్వస్యాః షష్ఠ్యా విపరిణామా దాచార్యః పాణిని ర్భాయాతి. యేషా మేతావజ్ జ్ఞానం నాస్తీమాని సూత్రాణి కేన రచితాని, తే వ్యాకరణస్య గ్రంథాన్ రచితు ముద్యతాః మహదాశ్చర్య మేతత్." (ఈ ప్రత్యాహారాల విషయంలో భట్టోజి దీక్షితులు మొదలైన కొందరు ఇవి మాహేశ్వర సూత్రాలంటున్నారు. మహేశ్వరుడినుండి వచ్చినవి లేదా మహేశ్వరుడిచేత చెప్పబడినవి అని. అదంతా అసత్యం. ఎందువల్ల? అందుకేమీ ప్రమాణం లేదు గనుక. ఇక్కడ ప్రమాణ మేమిటంటే - 'తుల్య జాతీయాలైన అక్షరాలను తుల్యజాతీయాల్లో - అచ్చులను అచ్చులలోను, హల్లులను హల్లులలోనూ - ఉపదేశించటం ఆచార్యుని పద్ధతి' అని భాష్యంలో ఉంది. ఇక్కడ 'ఉపదేశించటం' అనే క్రియకు కర్త ఎవరు? మొదట ఉన్న (ఆచార్యస్య) షష్ఠీవిభక్తిని విపరిణమింపజెయ్యటం వల్ల పాణిన్యాచార్యుడని తేలుతుంది. 2 ఇంతమాత్రం తెలియనివాళ్ళు వ్యాకరణ గ్రంథాలు వ్రాయటానికి పూనుకోటం మిక్కిలి వింతగా ఉంది.)

ప్రత్యాహారాలు లాఘవానికి కారణమైనా వ్యాకరణాన్ని క్లిష్టం చేశాయి. కొన్ని ప్రత్యాహారాల్లో అనవసరమైన అక్షరాలుకూడా ఉండిపోయి చదువుకునే వాళ్ళకు కొంతకంగారుకు కారణమౌతాయి. ఉదాహరణకి—"అట్ కుప్వాఙ్నుం వ్యవాయేఽపి" (పా. ౮. ౪. ౨.) అనే సూత్రంలో అట్ ప్రత్యాహారంలో 'ర' చేరటం వ్యర్థం. "రషాభ్యాం నో ణః సమానపదే" (పా. ౮.౪.౧.) అనే సూత్రంవల్ల 'ర' ప్రక్కనవున్న 'న' 'ణ' గా మారనే మారుతుంది. కనుక రకార వ్యవధానమున్నా 'న' 'ణ' గా మారుతుందని చెప్పనే అక్కర లేదు గదా! అలాగే "ఏచ ఇగ్ఘ్రస్వాదేశే" (పా ౧. ౧. ౪౮) అనేచోట 'ఏ ఓ ఐ ఔ'లకు హ్రస్వాదేశం చెప్పినప్పుడు 'ఇ ఉ ఋ ఌ' వస్తాయని వుంది. ఇక్కడ 'ఋ ఌ'ల ప్రసక్తే లేదు. వీటిసన్నివేశం అనవసరమేగాక "యథాసంఖ్యమనుదేశ స్సమానామ్" (పా. ౧. ౩. ౧౦) అనే సూత్రం ప్రకారం చూస్తే 'ఐ ఔ'లకు హ్రస్వాదేశంగా 'ఋ ఌ' రావలసివస్తుంది. అది కుదరదు. ఈ విధంగా ఇవి అధ్యేతకు క్లేశం కలిగిస్తుంది. ప్రత్యాహార పద్ధతివల్ల ఇలాంటి వ్యాసఘట్టాలు చాలా ఏర్పడ్డాయి. అక్కడల్లా "వ్యాఖ్యానతో విశేష ప్రతిపత్తిః" శరణ్య మౌతుంది. లాఘవంకోసం ఏర్పడ్డ యిటువంటి ప్రక్రియలు జైనేంద్రమూ, దాన్ననుసరించిన ముగ్ధబోధములో ఏకాక్షర సంజ్ఞలు (ప-పదం, లి-లింగం, హ్ర-హ్రస్వం, దీ-దీర్ఘం, ప-ప్లుతం ఇత్యాది)గా ఏర్పడి వ్యాకరణమంటే భయంవేసేంత గురవగాహస్థితికి దారితీశాయి. పైగా ఒక్కమాత్ర తగ్గినా తగ్గినట్లేనని ప్రయత్నించి "ఏకమాత్రాలాఘవేన పుత్రోత్సవం మన్యన్తే వైయాకరణాః" అనిపించుకున్నారు వైయాకరణులు. పాణినీయంలో ఇంకా క్లేశం ఎక్కువ చేసింది ఆల్జీబ్రా పద్ధతి. 'ఆయన'3 ప్రత్యయానికి 'ఫ' గుర్తు. 'ఇక'4 ప్రత్యయానికి 'ఠ' గుర్తు. 'అన'5 ప్రత్యయానికి 'యు' గుర్తు. ఆల్జీబ్రాలో—

1. నందికేశ్వర కాశిక.

2. ఇక్కడ నాగేశభట్టు "ఆచార్య శబ్దేనానాది శబ్దపురుషః" అని వింతవ్యాఖ్యానం చేశాడు. ఈ భ్రమకు కారణము చతుర్దశసూత్రి పాణిని రచితం కాదనుకోటమే కాని వేరు కాదు. ఇంకెక్కడా ఆచార్యశబ్దానికీ అర్థం చెప్పలేదితను.

3 ఆయనేయీనీయియః ఫఢఖఛఘాం ప్రత్యయాదీనామ్. పా. ౭-౧-౨.

4 ఠస్యేకః. పా. ౭-౩-౫౦.

5 యువోరనాకౌ. పా. ౭-౧-౧.

$(a+b+c)^2=?$

$b+c=x$ అనుకొనుము

$\therefore (a+b+c)^2 (=a+x)^2 \ldots$

అని చెప్పినట్టుంటుంది. భాష, ప్రయోగశైలీ నేర్చుకోటానికియందు ఈ ఆల్జీబ్రాతో శిరశ్శూలం పొందాలిసివస్తుంది.6 ఇంగ్లీషు మీడియములో జాగ్రఫీ, సైన్సు మొదలైనవి చెబితే విషయగ్రహణానికంటే ముందు ఆ పరభాష నర్థంచేసుకోటానికి తంటాలుపడినట్టుంటుంది. ఇంతమాత్రంచేత పాణినీయాన్ని లఘూకరించినట్లు భావించరాదు. ఒక శాస్త్రంగా — ఆశాస్త్రాన్ని అధ్యయనం చెయ్యటమే ధ్యేయంగా పెట్టుకున్న వారికి పాణినీయంకంటే అధ్యయనం చెయ్యదగిన ఉత్తమశాస్త్రగ్రంథం వేరొకటి లేదు.7 సాహిత్య రసాస్వాదనం, లేదా ఇతర సారస్వత శాఖలలో కృషి చెయ్యటం లక్ష్యంగా పెట్టుకునేవారికి ఇంత బెడద పెట్టుకో నవసరముండకపోవచ్చు ననేదిమాత్రం తథ్యమనిపిస్తున్నది. ఈ పాణినీయపద్ధతి ననుసరించిన వ్యాకరణసూత్రకారులు చంద్రుడు (చాంద్రవ్యాకరణం), పూజ్యపాదుడు (జైనేంద్రవ్యాకరణం), భోజుడు (సరస్వతీ కంఠాభరణం).

ఇంక కొంత ప్రాచీన పద్ధతినీ, కొంత పాణినీయ పద్ధతినీ అనుసరించి వ్రాసిన వ్యాకరణ గ్రంథాలు మధ్యమపద్ధతికి చెందినవి. "అ ఇ ఉ ఋ ఌ సమానాః, ఏ ఐ ఓ ఔ సంధ్యక్షరాణి. ఉభయే స్వరాః" (సారస్వతవ్యా. 1, 2, 3 సూ.) అని ప్రారంభించి "హయవరల, ఞణనఙమ, ఝఢధఘభ, జడదగబ, ఖఫఛఠథ, చటతకప, శషస; ఆద్యంతాభ్యామ్" అని ప్రత్యాహారసూత్రాలు చెప్పారీ పద్ధతిలో. పాణినీయప్రత్యాహారాలు వదలకుండా కొంత మార్పుతో గ్రహించి ప్రాచీనసంజ్ఞలైన అద్యతనీ శ్వస్తనీ స్వర వ్యంజన ప్రభృతులను గ్రహించి కాతంత్రంవలె సంజ్ఞా సంధి షడ్లింగాది ప్రకరణానుసారి పద్ధతిలో వ్రాయబడిన గ్రంథాలీ తెగకు చెందినవి. ముఖ్యంగా సారస్వతవ్యాకరణ మీ తెగకు చెందిన ఉత్తమగ్రంథం. పురుషోత్తమ విద్యావాగీశుడు రచించిన ప్రయోగరత్నమాల అచ్చం కాతంత్రపద్ధతి చెందినదైనా అందులో పాణినీయ సంజ్ఞలైన అచ్, ఎచ్ మొదలైనవికూడా స్వీకరింపబడినాయి. శాకటాయనవ్యాకరణం కేవలం పాణినీయ సంజ్ఞలనే: ప్రత్యాహారాలనే కొంతకొంత మార్పుతో గ్రహించినా కాతంత్రంవలె ప్రకరణానుసారంగా రచించబడింది.

ప్రాచీన పద్ధతిలో ఉన్న వ్యాకరణాలు అసమగ్రంగా ఉన్నాయని గుర్తించి పాణిని నిరుపమాన మేధాబలంతో అతడు లాఘవానికై ఉపయోగించిన చాకచక్యంవల్ల అధ్యేతల బుద్ధికి క్లేశం అధికమైంది. ఒక జీవద్భాషకు సమగ్రమైన వ్యాకరణం అసాధ్యం. ఈనాటికి సమగ్ర మనిపించింది కొన్నాళ్ళకి అసమగ్ర మవుతుంది. మానవులలో దినదినాభివృద్ధి చెందే అనుభవవైశాల్యం భాషావైశాల్యానికి కారణ మౌతుంది. అందుకే "లోకోపచారా ద్గ్రహణసిద్ధిః" (కాతం. 1. 1. 23) అన్నారు వైయాకరణులు. ఒక భాష జనవ్యవహారంలోంచి తొలగిపోయినపిమ్మట దాని సమగ్ర స్వరూపం నిరూపించే వ్యాకరణం నిర్మించవచ్చు. ఇప్పుడు ల్యాటినుకుగాని, సంస్కృతానికిగాని అటువంటి వ్యాకరణం తయారు చెయ్యటానికి ఆటంకం లేదు. కాని అరబీకి ఫార్సీకి, తెలుగుకూ ఇంకా ప్రవాహినులైన ఇతర భాషలకూ — జనవ్యవహారంనుండి తొలగిపోని భాషలకు — సమగ్రవ్యాకరణం సాధ్యపడదు. వ్యాకరణం జీవద్భాష ప్రయోగవైఖరికి పథప్రదర్శకంగా మాత్రమే వుంటుంది.8 దాన్ని ఎంత సులభంగా,

---

6. అర్థస్ఫురణను బలిచెయ్యని లాఘవం అపేక్షణీయం కాని దుర్బోధత్వానికి దారితీసే లాఘవం అసౌకర్యమే ఎక్కువ కలిగిస్తుంది. శబ్దకృతమైన లాఘవం కంటే అర్థకృతమైన లాఘవం అపేక్షణీయం. కాతంత్రవివరణ పంజికలో త్రిలోచనదాసు — "ద్వివిధం హి లాఘవం భవతి శబ్దకృతం, అర్థకృతం చేతి. తత్ర అర్థకృతమేవ లాఘవం పరార్థప్రవృత్తత్వాత్ తేషా మభీష్టమ్, అతః శర్వవర్మాపి తథా ప్రతిపాదయతి నహి వృక్షశబ్దస్య 'వృ' సంకేతం, 'క్ష' సంకేతం వా కృత్వా వ్యవహారతో వైదగ్ధీ కాచిదస్తి."

7. ఈ విషయం సమగ్రంగా వేరొక వ్యాసంలో చర్చిస్తాను.

8. సిద్ధి ర్లోకతః. శాసన మిదం దిక్ప్రదర్శనమ్. (సూత్రాంధ్ర వ్యాకరణం. సంజ్ఞా ౨, ౩) అజ్ఞాతదిశం దేశం జిగమిషోః పాన్థస్య మార్గం పృచ్ఛతః పురుషేణ కేనచి దేవం యాహీతి హస్తనిర్దేశేన దిక్ప్రదర్శనవ దిదం శాసన మధిజిగమిషూణాం ప్రథమ ప్రవృత్త్యుపకారకం భవతీ త్యర్థః (సూ. వివరణము 3 సూ.) ఈ పంక్తులు చదివినవారెవరూ చిన్నయసూరిని సంకుచితదృష్టి అని నిందించరనుకుంటాను. సిద్ధిః స్యాద్వాదాత్. హైమశబ్దానుశాసనం ౧. ౧. ౧. సిద్ధి రనేకాంతాత్ జైనేంద్ర వ్యాకరణం ౧. ౧. ౧.

సువ్యక్తంగా చెబితే అంత మంచిది. అందువల్లనే పాణినీయ వ్యాకరణంలోని క్లిష్టత లోకానుభవంలోకి వచ్చాక "వ్యాకరణ శాస్త్రం సులభంగా చెప్పటానికి వీలులేదా?" అనే ప్రశ్న ఉత్పన్నమయింది. వ్యాకరణం ధ్యేయానికి ఒక సాధనమే గాని అసలు ధ్యేయమే కాదు. అసలు ధ్యేయం భాషాప్రయోగ కౌశలత, సాహిత్య రసాస్వాదనమూను. కనుక ఎంత సులభంగా సత్వరంగా వ్యాకరణాధ్యయనం ముగించుకుంటే అంత మంచిది. ఈ విధమైన భావాలు దేశంలో ప్రబలినవి. అవి సాంద్రములైనకొద్దీ వ్యాకరణంలోని క్లిష్టబంధాలను వదిలించుకొనే మార్గాన్ని అన్వేషించటం జరిగింది. ప్రాచీన పద్ధతినీ, పాణినీయ దర్శనాన్నీ అవగాహన చేసుకున్న ఒక బుద్ధిశాలి శైవ ఆంధ్రసామంత్రి శేఖరుడు కాతంత్రం రచించి సుకుమారమతులకు వ్యాకరణాన్ని సులభగ్రాహ్యం కావించాడు.

కాతంత్ర రచనకు మూలభూతమైన కథ బృహత్కథలోనూ, కథా సరిత్సాగరంలోనూ యిలా వుంది :

పూర్వం ప్రతిష్ఠానపురం (నేటి పైఠన్) ఆంధ్రదేశానికి రాజధానిగా వుండేది. దానికి రాజు దీపకర్ణి. అతనికి సంతానం లేదు. అతని భార్య శక్తిమతి పాము కరచి చనిపోయింది. రాజు ఆమెయందే మనసు నిలిపి బ్రహ్మచర్యం అవలంబించాడు. కాని తన సంతానహీనతకు అతి దైన్యంతో సంతాపం పొందుతుండేవాడు. ఒకనాటిరాత్రి కలలో శివుడు కనబడి "అడవిలో సింహంమీద ఎక్కి తిరుగుతూండే బాలుడు కనబడతాడు. సింహాన్ని చంపి వాణ్ణి తెచ్చి పెంచుకో. అతడు నీవంశం నిలుపుతాడు" అని చెప్పాడు.

అలాగే దీపకర్ణి ఒకనాడు వేటకు వెళ్ళగా ఒక పద్మసరస్తీరంలో ఒక బాలుణ్ణి వహించుకొనివచ్చిన సింహం కనబడింది. అది బాలుణ్ణి దింపి నీరు త్రాగడానికి కొలనిలోనికి దిగుతున్నది. దీపకర్ణి ఒక్క బాణంతో దాన్ని కొట్టాడు. అప్పుడా సింహం ఒక యక్షుడుగా మరి రాజుతో — 'నేను సాతుడనే యక్షుణ్ణి. కుబేరుడి మిత్రుణ్ణి. గంగానదిలో స్నానం చేస్తున్న ఒక ఋషికన్యకను చూసి మోహించాను. ఆమె నన్ను మోహించింది. ఇద్దరం గాంధర్వ వివాహం చేసుకున్నాము. ఆమెబంధువులు ఈసంగతి తెలుసుకొని కోపచారులైన మీరిద్దరూ సింహాలు కండి అని శపించారు. ఈ బాలుడు మా కుమారుడు—వీని జన్మతో ఆమె శాపం తీరిపోయింది. వీడు మహాపరాక్రమవంతుడు. నీవంశం నిలుపుతాడు. తీసుకువెళ్ళి పెంచుకో." అని చెప్పి తనదారిని తానుపోయాడు. మహాతేజస్వియైన ఆ బాలుణ్ణి తీసుకవెళ్ళి దీపకర్ణి అల్లారుముద్దుగా పెంచుకొన్నాడు. క్రమంగా ఆ బాలుడు దినదినప్రవర్ధమానుడై మహాపరాక్రమవంతుడని పేరుపొందాడు. సాతునిచేత వహింపబడిన వాడవటంచేత అతడు సాతవాహననామంతో ప్రసిద్ధుడైనాడు.

కొంతకాలానికి దీపకర్ణి సాతవాహనుడికి రాజ్యం అప్పజెప్పి వానప్రస్థుడైనాడు. నిజపరాక్రమాతిశయం చేత సాతవాహనుడు సార్వభౌముడై అనేక విలాసినీరతుడై ఆనందంతో కాలం గడుపుతున్నాడు.

వసంతోత్సవసమయంలో ఒకనాడు సాతవాహనుడు భార్యలతో జలకేళి సల్పుతున్నాడు. శిరీషకుసుమసుకుమారాంగియైన ఒకరాణి అలసిపోయి, వేగంగా నీళ్లు చల్లుతున్న రాజుతో సంస్కృతంలో "దేవ, మా మోదకైః స్తాడయ" అని వేడుకుంది. రాజు సంస్కృతభాషాభిజ్ఞుడు కాకపోవటంచేత 'మా + ఉదకైః' అనే సంధిగతార్థం గ్రహించలేక మోదకములనే మాటమాత్రం గ్రహించి వెంటనే పరిచారకులచేత గంపెడు మోదకాలు తెప్పించాడు. అది చూసి ఆ రాణి "నీళ్ళతో కొట్టవద్దంటే మోదకాలు తెప్పించావేమిటి? ఇంతమాత్రం సంస్కృతం తెలియదా నీకు?" అని గేలి చేసింది. రాణులంతా గొల్లున నవ్వారు, సేవకులంతా ముసిముసినవ్వులు నవ్వుకున్నారు. సాతవాహనసార్వభౌముడు అవమానంతో క్రుంగిపోయాడు.

ఇంతకాలం తాను పరాక్రమపరాయణుడై సంస్కృతం నేర్చుకోనందువల్లకదా తనకింత అవమానం ఒక స్త్రీ చేతులో కలిగింది. ఈ వయస్సులో తనకు సంస్కృతమెలా అబ్బుతుంది? ఈ అవమానం ఎలా భరిస్తాడు తను? ఈ విధమైన ఆలోచనలతో కుంగిపోతూ రాచకార్యాలు మాని మందిరంలోంచి బయటికి రాకుండా బాధపడుతున్నాడు సాతవాహనుడు.

సాతవాహనుడి మంత్రులు శర్వవర్మ, గుణాఢ్యుడూను. వాళ్ళు రాజుగారి అంతర్యం తెలుసుకోటానికి

ఆయనదగ్గిరికి వెళ్ళి ఎంతో ప్రాధేయపడ్డారు. తుదకు తెలుసుకున్నారు. "ఓహ్! ఇంతేకదా! మీరు బెంగ పడకండి. నేను మిమ్మల్ని ఆరేళ్ళలో సంస్కృత వ్యాకరణపారంగతులుగా చేస్తాను. నిజానికది పన్నెండేళ్ళు నిరంతరాభ్యాసంవల్లగాని సాధ్యపడేది కాదు. కాని నేను ప్రయత్నించి మీకు ఆరేళ్ళ అల్పవ్యవధిలోనే నేర్పుతాను. భాషకు ముఖం వ్యాకరణం. అది సాధించిన తరువాత భాషలో మీరు సాధించలేనిది వుండదు. విచారం వీడి రాజకార్యప్రవృత్తులు కండి'9 అని గుణాఢ్యుడు రాజును ఓదార్చాడు. అది విని సర్వవర్మ—10 "సుఖోచితుడైన సార్వభౌముడు అంత కాలం ఎలా క్లేశమనుభవించగలడు? అలా కాదు. నేను ఆరు నెల్లలో వ్యాకరణం నేర్పుతాను" అన్నాడు. అప్పటి వరకూ అసంభావ్యమైన యీ ప్రతిజ్ఞ విని గుణాఢ్యుడు రోషంతో "ఆరు నెల్లలో నీవు రాజుగారికి వ్యాకరణం నేర్పగలిగితే నేను సంస్కృతం, ప్రాకృతం, దేశిభాష వదలిపెడతాను" అన్నాడు. సర్వవర్మ పట్టుదలతో 11 "నేనుగనుక చెప్పినట్టు చెయ్యలేకపోతే పన్నెండేళ్లు నీ పాదుకలు శిరస్సుతో మోస్తాను" అని బదులుపలికాడు. సర్వవర్మ అంపరిస్పృష్టిలోనూ అసంభావ్యమైన పనికిపూనుకున్నందుకు అంతా నవ్వుకున్నారు.

సర్వవర్మ ఇంటికివెళ్ళి దుస్తరమైన తన ప్రతిజ్ఞను భార్యకు వినిపించాడు. ఆమె "కుమారస్వామి నారాధిస్తే కాని నేముంది?" అని ధైర్యం చెప్పింది. సర్వవర్మ నిరాహారుడై తపస్సుచేసి కుమారస్వామిని ఆరాధించాడు. కుమారస్వామి ప్రత్యక్షమై

9. "జ్ఞాయతే సర్వవిద్యానాం, ముఖం వ్యాకరణం నరైః, అహం తు శిక్షయామి త్వాం, వర్షషట్కేన తద్విభో!' కథాసరిత్సాగరం. 7 త, 144 146.

10 "సుఖోచితో జనః క్లేశం కథం కుర్యాదియచ్చిరమ్? తదహం మాసషట్కేన దేవ, త్వాం శిక్షయామి తత్." క, స. సా. 7 త. 145.

11 సర్వవర్మా తతోఽవాదీన్న చే దేవం కరోమ్యహమ్, ద్వాదశాబ్దాన్ వహామ్యేవ శిరసా తవ పాదుకే." క. స. సా. 7 త. 149

[12]"నీ సంకల్పం సిద్ధిస్తుంది" అని అభయమిచ్చి "సిద్ధో వర్ణ సమామ్నాయః" అనేసూత్రం చెప్పాడు. స్వామి దర్శనంతో సరస్వతి సర్వవర్మ ముఖంలో ప్రవేశించింది. మొదటిసూత్రం వినగానే సర్వవర్మ మానవ చాపల్యంచేత తరువాత సూత్రాలు ఊహించుకొని "తత్ర చతుర్దశాదౌ స్వరాః దశ సమానాః......" అని వరుసగా చెప్పబోయాడు. అప్పుడు కుమార స్వామి[13] "నేను చెప్పేదాని కడ్డువచ్చి నీవు చెప్పకుండా వుంటే ఈ వ్యాకరణం పాణినీయవ్యాకరణానికి ఉపమర్దకమై వుండేది. ఇప్పుడిది లఘుశాస్త్రం మాత్రమే అయింది. అయినా నీకోరిక ప్రకారం సాతవాహనుడికి ప్రయోగవిజ్ఞానం కలిగించగలవు. అతడూ సామాన్యుడు కాడు. పూర్వజన్మలో భరద్వాజ శిష్యుడూ మహాతపస్వి అయిన కృష్ణుడనే ఋషి కుమారుడు. అతడు సులభంగానే విద్య నలవరచుకోగలడు" అని చెప్పాడు. సర్వవర్మ యీ సూత్రాలు కుమారస్వామి వాహనమైన నెమలియీకలమీద వ్రాసుకున్నాడు. అందుచేత ఈ వ్యాకరణానికి కలాపవ్యాకరణమని పేరు వచ్చింది. ఇది బృహత్తంత్రం కాక లఘుతంత్రం గావటంచేత దీనికి కాతంత్ర వ్యాకరణమనే పేరు వచ్చింది.[14]

సర్వవర్మ ప్రతిజ్ఞానుసారంగా ఆరుమాసాల్లో సాతవాహనుణ్ణి సంస్కృతవ్యాకరణంలో ప్రజ్ఞ కలవాణ్ణిగా చేశాడు. ఒకనాడు సాతవాహనుడు కొలువు తీరి వుండగా ఒక బ్రాహ్మణుడు తాను రచించిన శ్లోకమొకటి చదివాడు. రాజు స్వయంగా సంస్కృతంలో దాన్ని వ్యాఖ్యానించి సారస్యం వివరించాడు. అంతా మిక్కిలి సంతోషించారు. గుణాఢ్యుడు భాషాత్రయం త్యజించి మౌనియై అడవులకు వెళ్లాడు. అక్కడ పిశాచజాతిభాష నేర్చుకొని మౌనం త్యజించి ఆ భాషలోనే బృహత్కథ రచించాడు.

ఈ కథ సత్యాసత్యాలెలా వున్నా పాణినీయం అభ్యసించటం క్లేశకరంగా వుందని భావించబడిందనీ, ఆక్లేశం తొలగించి సులభంగా వ్యాకరణం నేర్పటానికి ప్రయత్నం జరిగిందనీ దానికి ఫలస్వరూపమే కాతంత్రవ్యాకరణం అనీ విశదమౌతున్నది. పాణినీయ పద్ధతినిబట్టి వ్యాకరణం నేర్చుకోటానికి పన్నెండేళ్లైనా పట్టేదనీ, కొందరు బుద్ధిమంతులు ఆరేళ్లలో దానిని నేర్చుకలిగేవారనీ తెలుస్తున్నది.[15] కాలక్రమేణ అల్పాయుష్కులౌతున్న మానవులకు ధ్యేయమైన సాహిత్యరసాస్వాదనకు సాధనంగా వుండే వ్యాకరణం నేర్చుకోటానికి పన్నెండేళ్లు కాకుండా, ఆరేళ్లుకూడా గడపటం చాలాకష్టం. కనుక దాన్ని సులభం చెయ్యాలనే ప్రయత్నం కాలోచితంగానే బయలుదేరింది. ఈ ప్రయత్నంలో సఫలమైన కాతంత్రంయొక్క స్వరూపమూ, అది యేవిధంగా వ్యాకరణాధ్యయనాన్ని సులభం చేసిందీ అనే విషయమూ మరో వ్యాసంలో చర్చిస్తాము.

ఈ కథలో పేర్కొనబడిన సాతవాహనుడే ఆంధ్ర సాతవాహన వంశానికి మూలపురుషుడని ప్రసిద్ధి. ఈవంశంలోనివాడైన సిముకుడు మగధను జయించాడు (క్రీ. పూ. 230). సాతవాహనుడి కాలం కొన్ని ఉపపత్తులనుబట్టి క్రీ. పూ. సుమారు 450 సం. ప్రాంతమని చెప్పవచ్చును.

---

12 తతో ఽనః ప్రభుణా తేనస్కందేన మమ దర్శనమ్, దత్తం తతః ప్రవిష్టా మేముఖే మూర్తా సరస్వతీ, అథాసౌ భగవాన్ సాక్షాత్ షడ్భిరానన పంకజైః, సిద్ధో వర్ణసమామ్నాయ ఇతి సూత్ర ముదీరయత్. క స సా. అ. 9, 10.

13 అథాబ్రవీ త్స దేవో మాం నావదిష్యః స్వయం యది, అభవిష్య దిదం శాస్త్రం పాణినీయోపమర్దకమ్. క. స సా 8 త. 12

14 అధునా స్వల్పతంత్రత్వాత్ కాతంత్రాఖ్యం భవిష్యతి, మద్వాహన కలాపస్య నామ్నా కాలాపకం తథా. ఇత్యుక్త్వా శబ్దశాస్త్రం తత్ ప్రకాశ్యాభినవం లఘు. క. స సా. 8 త. 13, 14.

15 7 త. 144-145 లో గుణాఢ్యవచనం—

తతో ఽహ మవదం రాజన్ వర్షై ర్ద్వాదశభి స్సదా,
జ్ఞాయతే సర్వవిద్యానాం ముఖం వ్యాకరణం నరైః.
అహం తు శిక్షయామి త్వాం వర్షషట్కేన తత్ప్రభో!

# ఈశాన

శ్రీ సుప్రసన్న

ఉదయమోహన కిరణోజ్జ్వల మాకన మాకాశమునను దూరాంచలముల
లో వెలుగుల చెర్వులో పచ్చపచ్చని రశ్మికాంతులలో వినూత్న శీత
కిరణ ఉల్లిన వెల్గు తెరలలో ఒకతల్లి, ఆమెకన్నులు పరమార్థమెల్ల
తామవైనట్లు, దృక్త్వము దృశ్యతయులేని యట్లు, దయలు పొంగినట్లు, నిమిద
లై మెరపులై నలుపులై అగ్నిసూర్య చంద్రమసములై చిరుమేటి జంటవోలు
ఆమె వచ్చె నాయింటికి ఆమె స్వయముగా బయల్దేరినది నన్ను కాంచుకొరకు.

శ్రీరామచంద్రుని చిత్తవీధికయట్లు ఆమె ఫాలము ప్రభాతాబ్జరేఖ
మైథిలీదేవి కోమలదృశాంతములట్లు ఆమెపదములు సంధ్యారుణములు
ఆమె చూపులు నిగమాద్యర్థోద్ఘాటనా మహావాక్య విన్యాసకములు
అమె కన్నులు నిగమాంతతత్త్వజ్ఞాన రహస్యప్రమాపథలక్ష్యభూము
అంతె-ఆమె మోహనాకారమును చూచి మనసులోన కోర్కె మసలరాదు
ఒక మహానుభవము ఉద్దీప్తమైనచో కోర్కెలెల్ల మనసుకొసలజారు.

పోల్చుకోలేక అంబుజవల్లి యనుకొంటి ఈశాన, జగతామధీశదయిత
నర్తింపలేక నిత్యాకాశ మనుకొంటి అమృతవర్షిణిని సూర్యాంతరాత్మ
మధురకల్యాణి రాగముకోన సౌందర్య రేఖ యనుకొంటి పూరింపలేక
అనుభూతి మధుర కావ్యరసాత్మవేదన యనుకొంటి భావనకందరాక
ఏమి యనుకొందు నిన్నుమాహేశ్వరీ విలాస కల్పితజైవాత్ర కాగ్రచూడ!
కృత్తలోక సద్భావయోగీశ్వరీ పదాంత సుమమానసముల్లనదాత్మభావ!

గాలిలో వాసనల్ కదలిరావేమి, వాయువుతోడ చెప్పిరావో ప్రమీల
అమె వచ్చెడు వేళ యైనది జాగేల, గంధము తేవె ఆనందలక్ష్మి
పూలుగుచ్చుటలోని ప్రొద్దుపోనిత్తువో పద్మిని నీవును పాడవలయు
ఎవరికి పట్టనట్లేమె యోగిని సత్యవతి నీవు పూజింపవలయురమ్మ.
అప్సరస్సాధులార హేలా శరత్పయోధరాంచల చిక్కణాయువతులార!
ఆమె పాదముల్ నొసలితో నద్దుకొనుడు దవ్వులానంద మాత్మలో త్రవ్వుకొనుడు.

సౌందర్యలహరిని స్వామి శ్రీ శంకర వాగ్దేవి చూడాగ్ర వారిజమువు
ఈ సృష్టి ఎల్ల కెచ్చెడి వేయిరేకుల తమ్మిపూవై నీవు తావి వగుదు
తమ్మిరేకుల కొన ధావళ్యమ్మున నమరిన దయ్యె వేదాంత ఫణితి
ఒకరేకు ఒకరేకు ఒకసోనవోవును అన్నిరేకుల కొన చిన్నిగుర్తు
ఏది-ఏదిరో ఒకరేకు నాదు బ్రతుకు నాక్రమించి వియత్పథమల్లు క్రమ్మి
అస్పృశ సౌందర్య వాహినీ ఆదిదేవి స్వాదుభావ చమత్కృత సాధుచిత్త!

అమ్మవారి మనోజ్ఞ హాసముల్ విరిసెనో, ఎచటివే విరిసిన ఈ సుమములు?
సామోదములు తల్లి శ్వాసలే సాగెనో, ఏలనో ఈ గాలి కిట్టి తావి—
ఒలికెనో దేవి కన్నుల సుధారసములు, ఎచటిదో వాగ్దేవి కింత సొగసు?
నఖరోచిరేఖ లెన్నక దిగివచ్చెనో, ఏమిటి బ్రహ్మవిద్యా మహస్సు
సాగి ఆమె కరుణ దాగిలిమూర్తులై సర్గలయము లిచట సంభవించు
అవ్యాహత మైన ఆ మెద మూర్ధాన మైకి యోగులామె వారిరాజ్ఞి.

తెలి మంచుమల కొమ్మ విరజిమ్మె నమృతమ్ము ప్రణవ పాత్రికయందు పట్టుకొమ్ము
తొలిసామి సామమే తులకించె వెన్నెలల్ మన నంబుజము కొనల్ మలచికొమ్ము
తమ్ములారింటిపై తరణి పుట్టుకవచ్చె దహరాభ్రమునయందు దారియిమ్ము
శివభావభావనా శీధు పుష్పమందెమ తల్లి స్వస్థితి మరచిపొమ్ము
చెరకుతోటవోలె విరిసిన దేవిలో అణువు అణువు మన్మథునకు నెలవు
ఒక్క చిత్తజునకు ఉలికెద వేఁనో ఆమె సన్నిధానమందు నిలచి.

చెరగిపోసిన సూర్యకిరణమ్ము లొదిగెలే ఈగడ్డిపరకలం దింత సౌరు
ఇంతజ్యోతిష్మంత మీ నేలపై. తన యడుగుల నిడు తుషారాద్రితనయ
లోలమ్ము లివి శశిలోక దివ్యాంగనల్ సిగపూల సాగిన సొగసుగాలు
లానందముల దొరసాని చేలాంచలముల కొసలను మోహమున స్పృశించు

నమె పుల్కరించెనా, మృదుజ్యోత్స్నలు
విరిసికొన్న నఖిల విశ్వమందు
ఏల వ్యర్థమైన ఈ శరీరము నాకు
కాను నేను చంద్రకాంతశిలను.

# వర్గవ్యవస్థ: సంఘశ్రేయస్సు

శ్రీ రాచకొండ రామదాసు

మానవసమాజములో వేరు వేరు ప్రవృత్తులు గల వ్యక్తులనేకు లుందురు. అట్టి విభిన్న వైఖరులతో, పరిమితలక్ష్యములు, వర్గప్రయోజనములు సాధింపనెంచు సంస్థలు పెక్కు గలవు. ఉదాహరణకు కార్మిక సంస్థలను, వ్యాపార సంఘములను, వ్యవసాయిక సమితులను పేర్కొనవచ్చును. భారతదేశములో వ్యవసాయమే యుపాధిగా నూటికి డెబ్బదివంతుల జనులు జీవికసాగించుచున్నారు. సాంఘిక సమస్యలపై వీరందరి భావము లొకేతీరున నుండవు. వ్యవసాయోత్పత్తిని సేకరించుటకు ప్రభుత్వ యంత్రాంగము, ధరల ప్రమాణము. వ్యవసాయాభివృద్ధికి వలయు వసతులు మొదలగు అంశములపై వారి దృక్పథము వారి దైనందిన జీవికచే ప్రబలముగా రూపొందింపబడి యుండును. పారిశ్రామిక, వాణిజ్యాభివృద్ధితోపాటు ఛాంబర్స్ ఆఫ్ కామర్సు, ట్రేడ్ యూనియను సంఘములు మొదలగు ప్రాతినిధ్యవర్గముల ప్రాముఖ్యము కూడ హెచ్చుచున్నది

వర్గప్రాధాన్యము కల్గిన సంస్థల విధానములవలన సామాజికలక్ష్యములకు కీడు కలుగు నవకాశమున్నదా? నేటి భారతదేశ రాజకీయ, నైతిక, ఆర్థిక జీవితముపై వీని ప్రభావ మెట్టిది? అని ప్రశ్నించుట సహజము. వ్యక్తులు తమ స్వార్థమునకై పాటుపడినపుడు సమాజపు ఆవశ్యకతలు తీరుచున్నవనియు, వివేచనయుతమగు స్వార్థచింత మానవుల శ్రేయమునకు మూలకారణ మగుచున్నదనియు ఆడమ్ స్మిత్ ప్రతిపాదించెను. వర్గసిద్ధాంతములు, వర్గ సంస్థలు జాతిలో ఆత్మబలము, విద్యాసంస్కారము, సంయమశక్తి యున్నచో సమాజశ్రేయమునకు నిరోధకములు కానేరవు. పారిశ్రామిక దేశములలో పెట్టుబడిదారులకు, కార్మికజనులకు పరస్పర సంఘర్షణలవలన దేశపు ఆర్థికక్రమమునకు ఘాతకల్గుననియు, అరాచక మేర్పడుననియు కార్ల్ మార్క్స్ విశ్వసించెను. కాని అమెరికా, ఇంగ్లాండు దేశములలో నిది జరుగకుండుటకు జాతిలోగల క్రమశిక్షణమే కారణము.

మనదేశములో స్వాతంత్ర్య సంపాదనకు ముందున్న సమైక్యభావము నేడు మనసమాజములో గానవచ్చుటలేదు. కార్మికులు అధిక వేతనములకు, ఆధునిక సౌకర్యములకు ఆందోళన సాగించుచున్నారు. సమ్మెలు నిత్యసామాన్య సంఘటనలైనవి. పారిశ్రామికులు ఉద్యోగుల ప్రావిడెంటు ఫండు చట్టము, ప్రభుత్వ భీమాపథకము మొదలగు కార్మిక శ్రేయస్సాధనములను ప్రతిఘటించుచున్నారు. వ్యాపారసంస్థలు ప్రభుత్వపు పన్నులవిధానమును, ప్రభుత్వరంగసంస్థలను, వాణిజ్య నీతిని తీవ్రముగా విమర్శించుచున్నవి. వర్గ్ములు, వివాదములు, దుష్ప్రచారము అభ్యుదయకృషి కంతయు అపస్వరమై తోచుచున్నది. ప్రజలలో దేశభక్తి తగ్గెననుకొనుట పొరపాటు. రెండవ ప్రపంచయుద్ధమునకనంతరము ప్రపంచస్థాయిలోను, దేశీయరంగములోను కూడ విప్లవాత్మకము మార్పు లనేకములు కల్గెను. దేశము పరదాస్యశృంఖలాబద్ధమై యున్నపుడు రాజకీయోద్యమ మన్నివర్గములలో ఏకైకవైఖరి సాధింపగల్గెను. నేటి సమాజములో మనల నెదుర్కొను సమస్యలు ఆర్థిక సంబంధమైనవి. వీటి పరస్పర బాంధవ్యమును గుర్తించుటకు క్రమశిక్షణ, సరియైన నాయకత్వము ఆవశ్యకములు. నినాదములకు లొంగక దేశపు స్థితిగతులను, తమ విద్యుక్తధర్మములను గ్రహించుటకు పౌరులంతర్ముఖులై, దేశపు భవితవ్యమందు నమ్మకము కలిగియుండవలెను. ఆరంభమున కార్మిక సంఘముల వైఖరిని చర్చింతము.

వర్గసంస్థలలో కార్మిక సంఘములను తరచుగా పేర్కొనుట పరిపాటి. భారతదేశ కార్మికోద్యమ స్వరూపమును క్లుప్తముగా సమీక్షించి వీని కార్యాచరణ విధానములు దేశపు ప్రగతిపై నెట్టి ప్రభావమును కల్గించుచున్నవను ప్రసంగము కొనసాగింతము. మనదేశములో కార్మికోద్యమము ప్రథమ ప్రపంచ యుద్ధానంతరము రూపు దాల్చెను. ఫ్యాక్టరీలచట్టము, కార్మికుల పరిహార శాసనము, వేతనముల చెల్లింపు చట్టము

మొదలగు చర్యలద్వారా పారిశ్రామిక కూలీలకు కొన్ని అత్యావశ్యక రక్షణలేర్పరుపబడెను. 1926 వ సం॥ లో భారత ట్రేడు యూనియనుల చట్టము ద్వారా వారి సంస్థలను రిజిస్ట్రీచేయు సౌకర్యమేర్పడి, నిధులకు రక్షణ కల్పింపబడెను. 1929 వ సం॥ లో పారిశ్రామిక వివాదముల చట్టము ద్వారా పరిష్కార యంత్రాంగ మేర్పరచుటకు ప్రభుత్వమునకు అధికారమీయబడెను. రెండవ ప్రపంచ సంగ్రామ కాలములో డిఫెన్సు ఆఫ్ ఇండియా నిబంధనల ననుసరించి సమ్మెలు, లాకౌట్లు నిషేధింపబడెను. భారత దేశ కార్మిక వ్యవస్థలు స్వాతంత్ర్య పోరాటమున కుపాంగములై, రాజకీయోద్యమ ఛాయలను ప్రదర్శించుచునవై యుండెను. వాని నాయకత్వము ఇతరుల చేతిలో నుండెను. రెండవ ప్రపంచయుద్ధము తరువాత స్వాతంత్ర్య సంపాదనతో పరిస్థితులు పూర్తిగా మారెను. తత్పూర్వము ప్రభుత్వ కార్మిక నీతిలో కార్మిక శ్రేయస్సాధనకంటె దండనచర్యల పాలు హెచ్చుగా నుండెను. పారిశ్రామిక వివాదములను పరిష్కరించుటకు సూచింపబడిన మార్గములను ఉభయపక్షములచే నంగీకరింపచేయుటకు అవకాశము లేకుండెను. కార్మిక సంఘములు ఆర్థిక సమస్యల నెదుర్కొనుచున్నను, దేశము పరదాస్యశృంఖలములచే బాధింపబడి యుండుటచే రాజకీయ వాతావరణముచే ఆవృతమై యుండెను. దేశీయ సమాజస్థితికి, కార్మికవర్గ సంస్థల కార్యక్రమములకు పరస్పరసంబంధ ముండెను. 1947 వ సం॥ తరువాత అనేక మార్పులు వచ్చెను. యుద్ధకాలములో పెరిగిన ధరలు, యుద్ధము తర్వాత కూడ హెచ్చు కాజొచ్చెను. పరిశ్రమలకు ప్రభుత్వ సహాయ ఫలితముగా నూతనావకాశములు కలుగ జొచ్చెను. అనేక పారిశ్రామిక సంస్థలు ఉత్పత్తిని పెంపొందించుటకు ఆధునీకరణపథకములు, విస్తృత ప్రణాళికలు సంసిద్ధము గావించుచుండెను. కొన్ని సంస్థలలో అదనపు కార్మికులు పనిలోనుండి తొలగింపబడుచుండిరి. ద్రవ్యోల్బణము, ధరల పెరుగుదలలచే కార్మికులు వేతనముల పెంపున కాందోళన చేయుచుండిరి. ప్రభుత్వ శాసనములవలన కార్మిక సంస్థల అధికారములు, పరిశ్రమల నడకలో వారికి గల స్థానము గౌరవప్రదమగుచుండెను. దేశపు కల్లోల పరిస్థితులను, కార్మికుల మూఢభక్తిని తమ ప్రయోజనములకై వినియోగించుకొనుటకు కొన్ని రాజకీయ పక్షములు కార్మిక వర్గములపై తమతమ ప్రాబల్యము నధికము గావించుకొనుటకు వానిని రెచ్చగొట్టుచుండెను. మితవాద నాయకత్వము గల ఇతర కార్మిక సంస్థను కూడ సభ్యుల ఆశలను త్రోసివేయలేక, ప్రవాహముతో పాటు పోవుట తప్ప వేరు గత్యంతరము లేదయ్యెను. నేటి కార్మికోద్యమములో స్వతంత్ర ప్రకటనకు ముందున్న సామాజిక చింత లేదనిపించును. నేడు ఆర్థిక సమస్యల ప్రాముఖ్యము హెచ్చు. రాజకీయ వివాదములవలె గాక, ఈ విధానములు వివాద భూయిష్ఠమైన గడ్డు ప్రశ్నలు. మన దేశములో కార్మికులు తన స్థితిని బాగుపరచుకొనవలెనను నుద్దేశము ప్రబలముగుట సహజము. కాని ప్రస్తుత పరిస్థితులలో కష్టసాధ్యము. మన దేశపు ఆర్థిక సంపద ఇతర దేశములతో పోల్చిచూచిన స్వల్పము. ఉత్పత్తిశక్తి పెరగకుండ వేతనములను పెంచుట వలన ఆర్థికముగా కలుగు నష్టాలు, దేశములోని ఇతర పక్షముల కడగండ్లు సమీక్షించుటకు వలసి. శిక్షణ—పారిశ్రామిక కార్మికులమాట యటుంచి కేంద్ర కార్యాలయము సిబ్బందియందే లోపించుట కన్పట్టెను. కార్మికులు, కార్మిక సంస్థలు సమ్మెలు, ఆందోళనలు ప్రోత్సహించుటకు ముందు అత్యావశ్యకములో వారి కొనగూడిన లాభమును సంస్మరించుట, రాజకీయ పోరాటమునకు వలెనే ఆర్థిక విజయ సాధనకు కూడ త్యాగబుద్ధి చూపించుట, సమాజ స్థితిగతులందు సుశిక్షిత విజ్ఞానము నలవరచుకొనుట యత్యావశ్యకము. 1947 వ సం॥లో ఫ్యాక్టరీల సవరణ చట్టమువలన పనిచేయవలసిన గంటలు తగ్గింపబడెను. అంతకుమించి శ్రమించినదానికి అధిక వేతనము లీయబడవలెనని విధింపబడెను. 1947 వ సం॥పు పారిశ్రామిక వివాదముల చట్టముద్వారా పారిశ్రామిక శాంతిస్థాపనకు ప్రత్యేక యంత్రాంగ మేర్పాటు చేయబడెను. పారిశ్రామిక ట్రిబ్యునల్ సంస్థలు, లేబర్ కోర్టులు మొదలగునవి కార్మిక న్యాయ విచారణకై నెలకొల్పబడెను. కార్మిక సంస్థల రక్షణకు, యజమానులచే వాని గుర్తింపుకు ప్రత్యేక సూత్రములు ఏర్పరుపబడెను. కార్మికుల ప్రావిడెంట్ ఫండు చట్టము, కార్మికుల స్టేటు ఇన్సూరెన్సు చట్టము మొదలగు శాసనములు 1952 వ సం॥ లో ప్రవేశ పెట్టబడెను. పారిశ్రామిక గృహవసతి సౌకర్యములకు

ప్రాతిపదిక ఏర్పడెను. ఈ శాసనసృష్టిని దేశీయార్థిక శక్తికి మించినదానిగా అనేక పారిశ్రామిక వేత్తలు, ఆర్థిక శాస్త్రవిద్యాధికులు అభిప్రాయము ప్రకటించిరి. శాసన చర్యలవలన కార్మిక సంబంధములను బాగు చేయుట దుస్సాధ్యమని విమర్శించిరి. కాని ఈ విమర్శలు గావించినపుడు గత శతాబ్దములో కార్మిక శ్రేయోదాయక యత్నములందు మన దేశము వెనుకబడి యున్నదనియు, కార్మికులకు కల్పింపబడిన రక్షణలు నేడు నాగరిక దేశములం దన్నిట గలవనియు, వీని ఆచరణయందు సహకరింపక పోవుట అజ్ఞాన చిహ్నమనియు గ్రహింపవలసి యుండెను. పారిశ్రామిక యుగములో కార్మిక జీవితమునకు వసతులు కలుగచేయుట భవితకు మేలుచేగల పారిశ్రామిక నీతి. కార్మికులకు ప్రభుత్వ సానుభూతియున్నను వారి ప్రత్యేక సమస్యల నెదుర్కొనుటకు అనవరతము జాగరూకులై, ఆత్మశక్తి నవలంబకులై యుండుట తప్పదు. దేశములో ధరల పెరుగుదలచే కార్మికుల జీవన ప్రమాణము నానాటికి దిగజారుచున్నదనియు నిరుద్యోగ భయముచే కార్మిక జీవితములో నిశ్చింత లేదనియు, తమ సదుపాయము ననుసరించి యజమానులు యథేచ్ఛగా సంస్థలను మూసివేయునప్పుడు కార్మికుల ఇబ్బందిని విస్మరించుచున్నారనియు, ప్రభుత్వ శాసనచర్యల సత్ఫలితములను కార్మికులకు చేరకుండునట్లు యజమానివర్గము అనేక యుక్తుల నవలంబించుచున్నారనియు, కార్మికునకు వ్యవస్థలో ఆదరము కాని, అధికారము గాని లేదనియు, కార్మిక సంస్థలను గుర్తించుటలో కార్మికులకు నిజముగా ప్రాతినిధ్యము వహించిన సంస్థలను గాక ఇతర సంస్థలను గుర్తించుచున్నారనియు, బోనసుల నిచ్చుటయందును సుముఖత లోపించెననియు—నిట్టి భావములు కార్మికులవలన మనము వినగలము. పారిశ్రామికుల ప్రతినిధియగు శ్రీ లక్ష్మీపత్ సింఘానియా, అఖిలభారత పారిశ్రామిక యజమానుల సంస్థ అధ్యక్షు ప్రసంగములో దేశములో మొత్తము శ్రామికుల సంఖ్య 184 మిలియన్లనియు, అందు పారిశ్రామిక కార్మికులసంఖ్య ఏడు మిలియన్లు మాత్రమే ననియు, భారతదేశమునకు, ఇతర దేశములకు పారిశ్రామిక వేతనములలోగల తేడా దేశీయాదాయములోగల వ్యత్యాసముకంటెచాల తక్కువయున్న విషయము ప్రముఖమైనదనియు వివరించెను. యునైటెడ్ కింగ్‌డమ్, అమెరికా సంయుక్తరాష్ట్రముల దేశాదాయము మన దేశాదాయముకంటె క్రమముగా 15 రెట్లు, 34 రెట్లు హెచ్చు. కాని ఆ దేశములలో పారిశ్రామిక వేతనములు 5 రెట్లు, 15 రెట్లు మాత్రమే హెచ్చు. దేశములో వ్యవసాయకూలీల సరాసరి దినబత్తెము 1951-52 లో 17.5 అణాలు. పారిశ్రామిక కూలీల సంపాదన 54.5 అణాలు. 1951-52 సం|| నుండి ఈనాటి వ్యవకాలములో జీవనము అంతగా మారినదనకొనుటకు లేదు. ఇట్టి దేశప్రజ సాలుసరి ఆదాయము తలకొక్కరికి వచ్చిన రూ. 289 యైనచో పారిశ్రామిక కార్మికుల సంవత్సర సంపాదన రు 1,204. అనగా దేశపు జనాభాలో తలొకరి ఆదాయమునకు పారిశ్రామికరంగములో కార్మికుని సంపాదన సుమారు 400% హెచ్చుగానున్నది. అ|| సం|| రా., యునైటెడ్ కింగ్‌డమ్, ఫ్రాన్సు, కెనడా దేశములలో ఈ నిష్పత్తి వరుసగా 190.150, 116, 280 వరకు నున్నది. దేశీయాదాయమునను రెట్టలో పారిశ్రామిక కార్మికుల భాగము హెచ్చగుటకు ఉత్పత్తిశక్తి ఇతోధికము కావలెను. కార్మికులయందుగల సానుభూతిచే ప్రభుత్వము శాసనసభలను ముందు వెనుకలు లేక ప్రవేశపెట్టెననియు అల్లారుముద్దుగా పెంపబడిన బిడ్డ కుటుంబస్థితిని తెలియలేక అందరాని కోర్కెలచే తల్లిదండ్రులను వేధించినట్లు, కార్మికవర్గములు ఆందోళన చేయుటచే దేశములో పారిశ్రామికాభ్యుదయమున కాటంకము కల్గుచున్నదనియు వీరి భావము.

1959 వ సం|| పు మొదటి సగభాగములో యూరోపు దేశముల పర్యటన తర్వాత ప్రసంగించుచు కేంద్ర ప్రణాళికామంత్రి శ్రీ గుల్జారీలాల్ నందా దినదినాభివృద్ధినొందుచున్న ఆర్థిక సంపన్నతను తాను యూరోపు దేశములందు గాంచితిననియు, దాని ఫలితము ప్రజలందరియందు, వారి ప్రవృత్తియందు గాంచగల్గితి ననియు, భారతదేశమందు మాత్రమే కార్యసాధనయందు సంతృప్తికరముగా, పరస్పర దోషారోపణము, నిస్పృహ చుట్టుముట్టెననియు వెలిబుచ్చెను. కడచిన పది, పండెండు సంవత్సరములలో దేశపు ఆర్థిక వాతావరణము అత్యంతానుకూలమయ్యెను ముందెన్నడు లేని అవకాశములు, ప్రభుత్వసహాయము వాణిజ్య పారిశ్రామికరంగములలో రూపొందెను. కాని వ్యాపార వర్గములలో కృతజ్ఞతాభావముకంటె విమర్శన, నింద హెచ్చుగానున్నవి. ధనికగల అంగబలము దేశములో నే యితర వర్గమునకు లేదనుట అతిశయోక్తి కానేరదు. అసోసియేటెడ్ ఛాంబర్స్ ఆఫ్ కామర్స్, ఆల్ ఇండియా ఫెడరేషన్ ఆఫ్ ఇండియన్ ఛాంబర్స్ ఆఫ్ కామర్స్, ఆల్ ఇండియా మాన్యుఫాక్చరర్స్ ఆర్గనైజేషన్, ఆల్ ఇండియా ఆర్గనైజేషన్ ఆఫ్ ఇండస్ట్రియల్ ఎంప్లాయర్స్. ఇండియన్ మైనింగు అసోసియేషన్, ఇండియన్ మిల్ ఓనర్స్ అసోసియేషన్ మొదలైన సంస్థలనేకములు కలవు వీనిలో కొన్ని ప్రాంతీయ ప్రాముఖ్యము గలవి లేక ఒక పరిశ్రమకు సంబంధించినవి. కాని కొన్ని అఖిలభారత ప్రాముఖ్యము గలవి. అత్యధిక ఆర్థిక ప్రతినిధ్యములుకల్గి, ప్రభుత్వవర్గములచే గౌరవ

సన్మానము నొందుట కర్తవ్యమైనది. వ్యాపారవర్గములు పైన పేర్కొనబడిన వివిధ సంస్థలద్వారా తమ దృక్పథమును ప్రకటించుటే గాక, స్వరక్షణను సమర్థత పొందియున్నవి. ఫోరమ్ ఆఫ్ ప్రైవేటు ఎంటర్‌ప్రయిజు వంటి ప్రత్యేక సంస్థలద్వారా తమ వాదమును ప్రజలయెదుట నుంచుచున్నవి. రాజకీయపక్షములను వివాదములద్వారా, ఇతరమార్గములద్వారా బలపరచి రాజకీయాధిక్యము సాధింపగల్గియున్నవి. పత్రికా సంస్థలద్వారా ప్రజాభిప్రాయమును, ప్రభుత్వ వైఖరులను తమ కనుకూలముగా మార్చుకొనునట్టి కౌశలములు సాధించియున్నవి. కార్మికులకు ట్రేడు యూనియన్ సంస్థలు, రాజకీయ పక్ష సహాయము, అనుకూల పత్రికల చేయూతగలవైనను వ్యాపారవర్గములు తమ ప్రత్యేకవర్గ సంస్థలు పత్రికా బలము, రాజకీయ బాంధవ్యములు కల్గియున్నవి. బ్రిటిషు పరిపాలన దేశమున నెలకొనియున్నపుడు సంస్థానాధీశ్వరులు, జమీందారీ భూస్వాములు, ఆంగ్లాచారవ్యామోహపీడితులగు కొందరు విద్యాధికులు తప్ప, కార్మికులు, గ్రామీణులు, వ్యాపారస్థులు, మిగిలిన జనులు దేశపు రాజకీయ విమోచనమే ఆర్థికాభ్యుదయమునకు పీఠికయగునని గ్రహించి సర్వతోముఖముగా సమైక్యము నెరపిరి. నేడట్లుగాక కార్మికుల వేతనములకు, పారిశ్రామిక లాభములకు పరస్పర వైరుధ్యమున్నట్లు, ప్రభుత్వపు పన్నులు దేశీయాదాయమునుండి బందిపోటు సేయునవన్నట్లు, ప్రభుత్వరంగ విస్తృతీకరణము పారిశ్రామికప్రగతికి పునాదులుగాక వైయక్తిక క్షేత్ర పరిధిపై నిర్బంధచర్యలన్నట్లు వ్యాపారవర్గము ఊహింప మొదలిడుట వలన సామాజిక వాతావరణము సంఘర్షణములచే కలుషితమగుచున్నది. సామాజికావసరములను అవగాహన చేసికొనుటకు, దేశీయాభ్యుదయమునకు వలసిన సమైక్యకృషిని నెరపుటకు దేశీయులందరు సంస్కారమును, జాతీయత జీర్ణించియుండవలెను. కొన్ని శతాబ్దముల తరబడి నిర్బంధమై, అచేతనమై పడియున్న ఆర్థిక జీవితము పునర్జీవితము కావలెనన్న, ప్రతివ్యక్తియు బాధ్యతగల పౌరుడుగా వ్యవహరింపవలెననియు, సంఘములో ఎల్ల వర్గములు త్యాగమును, ధీరతను ప్రదర్శింపవలెననియు అంగీకరింపవలెను. ఆరోగ్య, చికిత్సా సౌకర్యముల వృద్ధివలన మరణముల క్రమము తగ్గుచున్నది. జనసంఖ్య నానాటికి పెరుగుచున్నది. ఆర్థిక ప్రమాణములు క్రమాభివృద్ధి నొందవలెనన్న ఆర్థిక ప్రణాళికలు పెద్ద ఎత్తున అమలు కావలెను. వీనికి కావలసిన ధనమునకై విదేశముల సహాయము కోరకుండ దేశపు సిరి, సంపదలను సమీకృతము చేయవలెను. వెనుకబడిన దేశములు శీఘ్రాభివృద్ధి సాధింపవలెనన్న పన్నులభారము అధికముగుట సహజము. ఇట్టి ప్రణాళికా సందర్భములో వస్తువుల ధరలలో హెచ్చు తగ్గులు కల్గుచో ప్రజలకు కడగండ్లు తగ్గించుటకు వ్యాపార సౌజన్యము ఆవశ్యకము. ఇతర దేశములకు సరుకుల ఎగుమతులను పెంపొందించుటకు వ్యాపారములో నిజాయితీ కావలెను. క్రొత్తపన్నులను స్వీకరించుటకు, అమలులోనున్న పన్నులెట్లు హెచ్చింపును గ్రహించుటకు దేశీయార్థికవ్యవస్థను దృష్టియందుంచుకొనుట శ్రేయము. భారత దేశములో అనేకుల నిత్యాదాయము వారి ప్రాథమికావసరములకే చాలదు. ఆదాయము ఏ కొద్దిగనో పెరిగినను నిలువచేయుటకు వీలింక యుండదు. ప్రభుత్వాదాయములో హెచ్చుపాలు పారిశ్రామిక, వ్యాపారసంస్థలనుండియే. వ్యక్తులనుండియు కొంతకాలమువరకైనను లాభకారియుండును. బహుశా ఈ విషయము జ్ఞప్తియందుంచుకొని కేంద్ర ఆర్థిక మంత్రి శ్రీ మురార్జీ దేశాయి ధనార్జన యున్న తావునుండియే పన్నుల సేకరణకు తాను యత్నింపవలెనని స్పష్టీకరించెను.

వ్యాపారవర్గముల యజమానరీతికి, కార్మిక సంస్థల వర్గప్రధానమగు ఆందోళనవైఖరికి పరస్పర సంఘర్షణ ఫలితమే పారిశ్రామిక అశాంతి, సమ్మెలు, లాకౌట్లు రూపమును ధరించి పారిశ్రామిక వస్తూత్పత్తికి నష్టము కల్గించి ప్రజాసమూహమునకు ఇబ్బంది పాలు చేయుచున్నది. ప్రభుత్వ ద్రవ్యవిధానమును, వాణిజ్య నీతిని, పారిశ్రామిక కార్యక్రమమును వ్యాపారరంగ ప్రతినిధులు తీవ్రముగా విమర్శించుట సామాన్యమైనది. విమర్శనలు, చర్చలు, అభిప్రాయ ప్రకటనాధికారము కొన్నియెడల స్ఖలితములను కల్గించినను, వీనివలన దురభిప్రాయములు కల్గి, జాతీయాభ్యుదయమునకు ముప్పు రాకూడదు. క్రొత్త కంపెనీ రిజిస్ట్రేషను, కంపెనీ షేర్ల మార్కెటు విలువలు, వ్యాపారగతులను పరీక్షించువారే వ్యాపారరంగమునకు కల్గిన మేళ్లు తెలియుచున్నవి.

కార్మిక కర్షకులు అధిక వేతనములను, సౌకర్యములను, వ్యాపారవర్గములు పన్నుల తగ్గింపు, వాణిజ్యస్వేచ్ఛను ఎట్లు కోరుచున్నారో వ్యవసాయవర్గ ప్రతినిధులు తమ సరుకులకు హెచ్చు ధరలను కోరుచున్నారు. ప్రభుత్వపు ఆహారసేకరణ పద్ధతులను నిరసించుచున్నారు. భూసంస్కరణ కార్యక్రమము తమ వ్యక్తిగతదృష్టినుండియే చూడగల్గుచున్నారు. ఇక విద్యార్థి వర్గములలో క్రమశిక్షణ దిగజారుటకు గల కారణముల చర్చ నిత్యము వినుచున్నాము. దేశపు నిర్మాణ కార్యక్రమములు సక్రమముగా ఫలస్వరూపము పొందవలెనన్న వర్గదృష్టిని విడనాడి, సమాజ శ్రేయమును మూలతత్త్వముగా గ్రహించుట అత్యావశ్యకమని తోచకమానదు.

# పిచ్చివాడు!

శ్రీ ఇసుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి

సూర్యబింబం పశ్చిమాద్రిలో సగం మునిగివుంది. ఎర్రటి కాంతులు క్రమక్రమంగా పేలవం అయిపోతున్నాయి. పాలేరు పశువుల్ని ఇంటికి తోలుకు పోతున్నాడు. దూరాన గుళ్లో గంటలు గణగణ మోగుతున్నాయి. గబగబ గుళ్ళోకి వెళ్ళాడు ఈశ్వరయ్య. గుడిచుట్టూ మూడు ప్రదక్షిణాలు చేశాడు. గర్భగుడికి వెళ్ళాడు. చేతులు కాళ్లూ తేలిపోతున్నాయి. కళ్లు గట్టిగా మూసుకుని నిలబడిపోయాడు. మనస్సు చిక్కబట్టుకుని వెనక్కు తిరిగాడు. శివ శివ అనుకుంటూ మెల్లిగా బైటకు వచ్చాడు. కాళ్ళు కదలడం లేదు. తిమ్మిరలు ఎక్కి మొద్దుబారిపోయినట్లు అయిపోయినాయి. చైతన్యరహితంగా ముందుకు సాగాడు. కళ్లు చెదిరిపోతున్నాయి. ఒళ్ళు గంతరిస్తోంది. పట్టుపసనీ ముక అట్లాగే నడుస్తున్నాడు. ఇంటి ముందరకు వచ్చేటప్పటికి మనస్సు చెదిరిపోయినట్టనిపించింది. గుండె గుభేలుమంది. అటూ ఇటూ పరకాయించాడు. పెద్దగా ఆయాసపడిపోతున్నాడు. గుమ్మంలోకి అడుగు పెట్టాడు.

'గోపిగా! ముందర గదిలో ఎవరున్నారు చూడు...' అంటూ పాలు పితికబోతున్న పాలేరును మెల్లిగా పిలిచి అడిగాడు.

'చిన్నమ్మగారు...వున్నారండి!...'

'అమ్మగారు ఎక్కడున్నార్రా! ..'ఆదుర్దాగా అడిగాడు.

'ఇక్కడ కనిపించటం లేదండి...... లోపల వున్నారేమో!'

'మెల్లిగా పోయి అమ్మగారితో నేను పిలుస్తున్నానని చెప్పి తీసుకురా!...ఉష్...చాలా మెల్లిగా ...ఎవరికీ కనిపించకూడదు...'

పాల చెంబు దభాలున క్రింద పడేశాడు పాలేరు. వణుక్కుంటూ లోపలికి వెళుతున్నాడు.

'పాలేవిరా!...' ఒక సన్నటి కంఠం, అతన్ని నిలవేసింది.

రెండు గుటకలు వేశాడు. మాట రాలేదు.

'ఏమిటి అట్లా మొద్దులాగ నిలబడిపోయినావు... మాట్లాడవేం! అట్లా చూస్తావేమిటి!...' అంటూనే జ్యోతి వెళ్ళిపోయింది.

'అమ్మగారు...' ఇంకా ఏమీ అనటానికి తోచ లేదు.

బాగా ఆయాసపడి పోతున్నాడు. లోపల్నుంచి ఉప్పెనలాగ వచ్చి పడుతున్న అమ్మగార్ని చూసి దడదడలాడి పోయాడు. ఆమెగారు పూర్తిగా దగ్గరకు వచ్చేసింది.

'అమ్మగారూ...అయ్యగారు...' అంటూ వెనక్కు తిరిగాడు.

ఈశ్వరయ్య చప్పున సంజ్ఞ చేశాడు. అటు ఇటు చూసి చప్పున పరమేశ్వరి గడుగుమ్మందగ్గరకు వచ్చి, నిలబడింది. కిటుపటాయిస్తూ ఆయన కూడా వచ్చేశాడు. భర్త మొహం చూడంగానే చెప్ప గాభరాపడింది, ఆయన మొహం అంత భయంకరంగా వుంది.

'ఏమిటండీ!...' అన్నది ఆదుర్దాగా.

'వమాళుడు వస్తున్నాడు' అన్నాడు ఎంతో బింకంగా.

'ఎప్పుడు!...ఎట్లా! ఎవరు చెప్పారు!...' పరమేశ్వరి బిత్తిరి చూపులు చూస్తోంది. చేతిలో టెలిగ్రాం మళ్లీ ఒకసారి చదివాడు. 'అవును రేపే వస్తున్నాడు. ఎవ్వరికి చెప్పక. నాకేమి తోచటం లేదు. ఏం చెయ్యాలో అర్థం కావటం లేదు.' తపనపడిపోతున్నాడు.

'ఏం చెయ్యమంటారు మరి!' పరమేశ్వరి నొక్కి అడుగుతోంది.

'అదుగో ఎవరో వస్తున్నట్టున్నారు...' ఈశ్వరయ్య ఉలిక్కిపడి వెళ్లబోయాడు.

పరమేశ్వరి స్తబ్ధురాలై పోయింది.

'ఏమిటే అమ్మా అట్లా నిలబడ్డావు!' నవ్వుతూ వస్తూనే జ్యోతి అడిగింది.

'ఏం లేదులే!...నీపని చూసుకోరాదూ! ప్రతి దానికీను...' విసుక్కుంది.

'ఎప్పుడూ నాపనేనా చూసుకోవటం? కాస్తంత నీకు కూడా సహాయం చేద్దామని వచ్చా!'

'అమ్మతల్లీ! ఎంత ప్రేమే నామీద! పాపం వచ్చావు.. ఇప్పుడేమి అక్కర్లేదు కాని, అవసరము వచ్చినప్పుడు పిలుస్తా కాని. నీకేమన్నా పనుంటే చూసుకో...'

'నీ కవసరము వచ్చినప్పుడు నాకు తీరుబడి వుంటద్దూ!...'

'అత్తేం వేంక వెళ్లమంటే వెళ్ళు!...'

జ్యోతి మూతి ముడుచుకుని వెళ్లిపోయింది.

'అక్కయ్యా నీకోమాట. ఎవ్వరితో చెప్పద్దు... ఆ! ఏం లేదు అమ్మ ఏమిటోగా వుంది. నాన్నేమో చెప్పిన వాకిట్లోకి వెళ్ళిపోతూనూ, చెప్తుంటుంటే వినుకుంటోంది. నువ్వేమను చెపుతుందేమో!' జ్యోతి అక్కయ్య చెవిలో మెల్లిగా ఊదింది.

'అమ్మ ఏమిటే!...' యమున తల్లి దగ్గరకు వచ్చింది.

'అది. చెప్పిందా ఏమిటి!...'

'అసలు ఏమిటే!...'

'ఏం లేదు......ఒక్కమాట. జ్యోతితో కూడా అనద్దు. రేపు కుమారుడు వస్తున్నాడట!...'

'నిజంగానా!...'

'ఉష్!' తగ్గరగా మాట్లాడక. ఎవరితోనైనా అనేవు కొంపతీసి...'

'ఇప్పుడెట్లాగు?'

'ఏమో నాకేమి అర్థం కావటం లేదు...కస్తూరి ఏం చేస్తోంది. ఎక్కడుంది....'

'దొడ్లో అంట్లు తోముతోంది...'

'జాగ్రత్త! దాని చెవిన పడనీక...చాలా ఇదిగా వుండాలి.'

'రేపు వస్తే తెలీదా!'

'వచ్చిన తర్వాతకూడా తెలీకూడదు...ఏదో ఉపాయం ఆలోచించాలి...'

'ఎట్లా చేస్తావు?'

'ఇప్పుడేమీ మాట్లాడక......ఎవరో వస్తున్నట్లున్నారు!'...

'పెద్దన్నయ్య వచ్చాడే!...'

'వచ్చాడూ!...'

'అదుగో అమ్మగారు ఎదురుచూస్తోందిగా! భర్తను ఆహ్వానించి తీసుకుపోవటానికి...'

'ఛీ! ఛీ! ఎంత సిగ్గులేకపోయింది! వాడి బ్రతుకు ఒక బ్రతుకేనా! పెళ్లానికి బానిస అయిపోయాడు. ఆ మోజేమిటో అర్థం కాదు...'

'అదుగో వదిన నావైపునే చూస్తోందే ...'

'చూస్తే ఏం చేస్తుందా...'

'మహావిష పురుగు...'

'అవునే అమ్మ. అవును...మనం ఏం చేస్తాం చెప్పు. వాడి ఖర్మ అట్లా కాలిపోయింది. పరాయి పిల్లని పెళ్లి చేసుకున్నాడు. అనుభవిస్తున్నాడు. ఎవరి ఖర్మ వాళ్ళను భరించక తప్పేదేముంది చెప్పు...అవును కాని వాడి విషయము ఎవరితో చెప్పక, నాన్నగారు బజారు వెళ్లారు.'

'ఈపాటికి ఏదో ఏర్పాటు చేస్తారు...' పరమేశ్వరి చటుక్కున వెళ్లింది. యమున అక్కడే నిలబడి ఆలోచిస్తోంది.

'కాత్యాయనీ! ఒక్క మాట......ఇది అతి రహస్యం...ఎవ్వరితో చెప్పకూడదు. రేపు కుమారుడు వస్తున్నాడు......' సనత్ ఎంతో ఉద్వేగంగా అన్నాడు.

'కుమారుడా!...!' ఆశ్చర్యంగా అన్నది కాత్యాయని.

'అవును...మా అమ్మకు తెలీకూడదు...మా నాన్నకు తెలీకూడదు...వచ్చేదాకా ఇంట్లో ఎవ్వరికీ చెప్పకూడదు. చాలా జాగ్రత్త...అతిరహస్యం... నాకేం చెయ్యాలో తోచటం లేదు, ఎవ్వరికీ తెలీకుండా వాణ్ని తీసుకురావాలి. కస్తూరికి కూడా ముందుగా చెప్పక...నాకు చాలా భయంగా వుంది, ఎక్కడ తీసుకురావటం, ఏం చెయ్యాలో... అంతా అయోమయంగా వుంది...' సనత్ తెగ ఆరాటపడి పోతున్నాడు.

'చాలా జాగ్రత్తగా వుండాలి...' కాత్యాయని నివ్వెరపోయి చూస్తోంది.

తలుపుచాటున చప్పుడయినట్లయింది. చప్పున ఈ విషయం మార్చేసి, 'ఏమిటి ఇవాళ్ళ బజారుకు వెళదామా!' అన్నాడు సనత్.

'మీ ఇష్టం...రమ్మంటే వస్తాను...' కాత్యాయని చిరునవ్వు మొహంతో భర్తవైపు చూసింది.

'నేనుకూడా వస్తాను వదినా!...' అంటూ జ్యోతి తొందరగా వచ్చిపడింది.

భార్యాభర్తలిద్దరూ ఒకరిమొహం ఒకరు చూసుకుని నిర్విణ్ణులయిపోయారు. 'అన్నయ్యకు ఇష్టం లేకపోతే నేను రాన్లే!'

'నేను వద్దన్నానుటే!...' సనత్ తన స్పృహలోకి వచ్చాడు. అమ్మయ్య అనుకుంది కాత్యాయని.

'అట్లాగే నువ్వుకూడా రా!...' అన్నారు ఇద్దరూను.

జ్యోతి ఇంత మొహం చేసుకుని చరచర వెళ్ళిపోయింది.

'ఇందాకటినుంచి ఎక్కడుంది!...'

ఏమో నీకూ అదే అనుమానం వేసిందీ!... అవుతే దాని వాలకం చూస్తే మన మాటలు విన్నట్టు కనబడటం లేదులే!...'

'నాకూ అదే ధైర్యంగా వుంది!...మరి మీరు రేపు ఏం చేస్తారు!...'

'ఇప్పుడు నన్నేమీ అడగద్దు, ఏంచేస్తానో నాకే తెలీదు.. ...' సనత్ తీవ్రంగా ఆలోచించుకుంటున్నాడు.

జ్యోతి, ఇట్టే బట్టలుమార్చుకుని వచ్చేసింది. కస్తూరి మొహం, ఒళ్ళు అంతా నుట్టి చేసుకుని బాగా అలసిపోయివచ్చింది తలవంచుకుని మెల్లిగా గదిలోకి వెళ్ళబోతోంది.

'వదినా...' జ్యోతి, వెనకాలే వెళ్ళి భుజం తట్టింది.

కస్తూరి త్రుళ్ళిపడింది. శరీరంలోని వణుకు ఎంతో సేపటికిగాని తగ్గలేదు 'వణికిపోతున్నావేమిటే వదినా?...'

కస్తూరి ఏమీ మాటాడలేదు...

ఆమె చెయ్యి పట్టుకుని చరచర పెరటిలోకి తీసుకువెళ్ళింది. ఆమె తలవంచుకునే వుంది.

'వదినా! నీకో మంచివార్త చెపుతాను నాకేమి బహుమతిస్తావు...'

తలెత్తి జ్యోతివంక చూసింది.

'ఏమిటే అవతారం? శుభ్రంగా సబ్బుతో మొహంకడుక్కురా! పెట్టెలో ఇన్ని చీరెలు పెట్టుకుని ఏమిటా చీర! మార్చుకెయ్యి ... ఎవ్వరితో చెప్పద్దు... పైగా నేను చెప్పానని అసలు చెప్పద్దు... అందరూ నామీద పడతారు...రేపే...రేపే...అన్నయ్య వస్తున్నాడు!...'

'ఆ!...' కస్తూరికళ్ళు గిర్రున తిరిగిపోయినాయి. ఒళ్ళంతా చెమటలు కారిపోతున్నాయి ఉన్నది ఉన్నట్టుగా క్రిందపడిపోయింది. జ్యోతికి గాభరా వేసింది. చకచక పెద్దవదినదగ్గరకు వెళ్ళి చెప్పింది.

'ఏమో మరి ఇందాకటినుంచి పనిచేసిందిట... కళ్ళుతిరిగి క్రిందపడిపోయింది...' అంతకంటె ఒక్క మాట చెప్పటంలేదు జ్యోతి

'కాస్త మొహాన నీళ్ళుపోస్తే, అదే లేస్తుంది. దీనికింత ఆర్భాటం ఎందుకంట!...' పరమేశ్వరి సలహా ఇచ్చి వెళ్ళిపోయింది.

జ్యోతి తత్తరబిత్తరలాడిపోతోంది. స్పృహ వచ్చిన తర్వాత ఏమంటుందో, ఏమి చెపుతుందో అని భయపడిపోయింది. ఎటూ తోచటంలేదు. ఆ విషయం ఎవరితోనూ చెప్పటానికి వీల్లేకండా వుంది. జ్యోతికి ఆరాటం ఎక్కువయిపోతోంది. ఎట్లాగైనా ఈ విషయం చెప్పకపోతే తనమీదికి వస్తుందేమో, చెపుతే ఎవరితో చెప్పటం. ఎట్లా చెప్పటం. విపరీతంగా మథనపడిపోతోంది. చటుక్కన ఓ ఉపాయం తట్టింది. పెద్ద వదినతో చెప్పితే సరిపోతుందనుకుంది. చాటుగా పిలిచింది.

'వదినా! వదినా! ఒక్కమాట—నువ్వు ఎవ్వరితో చెప్పనని ఒట్టేస్తే, ఒక్కమాట చెపుతా! నాకు భయమేస్తోంది. ముందర ఒట్టెయ్యి వదినా!...' తొందర పెట్టేస్తోంది జ్యోతి

'ఒట్టెందుకులే చెప్పు... నేనెవ్వరితో చెప్పనుగా!...'

'చిన్నవదిన ఎందుకుపడిపోయిందో తెలుసా!..' మరే!...చాలా పిరికిది. భయస్తురాలు. రాత్రేమో కలొచ్చిందట...కలలో నేమో చిన్నన్నయ్య కనిపించాడుట... నేను వస్తున్నానని చెప్పాడుట. అయినా కలలు ఎక్కడైనా నిజమవుతాయా! ఏమో నాకు తెలీదు మరి...ఒకప్పుడు నిజమవుతాయటగా!...మరి నే నన్నాను...నాకు కలొచ్చింది...అన్నయ్య వస్తున్నట్టు అన్నాను. అసలు నాకు కల రాలేదు వదినా! వచ్చినా, అన్నయ్య వస్తున్నట్టు కల రానేరాలేదు. ఊరికే తమాషాకు అన్నాను. అంతే! నిజమనుకుందో ఏమో! నాకేమీ అర్థంకాలేదు నేను ఆమాట అన్నానో లేదో! అమాంతం పడిపోయింది... నాకేం తెలీదు... నేనేం చెయ్యలేదు. ఈ మాట మా

అమ్మకు కాని, అక్కయ్యకు కాని తెలిసింటంటే చాలా ప్రమాదం.. నాకు భయమే మేస్తోంది వదినా!.'

మాటా పలుకూ లేకుండా నిశ్చలంగా నిలబడిపోయిన కాత్యాయిని కళ్లల్లోకి దీనంగా చూస్తూ జ్యోతి నిలబడిపోయింది.

'ఏమిటి వదినా! అట్లా చూస్తున్నావు... నాకు భయమేస్తోంది...'

'ఏం లేదు!... కలొచ్చింది రాత్రి!...' రెండు మూడు సార్లు నసించుకుంది. అంతే! జ్యోతికి మరింత భయమేస్తోంది. వదినతో చెపితే తన ఆగుర్దా. ఆవేం చల్లారుతాయేమో అనుకుంటే ఇంకా కటకంటె ఎక్కువయిపోయినాయి. మనస్సంగా పరిపరివిధాల పోతోంది. వెళ్ళుతున్న కాత్యాయనిని చూస్తూ అల్లాగే నిలబడి పోయింది.

'ఏమిటే అట్లా మొద్దులాగ నిలబడిపోయి నావు...' పరమేశ్వరి చటుక్కున అన్నది.

'నా కేమిటో భయమేస్తోందే?... నాకేం తెలీటం లేదు... అమ్మ... నాకు భయంగా వుందే!...' తల్లిని చుట్టేసుకుంది జ్యోతి.

'చెపితే వింటావూ! ఇంటిపట్టున వుండమంటే, ఒకటే తిరుగుడు. క్షణం తీరిక వుండదు. ఎక్కడ దసుచుకువచ్చావో ఏమో!......'

'అలాంటిదేమీ లేదే!...'

'కాసేపు కళ్ళుమూసుకుని పడుకో. అదే తగ్గి పోతుంది. మీ పెదవదినుందిగా, వెళ్ళి అడుగు ఏం సలహా చెపుతుందో!...'

'పెద్దవారు మీరున్నారుగా! మీ సలహాకంటె మంచిది చెప్పగలదా!' కాత్యాయని వెంటనే అందు కుంది.

'మా అమ్మకూడా సలహా చెప్పగలదానివనే, నీ దగ్గరకు వెళ్ళమంటోంది...' యమున వ్యాఖ్యానిం చింది.

'నా సలహాలు విన్నవాళ్లు సుఖంగా కాపురాలు చేస్తూనే వున్నారు.'

'మాకావా అమ్మా...... దూకావా!...ఏమం టుందో!...' యమున గొంతులో గీర వచ్చింది.

పరమేశ్వరి ఉగ్రరూపం దాల్చింది. ఆ సమయంలో ఏం చేసేదో, ఏమనేదో ఆమెకే తెలీదు. అయితే ఏం? సనత్ అప్పుడే వచ్చి వున్నాడు. అక్క సంతా లోపల లోపల అణచుకుని, ఆవేశాన్ని కంపుకుని చరచర కొడుకు దగ్గరకు వచ్చింది.

'విన్నావుట్రా! నీ పెళ్లాం ఎంత మాటందో!...

'ఏమన్నదేమిటి?'

'ఏదైనా అంటుంది. నీ కళ్ళారా చూసుకుని...'

ఇంక నాకు చెప్పటం ఎందుకు?...'

'అదినా నీ సమాధానం...'

'ఇంతకంటే కావాలంటే చెపుతాను...'

'చేతకాని వాడివయిపోయావురా. ఒట్టి దద్దమ్మ వయిపోయినావు ఇంత పెళ్ళానికి దాసుడవయిపోతా వని అనుకోలేదు.'

'ఆ కష్టనష్టాలు నాకే కదుటే. నీ కెందుకు ఉక్రోషం...'

'నువ్వు నెత్తిన ఎక్కించుకో. ఏమన్నా చేసుకో. నా కెందుకు? యమునను అంటానికి దానికేమి హక్కుంది?'

'యమున కున్న హక్కు!'

'దానినోట్లో నాలిక వుందా! అదేమన్నా ఒకళ్లని కేమనిసా! తనతీరు అట్లా అయిపోయింది కదా అని నిత్యమూ కుళ్ళిపోతూ అది ఓమూల అఘోగిస్తూ వుంటే, నువ్వుకూడా దాన్నంటావేమిటి?'

'నేనేమన్నానని ఇప్పుడు!... మనసోగు మంచిదయితే అవతలవాళ్ళ నోరుకూడా మంచిదవు తుంది!...'

'తల్లి దగ్గరేనా ఈ మాటలు...'

'నీట్లో దూవలేమీ లేదే!...'

'అవును అంతా ధూవలేలే!...'

సనత్ కోరచూపు చూసి చర్రున వెళ్లి పోయాడు.

'ఇక వాణ్ణన్నా ప్రయోజనం ఏమీ లేదు. దాని మంది ఉన్నపొగరంతా. మగవాడు ఏదైనా అంటే మాత్రం, ఇంటికోడలు, అదేనా తీరు! ఇంతకీ నువ్వు చేశావు. ప్రతిదానికి పోనీలే పోనీలే అంటూ ఇంత వరకు తెచ్చిపెట్టావు...' యమున సాధిస్తోంది.

'నేనేం చేశానని అన్నంటావు...మాటంటే సమాధానం చెప్పటం చేతకాదు! చూసావేఅమ్మా అంటూ నాదగ్గరకు వస్తావు చీటికిమాటికి. నీకనోట్లో నాలిక లేదు, అదన్న మాటకు సమాధానం చెప్పలేవు. అందరినోళ్లల్లోనూ నేనా నలగటం? ఈ పారిమని

నాదగ్గరకురా చెపుతాను...' పరమేశ్వరి రౌద్రంగా కూతురివంక చూసింది.

'అంతకూ నన్నే అనాల్లే!...' యమున తాపీగా కూర్చొని ఏడుపు మొదలుపెట్టింది.

ఈశ్వరయ్య మెల్లిగా లోపలికి వస్తున్నాడు. ఎదురుగా సనత్ నిటారుగా కనిపించాడు, క్షణం ఆగి మళ్ళీ ముందుకు అడుగు వేశాడు.

'నాన్నా!...'

ఆయన చప్పున ఆగాడు, ఇద్దరూ వాకిట్లోకి వెళ్ళారు.

'...అయితే నీకు ఈ ఇంట్లో ఏమీ హక్కు లేదా! నువ్వు చెప్పింది ఏమీ సాగదా! చెప్పు, నాకు ఏదో తేల్చి చెప్పి సెయ్యి. నువ్వు పిచ్చివాడివి వున్నావని, నేను ఏమీ మాట్లాడటం లేదు. నాకు ఒక్కసారి చెప్పి సెయ్యి నేనేమి కల్పించుకోనని. మిగతా విషయాలన్నీ నేను చూసుకుంటా. నేను అన్నీ చక్కబెడతా! కుమారుడు చిన్నవాడు, వాడి మనస్సు ఎవ్వరూ అర్థం చేసుకోలేక పోయారు. కాస్తంత నేను అర్థం చేసుకున్నా కూడా ప్రయోజనం లేకపోయింది. నువ్వేమి మాట్లాడలేదు. మామయ్య ఎంత బాధపడివుంటాడు. ఆ నాటి దృశ్యం మళ్ళా కళ్ళల్లోకి వస్తే, ఒళ్ళంతా ఉడికిపోతుంది. నేను కూడా అసమర్థుణ్ణయినాను అంతా ఎదురుగానే చూస్తూ కూర్చున్నాను. నేను ఏమీ చెయ్యలేకపోయాను. కాని ఈ నాడు నేను మళ్ళీ అట్లా కూర్చోను. నేను చేసేది చేసి తీరుతాను. అయితే నేను ఏం చేసినా నీతో ఒక్కసారి ముందుగా చెప్పటం అవసరమని చెప్తున్నాను. అమ్మతో ఎన్నిసార్లు చెప్పినా ఒకటే, ఆవిడ తత్వం మారదు. ఇక నువ్వు అంతేనా! లేకపోతే ఏమైనా మార్పు వచ్చిందా? నువ్వు గట్టిగా నిలబడతానంటే నేనేమీ మాట్లాడను. లేదంటే నేను నిలబడతాను. ఈ రెండేముక్కలు... నాన్నా! బాగా ఆలోచించు...ఒక్కమాట. కుమారుడు రేపు వస్తున్నాడు. అమ్మతో కూడా చెప్పొద్దు'...సనత్ గంభీరంగా తండ్రి ముందు నిలబడిపోయాడు.

ఈశ్వరయ్య నిశ్చేష్టుడై సనత్ వంక తదేక దృష్టితో చూస్తున్నాడు. ఆ కనులలో, సనత్ ఊహించినంత పెద్దమార్పేమి కనబడలేదు. కనీసం చలించినట్లు కూడా కనబడలేదు. ఏమిటిట్లా వున్నాడనుకునికూడా పైకి నిబ్బరంగానే వుండిపోయాడు. తండ్రిదగ్గర్నుంచి విరక్తిగా సమాధానం వస్తుందో అని ఆదుర్దాపడుతున్నవాడల్లా, శిలావిగ్రహంలాగ నిలబడిపోయాడు సనత్.

ఈశ్వరయ్య ఏమీ మాట్లాడకుండానే వెళ్ళిపోయాడు లోపలికి. సనత్ బుర్ర గిర్రున తిరిగిపోయింది. కుమారుడు వస్తున్నాడంటేను ఏమీ మాట్లాడలేదు తాను అంత తీవ్రంగా చెబుతుంటేను తొణకలేదు. ఎందుకు ఇంత నిబ్బరంగా వున్నాడు అని ఆశ్చర్యపోతున్నాడు. సరాసరి లోపలికి వెళ్లాడు. ఈశ్వరయ్యకు పరమేశ్వరి ఎదురుగా కనపడింది. ఆమె వంక అదోరకంగా చూశాడు. మిగతా వాళ్లు ఇట్టే తప్పుకున్నారు.

'పిచ్చివాడికి తెలిసింది.' అన్నాడు ఈశ్వరయ్య.

'ఎట్లా తెలిసింది?' ఆదుర్దాగా ప్రశ్నించింది.

'నువ్వు చెప్పావుటగా!...' ఈశ్వరయ్య తొణకలేదు.

'నేనా!...రామరామ! నా నోటివెంబడి ఆ ప్రస్తావనే రాకపోతే, అడుగుదాం పదండి...'

'అయిపోయిన విషయాన్ని అడిగి ప్రయోజనం లేదు. ఇకముందు చెయ్యాల్సిన కర్తవ్యమేమిటో ఆలోచించాలి అంతే!...'

'ఈ నింద నామీదేమిటి, మీరే ఆలోచించండి'

'ఇంట్లోకి వస్తాడు. ఏం...'

'మళ్ళీ మొదలేకొండి...మనం అన్నీ కళ్లారా చూస్తిమేను...ఎట్లాగంట!...'

'తప్పుతుందా మరి?...'

'తప్పుతుందంటే తప్పకేతప్పుతుంది...ఎందుకు తప్పదేమిటి?...'

'నువ్వు మాట్లాడేదేమీ నాకు అర్థం కావటం లేదు...'

'మీరు ఇంతఇదిగా మెత్తబడిపోతారని నేను ఎన్నడూ అనుకోలేదు...'

'ఇక నీతో వాగ్వివాదము పెట్టుకుంటే లాభం లేదు. నీ ఉద్దేశం ఏమిటో కచ్చితంగా చెప్పి సెయ్యి. తర్వాత నేను చేసేదేమిటో చేస్తాను...'

'మీరు చేసేదేమిటో చేస్తే ఇక నేను చెప్పటం కూడా ఎందుకు మళ్ళీ!...'

'అట్లాఅయితే ఊరుకో, ఇంకా చెప్పటం కూడా ఎందుకు?...'

'సరే అట్లాగే నోరు నొక్కుకుని కూర్చుంటా లెండి...!'

'అమ్మ చిన్నవాన కళ్లు తెరిచిందే!...' జ్యోతి చెప్పన వస్తూ వస్తూ ఆగిపోయింది తండ్రిని చూసి.

'ఏమయిందేమిటే!...' ఈశ్వరయ్య ఆశ్చర్యంగా కూతురివంక చూశాడు.

'ఏంలేదు.. ఏంలేదు.' అంటూ వెనక్కు వెనక్కు తగ్గిపోయింది. కస్తూరి కళ్లు తెరవంగానే భర్త ఎదురుగా వచ్చి నిలబడ్డట్లు అనిపించింది. కళ్ళు గట్టిగా తుడుచుకుని చూసింది అంతా తన భ్రమ. అయితే యేం. రేపు తనభర్త వస్తున్నాడు. ఎట్లా వుంటాడో, ఆయన వస్తున్నాడంటేనే శరీరంగ గజలాడిపోతోంది. ఇక నిజంగా ఆయనమూర్తి ఎదుట ప్రత్యక్షమవుతే ఉండబట్టకేదా! విపరీతంగా ఆలోచించుకుంటోంది. ఆలోచించుకొన్నకొద్దీ భయమేస్తోంది. అంతపిరికిగా ఉన్న సమయంలో ధైర్యం ఇవ్వగల ఔదార్యం ఎవరిలో ఉంది! అక్కయ్య చాలామంచిది. అక్కయ్యతో చెపితే, ఏమంటుందో! జ్యోతి ఎవ్వరితోనూ చెప్పొద్దన్నది. ఎట్లాగు! కస్తూరి తెగ మథనపడుతోంది. ఏదైనాగాని, తాను అక్కతో చెప్పని విషయంలేదు. ఆమె తనదగ్గర దాచినసంగతి లేదు. ఇదిమాత్రం ఎందుకు చెప్పకూడదు అనుకుంది. జ్యోతి ఏమైనా అనుకోని, నేను అక్కయ్యకు చెప్పితీరుతాను. అనే దృఢనిశ్చయంతో కాత్యాయని దగ్గరకు వెళ్లింది. కాత్యాయని కస్తూరిని చూసి క్షణంలో త్రుళ్ళిపడింది. పాపం కలలో కనిపించగానే ఇంతగా కలవరపడిపోయింది. నిజంగానే వస్తున్నాడంటేఎంత సంతోషపడుతుందో చెప్పేశేస్తాను. ఎట్లాగైనా ఏదో రకంగా తనభర్త వస్తున్నాడనే భావం కలిగింది. అది నిజమే అని చెప్పి ఆమె మనస్సు శాంతింపచేస్తాను– అని కాత్యాయని గట్టిగా అనుకుంటోంది. కస్తూరి ఒకటి రెండు అడుగులు వేసిందో లేదో, కాత్యాయని ఆప్యాయంగా 'కస్తూరీ' అని పిలిచింది.

'అక్కా!...' అన్నది. గొంతులో గీరవచ్చింది. కాత్యాయని, భుజంమీద చెయ్యివేసిదగ్గరకు తీసుకుంది.

'నీకల నిజమే!...' అన్నది ముక్తసరిగా కస్తూరి తలవంచుకుంది...

'నిజంగానే కస్తూరి!....నిజంగానే....మరిది రేపు వస్తున్నాడు...'అన్నది ఎంతో ఉద్వేగంగా.

కస్తూరి వంచినతల ఎత్తలేదు, ఈ వార్త విని ప్రత్యేకంగా ఏప్రశ్న వెయ్యనూలేదు. 'కస్తూరీ నిన్నే!...' మళ్ళీ పిలిచింది.

'అక్కా!...' అని తలెత్తింది.

'నిజంగానే వస్తున్నాడు. నేను అబద్ధాలు చెప్పటంలేదు. నావంక చూడు...నీకేమి భయంలేదు. మేము వున్నాంగా!...'

మొహాన చేతులు అడ్డం పెట్టుకుని కంట తడి పెట్టుకుంది కస్తూరి,

'ఎందుకు కళ్ళ నీళ్ళు? అదుగో అత్తగారు వస్తున్నారు'...కాత్యాయని ఇట్టే లోపలికి వెళ్ళిపోయింది.

'అమ్మా!...కస్తూరికిఆవిషయం తెలిసినట్లుందే!' యమున విడ్డూరంగా వచ్చి చెప్పింది.

'ఎందుకు తెలీదు...ఇంటిల్లిపాటికి తెలిసింది. చివరకు తెలిసింది మనకే!...' మీ నాన్నగారు వంగనాబిలాగ నా దగ్గరకువచ్చి ఎవ్వరికీ చెప్పొద్దని చెప్పారు. ముందరే పెద్ద కుమారుడికి చెప్పవచ్చారు. వాడికి చెప్పితే ఇంకా రహస్యం దాగేదేముంది? కాత్యాయనికి చెప్తాడు. అది కాస్త కస్తూరికి చెప్పి వుంటుంది. ఇంతకి జ్యోతికి ఒకత్తికి తెలీదు, అంతే. మన రహస్యాలు ఇంతేగా! దానికి తెలుస్తే, నాకు చెప్పలేదే అంటుంది. దాని చెవినకూడా వేస్తే సరిపోతుంది. ఎందుకొచ్చిన రహస్య...'పరమేశ్వరి ఎంతో ఉక్రోషంగా అన్నది.

'అక్కయ్యా!' అంటూ జ్యోతి వచ్చింది.

'ఏమిటే? అక్కయ్యకు ఏందాచిపెట్టావు చెప్పు...'అన్నది యమున.

'ఇటురా చెప్తా!...'

'రహస్యమా!'

'ఏదో ఒకటి ఇటు రారాదు...ఏం లేదు...... చిన్నన్నయ్య రేపు వస్తున్నాడుట. అమ్మకు చెప్పక. చాలా గొడవవుతుంది...'

'నీకెవరు చెప్పారే!...'

'అదంతా నీకెందుకులే!...'

'అహా! నాకు తెలుసు. నీకెవరు చెప్పారో!...'

'తెలుస్తే అడగటం ఎందుకో!...'

'నీ తెలివితేటలలా నాదగ్గరే మీ వదిన్న దగ్గర చూపించు తెలుస్తుంది నీ మజా!'

'అవసరం వస్తే వాళ్ళు నాకు లెక్కా!...'

'మాటలవరకే!...'

'నువ్వు చూస్తావుగా!...'

'అమ్మ! జ్యోతికి కూడా తెలుసే!...'

'ఎందుకు తెలీదే!...'

'వాళ్ళ ప్లాన్లు వేరే వున్నాయి. మనకు చెప్తారా చెయ్యకుతారా! ఏమైనా గాని, ఎవరు యేమనుకున్నా సరే! నేను ఎట్లా వుండాలో అట్లా వుంటే సరిపోతుంది!...' పరమేశ్వరి ఒళ్ళంతా జలజల లాడి పోతోంది.

ఇల్లు అలంకరణంతా కౌత్యాయనే పూనుకుంది. సనత్ ఇంట్లో కావలసిన ఏర్పాటన్నీ చేసి వుంచాడు. పరమేశ్వరి మొహంలో అకారణంగా హఠాత్తుగా మార్పు వచ్చినట్లు కనిపించింది. ఈశ్వరయ్య సుభావంగానే చూస్తున్నాడు. జ్యోతి గిరగిరి గంతులు వేస్తోంది 'చిన్నన్నయ్య వస్తున్నాడు చిన్నన్నయ్య వస్తున్నాడు' అనుకుంటూ కస్తూరికి సగం సంతోషం; సగం భయం. ఆమెకు ఏమీ అర్థం కావటం లేదు. ఆయన వచ్చిన తర్వాత ఎట్లా మెలగాలో ఎట్లా మాట్లాడాలో, అసలు ఎట్లా వుంటారో, యేమన్నా మార్పు వచ్చిందో లేదో—అంతా తమాషాగా ఆలోచించుకుంటోంది.

రైలుస్టేషనుకు సనత్ వెళ్లాడు. ఈశ్వరయ్య లోపల అరుగుమీద పడకకుర్చీ వేసుకుని తాపీగా పడుకున్నాడు అతను పూర్తిగా అలసిపోయాడు; క్రుంగిపోయాడు. అతని మనస్సులో రకరకాలు ఆలోచనలు పోతున్నాయి తీవ్రంగా వ్యసనపడుతున్నాడు. గతాన్ని గురించి ఆలోచించుకుంటు వర్తమానంలోంచి భవిష్యత్తులోకి తొంగిచూస్తున్నాడు. ఆయన వయస్సు అతని వేదాంతంలోకి దింపేసింది పూర్తిగా. ఏది ఎట్లా జరగాలో అట్లా జరిగిపోతుందిలే అనే ఒక భావానికి వచ్చేస్తున్నాడు.

అందరూ ఇంటిగుమ్మంముందు నిలబడి ఆతుర్దాగ చూస్తున్నారు. కాస్తంత వాకిట్లో చప్పుడవుతే సరి అదుగో అన్నయ్య వస్తున్నాడని జ్యోతి ఇట్టేగంతు వేసి చెబుతోంది. ఇంటిముందు బండి ఆగనే ఆగింది. బండిలోంచి ముందరగా దిగాడు, సనత్.

'మనిల్లొచ్చింది. దిగు.' అన్నాడు సనత్.

ఈమాటలు విన్న అందరూ నివ్వెరపోయారు

'అవును మనిల్లే, దిగు మరి.' బతిమాలుతున్నట్లు అంటున్నాడు సనత్.

పరమేశ్వరికి కాళ్లుచేతులు ఆడటం లేదు. బండి దగ్గరకు పోదామంటే ధైర్యం చాలటం లేదు. అక్కడే ఉండబుద్ధి పుట్టటంలేదు సంధిగ్ధావస్థలో పడి కొట్టుకుపోతోంది. ఎట్లాగయితే గుమ్మందాటి బండి దగ్గరకు వెళ్ళటానికి ఉద్యుక్తురాలయింది.

కుమారస్వామి మెల్లిగా బండీదిగి నిలువునా నిలబడిపోయాడు. నిండా నూటుమీద వున్నాడు. తలకు మఫ్లర్ చుట్టుకున్నాడు. చేతిలో సంచీవుంది. కళ్లార్పకుండా అట్లాగే చూస్తున్నాడు. ఎవరినంక చూస్తున్నాడో ఎవరికీ అర్థం కావటంలేదు. ప్రక్కనే నిలబడివున్న సనత్‌కు ఎటూ తోచటంలేదు.

'అబ్బాయి!' అంటూ ఆవురుమంది పరమేశ్వరి.

'అమ్మా!' అంటూ చప్పున కాళ్లమీదపడ్డాడు కుమారస్వామి.

ఇప్పటికిగాని, ఎవరిప్రాణాలు వాళ్లకు చేరలేదు అందరి ఆవేశాలు చల్లారినట్లయినాయి, కస్తూరికి అసలు మనస్సులో రూపస్సు లేదు. నిలబడిందన్నమాటే గాని చైతన్యరహితంగా వుండిపోయింది. భర్తనోటి వెంబడి ఆ కాస్తమాట వినంగానే ఆమె ప్రాణాలు కుదుటపడ్డాయి, అవును. నిజమే. పూర్తిగా తగ్గిపోయినట్లే అనుకున్నారు.

'వదినా! అక్కయ్యా!...జ్యోతీ...నాన్నా! ...కస్తూరి...నా కస్తూరి యెక్కడున్నావా! నా కోసం నిరీక్షిస్తూ శిలలాగ ఇక్కడే ఉండిపోయి నావా కస్తూరి'.. అంటూ కుమారస్వామి దగ్గరగా వెళ్ళబోతున్నాడు.

'ముందర కాళ్లూ చేతులు కడుక్కోరా!...' అంటూ సనత్ చెయ్యిపట్టుకున్నాడు.

'నా ఇంట్లో నాకు మర్యాదలు అక్కరేదు. ముందర నా కస్తూరిని చూడని...నన్ను చూసి భయపడుతున్నావా! ఎంత పిచ్చిదానివి. నాకు పిచ్చి నయమయిపోయింది ఇక నీకు పట్టుకుందన్నమాట...!' వెర్రిగా చాలసేపు నవ్వాడు కుమారస్వామి,

ఎవరికి వారు భయపడిపోయి అట్లాగే స్వస్థానాల్లో నిలబడిపోయారు. చలనం లేదు. ఆ సమయంలో కస్తూరిని ఏం చేస్తాడో అని అందరూ హడలిపోతున్నారు. కస్తూరికి ప్రాణం లేదు. చైతన్యం లేదు. మూగదయిపోయింది. స్పృహజ్ఞానం బొత్తిగా పోయింది. పెదవు కదల్చలేదు. కళ్లు ఆర్పలేదు. మొహంకూడా మొద్దుబారిపోయింది.

'అమ్మో!...కస్తూరికి నిజంగా పిచ్చి ఎక్కిందే! ఈసారి ఆసుపత్రికి దీన్ని పంపించండి...నాకు బాగా నయమయిందిగా ని...అసలు అక్కడ ఎంత పిచ్చివాళ్ళయినా మంచివాళ్ళను చేసి పంపిస్తారు. గొప్ప ఆసుపత్రి. నాకు నయమయి నేను బైటపడ్డానంటే ఇంత కంటే తార్కాణం ఏం కావాలి చెప్పు..... మీరేమీ భయపడకండి. నేను ఉత్తరం ఇస్తా తీసుకుపొండి. కస్తూరిని చేర్పించి రండి. తప్పక నయమవుతుంది. అన్నయ్యా ఏమంటావు నువ్వు...'

'నిజమేరా నువ్వు చెప్పింది...'

'ఆ! అసలు విషయాన్ని నువ్వు గ్రహించావు అమ్మా! మామయ్య ఎక్కడ!...'

'నీ ఎదురుగుండా వున్నాడుగా!...'

'అవును!... నేనూ అదే అనుకున్నానే!... అక్కయ్యా. నీ మొగుడు దగ్గర్నుంచి ఏమైనా ఉత్తరం వచ్చిందా!...అసలు అడుగుతున్నానే!... అవుతేను నువ్వేమి అనుకోకుండా వుంటే ఒకమాట చెప్తాను...నువ్వు నమ్మవులే నాకు తెలుసు. అయినా చెప్తాను వినటంటే...మీ ఆయనకు కూడా కొంత పిచ్చివుంది. భయపడక, నయమవుతుందిలే!...అదే ఆసుపత్రి...వింటే ఆ పిచ్చినవ్వు...' జ్యోతిని చూసి దభాలున అన్నాడు.

జ్యోతికి గుండె గుభేలుమన్నది.

'నీళ్లు పోసుకుందువుగాని రా!' పరమేశ్వరి, కుమారిని చెయ్యిపట్టుకుంది.

'అవునే అమ్మా నీళ్ళు పోసుకుని ఎన్నాళ్లయిందో! అన్నం తిని ఎన్నాళ్లయిందో!...' త్వరగా నీళ్లుపోసి అన్నంపెట్టు...'

'నెత్తిన నోరుపెట్టుకుని మొత్తుకుంటున్నానుగా. ఇప్పుడు ఏంచేస్తారో చెయ్యండి. ఇది నే భరించలేను.' పరమేశ్వరి భర్తను చూసి ఆయాసపడుతోంది.

'నువ్వు భరించలేకపోతే నేనుభరిస్తాను...నువ్వు మెదలకుండా వూరుకుంటే సరిపోతుంది. అన్నీ చక్కబడిపోతాయి' ఈశ్వరయ్య తీవ్రంగా అన్నాడు.

కుమారస్వామి అన్నంముందర ఒకటే నవ్వు. గబగబ మాట్లాడేస్తున్నాడు. చివాలున లేస్తాడు. మళ్ళీ కిలకిలపడతాడు. ఒకతీరుగా వుండటంలేదు. అన్నీ వికటంగానే కనిపిస్తున్నాయి.

'వదినా! నువ్వు చాల అందంగా వున్నావు...' కాత్యాయనివంక గంభీరంగా చూస్తున్నాడు.

కాత్యాయని గజగజలాడిపోయింది. తన భర్త వంక భయంగాచూసింది. ఏమీతోచక తికమకపడి పోతోంది. కుమారస్వామి ధోరణి రెచ్చిపోతోంది. ఆపటానికి ఎవరికీ శక్యం కాకుండా వుంది. సరత్ మొహం ఎర్రబారింది. చాలా ఉద్రేకపడుతున్నాడు ఆక్షణంలో ఏమవుతుందో అని అందరూకూడా హడలిపోతున్నారు. ప్రాణాలు అరచేతుల్లో పట్టుకుని కూర్చున్నారు.

'యమునా ఎక్కడ దాచింది? ఇదెందుకు మన కొంపలో...నీ మొగుడిదగ్గరకు నువ్వు లేచిపో...పో అవతలకు...' కుమారస్వామి చీదరించుకుంటున్నాడు

పరమేశ్వరి ఏదో అందుకోబోతుంటే, 'ఇంతకీ నువ్వు చేశావు ఇదంతా. అసలు నువ్వు కొంపలోంచి పోతే సగం పీడ విరగడయిపోతుంది.' తల్లిని ఉరిమి ఉరిమి చూస్తున్నాడు.

తల్లీ, కూతురూ ఇద్దరూ చప్పున తప్పుకున్నారే కాని, లేకపోతే చేతిలో గ్లాసు వాళ్ళ మొహాన ముద్ర వేసేదే!'

సరత్ కూడా చెడ్డ భయపడిపోయాడు, ఈశ్వరయ్యకు ఎటూ తోచటంలేదు. తానే కలగచేసుకుని, 'భోజనాలముందర ఇవన్నీ ఎందుకురా? ముందర అన్నం తిను...' అన్నాడు.

'నువ్వు నాకేమీ సలహాలు చెప్పక్కర్లేదు'... కసురుకున్నాడు కుమార్.

ఒకరి మొహాలు ఒకరు చూసుకొని తెల్లమొహం చేసుకున్నారు.

అతనంటే ఇంట్లో అంతా హడలుగా వుంది. ఎవ్వరూ ఏమీ మాట్లాడటంలేదు. దగ్గరకు రావటానికి భయంగా వుంది. ఇంట్లో సింహాం వచ్చి కూర్చున్నట్లుంది. ఎవ్వరూ కూడా పెదిమ కదల్చటానికి వీల్లేదు. నోరు తెరవటానికి వీల్లేదు. ఎదురుమాట చెప్పటానికి ఎవ్వరూ సాహసించటంలేదు. నరికేస్తాను. చంపేస్తాను ఇవే మాటలు. మెదులుతే చాలు మీదపడి చంపేస్తాడేమోనని హడలిపోతున్నారు. ఇక పిచ్చి తగ్గిందేముంది అనుకుంటున్నారు.

'నాకు మీరందరూ కూడా రాక్షసుల్లాగ కనిపిస్తున్నారు. నిజంగా మీరు మానవులు కారు, మానవరూపంలోని రాక్షసులు...ఇది నిజం...నేను ఇవాల్టి నుంచి నిజమే చెపుతాను...కాచుకోండి...' కుమారస్వామి హుంకరిస్తున్నాడు.

'ఇది సంసారుల కొంపేనా! మీ అంతరాత్మలను అడగండి. ఒక్కొక్కరే వెళ్ళి అద్దంలో మొహాలు చూసుకోండి. మీ నిజ స్వరూపాలు బైట పడతాయి. మిమ్మల్ని మీరు మోసగించుకుంటున్నారు. నన్ను మోసగించటానికి ప్రయత్నం చేస్తున్నారు ఇదెన్నటికి సాగదు. నేను పిచ్చివాణ్ణిగా వున్నప్పుడు మీరు మోసం చేశారు. ఇప్పుడు నేను మంచివాణ్ణయిపోయాను. ఇంకా నన్ను మోసగించలేరు. ఎవరేనా మోసగించటానికి సాహసించారా తల బ్రద్దలు కొట్టేస్తా!...' మీదమీదికి వస్తున్నాడు.

'కుమారా!...' ఈశ్వరయ్య ధైర్యం చేసుకుని పిలిచాడు, 'ఒకసారి ఇటురా నీతో ఓమాట చెప్తాను...'

'నాదగ్గర రహస్యాలేమీ లేవు. చెప్పేదేదిటో బాహాటంగా చెప్పేసెయ్య్...మనమంతా నిర్మొహమాటంగా చెప్పేస్తాము. రహస్యాలు చెప్పము, రహస్యాలు వినము...'

'నాన్న పిలుస్తుంటే ఓసారి వెళ్ళరాదు!...' పనత్ అందుకున్నాడు.

'మీరందరూ నాకు శత్రువులే! ఎవ్వర్నీ నమ్మను... వదినా నువ్వు చెప్పు.'

వచ్చేది అమావాస్య. పిచ్చి బాగా ముదిరిపోతుందిట. దానికేదైనా ఏర్పాటు చెయ్యాలని ఆలోచిస్తున్నారు. కుమారస్వామి చూపులో కాని, వాక్కులో కాని తీవ్రమైన ఆందోళన, భయం కనిపిస్తున్నాయి. పట్టశక్యం కావటంలేదు. నోటికెంతవస్తే అంత అనేస్తున్నాడు. వేళ పగలేదీ లేదు. ఎవ్వరి మాటా లెక్కపెట్టటం లేదు. ఇల్లంతా భీభత్సం చేస్తున్నాడు; వణికించేస్తున్నాడు. మిట్ట మధ్యాహ్నమప్పుడు నలుగురు సావిట్లో కూర్చున్నారు. తలుపులన్నీ బిగించేశారు. కుర్చీలో కుమారస్వామి కూర్చున్నాడు. ఉపన్యాసం చెపుతున్నాడు. నలుగురూ తప్పనిసరిగా వింటున్నారు. ఒక విషయము కాదు ఒక లోకము కాదు. ఒకటే ధార, ఆగేటట్లు లేదు ఆ వాగ్ధాటి ఆ పిచ్చిలో అంత ఇదిగా వస్తుంటాయా మాటలు అని అనుకుంటున్నారు. శరవేగంతో మాటలు దొర్లిపోతున్నాయి. ఇంత ఉపన్యాసం, సారంకూడా 'నాకు పిచ్చి తగ్గిపోయింది. ఇప్పుడు నేను మామూలు మనిషిని ఇది మీరు గుర్తించాలి' అని. అంతకంటె ఏంలేదు. అందరిచేత బలవంతంగా తనకు పిచ్చికుదిరిందని ఒప్పించాడు. ఇంతలోకే హఠాత్తుగా తలుపు చప్పుడయింది ఎవరో కొడుతున్నట్టు. అందరూ అటువైపునే చూస్తున్నారుకాని, అందరూ లేవటానికి హడలిపోతున్నారు. కుమారస్వామి తానంతటతానే లేచి తలుపు తీశాడు.

ఎదురుగా చలపతి ప్రత్యక్షమయ్యాడు కళ్ళార్పకుండా ఒకరిమొహం ఒకరు క్షణంపాటు చూసుకున్నారు.

'నీకు పిచ్చి బాగా నయమయినట్టుందే బావా!..' చలపతి వెకిలిగా నవ్వాడు.

'నాకు నయమవుతే యేం? ఈ ఇంట్లో ఇంకా నయమవాలిసినవాళ్లు బోలెడుమంది వున్నారు...'

'అవుతే ఒక్కొక్కర్నీ ఆసుపత్రికి పంపించేసెయ్య్' ఇంకా చూస్తావే!'

'నీకోసమే ఆగా!...'

'నాకోసమా...' పకపక నవ్వుతూ 'అయితే నీకు పిచ్చి ఇంకా తగ్గలేదన్నమాట' అన్నాడు.

'అత్తగారు!... మీరు ఎట్లా చెపితే అట్లా చేస్తా!...మీరు ఎక్కడ సంతకం పెట్టమంటే అక్కడ సంతకం పెడతా!... నా పిల్లాన్ని నాతో పంపించండి... ఇదే నా రిక్వెస్టు...' చలపతి చేతులు నలుపుకుంటూ పరమేశ్వరి దగ్గరకు వచ్చాడు.

'ఇదిగో అబ్బాయి!...' ఈశ్వరయ్య మాట అందుకున్నాడు.

'అబ్బాయి ఏమిటండీ! నేను పిల్లాణ్ణటండి! మామగారూ, మీరుకూడా అంత చులకనగా చూస్తే, ఇక ఈ ఇంట్లో నాకు గౌరవం ఇచ్చేదెవరు?... చెప్పండి!...'

'నేను ఇస్తాను నీకు గౌరవం. ఎంత కావాలో చెప్పు...ఎంత కావాలంటే అంత ఇస్తాను. మొహమాటపడక. ఇంటి అల్లుడివి చవటలాగ వచ్చి దేబిరిస్తున్నావా! నీ పిల్లాన్ని నువ్వు తీసుకు పోలేవూ?...' కుమారస్వామి చలపతిమీదికి వచ్చాడు.

'ఏమిటోయ్ కొడతావా!...'

'అమ్మాయి...బావ భయపడిపోయాడు... నిజంగా కొడతానంటున్నాడు. ఒట్టి పిచ్చివాడు...'

'అందుకనే నాచేత ఆస్తంతా రాయించుకుని నన్ను వెళ్లకొట్టాలని మీ అమ్మ...అదే...మా అత్తగారి యత్నం...'

'యమునక్కాయ్!...నీ మొగుడొచ్చాడే! ఇక మాటమల్లే సద్దుకోవే. ఏమిటే అట్లా చూస్తావు?' పరమేశ్వరి కూతురికేసి చూస్తోంది.

'నా పెళ్ళాన్ని పంపించమంటే ఏమిటి అట్లా చూస్తారు! వారికే నన్ను ఒడిపించండి! నేను ఒంటరి వాణ్ణి నన్ను త్వరగా పంపించెయ్యండి...'

'అప్పుడు పంపించేసెయ్యండి ఇంకా చూస్తారేమిటి!...'

'ఏమిటండీ ఈ ఉప్పలాయి...ఈయన ఇప్పుడు దొంగను దాపరించాడంట! ఇప్పుడేమిటిచేసేది? ఏమీ మాట్లాడరేమండి!...' ఈశ్వరయ్యను ప్రశ్నిస్తోంది పరమేశ్వరి.

ఆయన మూగవాడయిపోయాడు. ఎటు అంటే ఏమి తిప్పలు వస్తాయో అని మౌనంగా ఊరుకుంటున్నాడు.

'మామయ్యా! మీరైనా చెప్పండి...నా పెళ్ళాన్ని రమ్మనమని...' చలపతి దీనాతిదీనంగా ప్రాధేయపడుతున్నాడు.

సనత్ ఎటూ మాట్లాడటం లేదు.

'నువ్వు లేస్తావా!......మెడ పట్టి వాకిట్లోకి గెంటనా!...' కుమారస్వామి ఉగ్రరూపం దాల్చాడు.

యమున చివాలున లేచి నిలబడింది. జ్యోతికూడా చప్పున లేచింది. పరమేశ్వరికి కాళ్ళు చేతులు ఆడటం లేదు. ముగ్గురూ గబగబ లోపలికి వెళ్ళిపోయారు.

'ఇప్పుడెట్లాగే అమ్మా!...ఆయన నేను అప్పుడే రాయించమంటే సరిపోయేది...నువ్వుకూడా వెళ్ళిన తర్వాత రాయమంటే రాస్తాడులే!...' పరమేశ్వరి కూతుర్ని అడుగుతోంది.

'అక్కడికి వెళ్ళినతర్వాత రాయటం కష్టమే! అయితే ఏం! ఏదో రకంగా నేను నిభాయించుకుంటానే!'

'అయితే నీకు కూడా కాపురం చెయ్యటం ఇష్టమేనా! ఆయనతో కూడా వెళతావా మరి!...'

'మరి కుమారుడేమో అట్లా అంటుంటే ఏమన్నా చేస్తాడేమోనని భయంగావుందే!...'

'ఏంచేస్తాడేమిటి!'

'ఏమో! ఆ పిచ్చిలో కొడతాడో ఏమో!...'

'ఆలోచనలు పూర్తికాలా? బైటకు వస్తారా, నన్ను రమ్మంటారా......' కుమారస్వామి అప్పుడే లేవబోతున్నాడు.

గభాలున ముగ్గురూ సావిట్లోకి వచ్చిపడ్డారు.

చలపతి మొహం విప్పారింది, ఆ సాయంత్రమే యమున చలపతితో వెళ్ళేదాక కుమారస్వామి నిలబడలేదు; నోరు మూతపడలేదు.

ఈలోపల ఏదో అనిష్టం వచ్చింది అనుకుంటోంది పరమేశ్వరి. కాత్యాయని లోపల లోపల బాగా సంతోషపడ్డది ఇంటికి ఓ పీడ విరగడయిపోయిందని. ఈ మన పిచ్చికూతురి ఒకందుకు మంచికే వచ్చిందిలే అని సంతోషపడుతోంది. యమున యింట్లోంచి వెళ్ళిపోయిన నాటినుంచి జ్యోతి ఒంటరిదయిపోయినట్లుగా అనుకుంటోంది. అక్కయ్య ఇంట్లో వున్నంత వరకు జ్యోతి అనోన్యంగా వుండేది. ఇప్పుడేమో అక్కయ్య అత్తవారింటికి వెళ్ళినప్పటినుంచి, జ్యోతి వదినమీద ఆదోరకమైన అసూయ ఏర్పడిపోయింది. మొహం చిట్లించుకుంటోంది. శాళ్వతో మాట్లాడాలంటేనే ఎబ్బెట్టనిపిస్తోంది. మరదలు, వదిన మధ్య దూరం రోజురోజుకు పెరిగిపోతోంది. ఏమిటిట్లా మారిపోయింది అనుకుంది కాత్యాయని. కస్తూరికి అసలు ఇంకో విషయం పట్టటం లేదు తనభర్త ఇట్లా ఇదయిపోయారేమా అని విచారపడుతూ కూర్చుంటుంది.

రాత్రి పది అవబోతోంది. కుమారస్వామిగది లోంచి గభాలున తలుపులుతీసి కస్తూరీ అని పిలిచాడు. కస్తూరి గుండె గుభేలుమన్నది.

'నీతో మాట్లాడాలి. రా...' అన్నాడు

పై ప్రాణాలు పైనే ఎగిరిపోయినాయి. ఒక మూల సిగ్గు బిడియం, భయం ఏంచెయ్యాలో తోచటంలేదు. అట్లాగే నిలబడిపోయింది. చలనం లేదు. ఎవరికి వారు నిద్రపోతున్నారు. ఈ అర్ధరాత్రి కస్తూరిని ఏంచేస్తాడో అని హడలిపోతున్నారు.

'దానికంట్లో బాగాలేదు. నిద్రపోని!...' అన్నాడు ఈశ్వరయ్య.

'ఏం రోగం వచ్చింది...నాకు తెలీద!...' అంటూ దగ్గరగా వచ్చాడు కస్తూరి చేతిని గట్టిగా పట్టుకుని గదిలోకి తీసుకుపోయాడు.

ఇవ్వాళ రాత్రి ఏదో ఘోరం జరుగుతుందని అందరూ అనుకుంటున్నా కూడా ఎవ్వరూకూడా ఏమీ చెయ్యలేక చిత్తరువుల్లాగ వుండిపోయారు.

'ఏమండీ మీరన్నా ఆపండి'...కాత్యాయని భర్తను బ్రతిమాలింది. సనత్ కు ధైర్యం చాలలేదు. తలుపులు ధడేలుమని వేశాడు.

అమ్మయ్య ఒక పీడ విరగడయిపోతుంది లే—అని పరమేశ్వర పెద్ద నిట్టూర్పు విడిచింది.

'అమ్మా నాకెందుకో భయమేస్తోందే!.....' జ్యోతికి కళ్ళల్లో నీళ్లు వచ్చినాయి.

'నువ్వెందుకు ఏడుస్తావే పిచ్చిదానా! ఎవరి కర్మ వాళ్ళనుభవిస్తారు' పరమేశ్వరి ఊరడించింది.

చాలా సేపటిదాక నిశ్చలంగానుండా ఎవరికి వారు గదిలో ఏం గలాభా అవుతుందో అని నిరీక్షిస్తూ కూర్చున్నారు.

'కస్తూరీ...నీకు చాలా అన్యాయం చేశాను. నిజమే! ఈ కొంపలో ఉండలేకపోయాను...వీళ్ళందరూ నాకు శత్రువులులాగానే కనిపించారు...నిజంగానే ఆనాడు నాకు పిచ్చెత్తింది. ఈ పిచ్చి నా శరీరంలో లోపంచేత కాదు. నా మనస్సు ఇదయి కాదు ఈ కొంపలో ఆగం చూడలేక నిజంగా పిచ్చెత్తినమాట నిజమే! కనుకనే నేను నిలవదొక్కుకో లేకపోయాను, నేను ఇవన్నీ భరించలేకపోయాను. మతి చలించినట్లయింది, నిజంగా పిచ్చిఅని ఆసుపత్రిలో పారేశారు. నాకు పిచ్చిలేదని అక్కడ చెప్పితే అందరూ నవ్వుతారు. ఎవ్వరూ నమ్మరు. ఎందుచేతనో ఆ పేరు రానేవచ్చింది. ఈ నెపంతో నైనా ఇంటిని చక్కబెడదామని నేను ప్రయత్నం చేస్తున్నాను....ఒకటి సఫలమయింది. ఇక రెండోది చూడాలి. ఇక్కడ పాతుకుపోయ్యున్న యమునను అత్తారింటికి పంపించేశాను. నేను ఈ వేషం వెయ్యక పోతే యమున ఈ జీవితంలో కాపరం చేసేది కాదు. చెయ్యనిచ్చే వాళ్ళుకారు. ఇంకా రెండున్నాయి నేను పిచ్చివాడులాగానే నటిస్తాను. మాట్లాడతాను. ఏమైనా వికృతంగా పనులు చేసినా గాభరాపడక. తెలిసిందా? ఈ విషయము ఇంకొకళ్ళకు తెలీకూడదు. జాగ్రత్త...ఏమాత్రం పైకి పొక్కినా అన్నీ చెడిపోతాయి. నిన్ను చూస్తుంటే నాకు చెడ జాలేస్తోంది. అపుడే ఏం చెయ్యను చెప్పు. నిన్ను ఇంకా భయపెట్టదలుచుకోలేదు. నేను వచ్చినప్పటి నుంచి చెపుదామనుకున్నా కూడా, సమయంరాక ఊరుకున్నాను. నీకేవిధమైన భయంలేదు. అర్థమయిందా?' కస్తూరిని గట్టిగా హృదయానికి హత్తుకున్నాడు.

అప్పటికిగాని కస్తూరికి ఒక విధంగా ధైర్యం రాలేదు, తనను విడిచిపెట్టి, తనభర్త వెళ్ళిపోయి నప్పుడు ఆమె మనస్సు ఏ విధంగావుందో ఊహించటం కష్టం. మొద్దుబారిపోయింది. నోటమాట లేదు, కళ్ళ నీళ్ళు లేవు ఏమీ! తాను కాపరానికి వచ్చింది. వచ్చిన కొద్దిరోజులకే ఇంట్లో పరిస్థితులు అర్థమయిపోయి నాయి. తనవాళ్లని ఎవర్నీ కూడా అనుకోవటానికి వీల్లే కుండాపోయింది. కాత్యాయినితో మాత్రం ఏమన్నా రెండుమాటలు మాట్లాడితే అంతే! అంత కంటె ఎవరితోను మాట్లాడేదికాదు. ఆ ఇంట్లో ప్రతివాళ్ళకూ అసంతృప్తి వుంది. కారణాలు ఏమిటో తెలియవు. ప్రతివారు తమ తమ మనస్సుల్లో తీవ్రమైన ఆందోళన పడుతూనే వుంటారు. అదంతా తనమీద చూపించేవాళ్లు. తానుమాత్రం ఏం చేసింది. ఎవరిని నిందించింది. ఎవరి మార్గానికి తాను అడ్డం వచ్చింది. ఏం లేదు, కాని ఎందుచేతనో కాని ప్రతి వాళ్లూ తనను చులకనగా చూసేవాళ్లు. కారణం ఏమిటా అని ఆలోచించుకుంది. ఏంలేదు. తనభర్త అందర్నీ మెప్పించాలనే వుద్దేశంతో ఎవరినీ నొప్పించ కుండా ప్రయత్నంచేస్తూ రావటమే. దాంతో బాగా అలుసు ఎక్కువయిపోయింది. తన భర్తను ఆ యింట్లో ఎవరూ కూడా మనిషిగా పరిగణించేవాళ్లే కారు. ఇక తనకు గౌరవం ఏముంటుంది! ఏమీ అనటానికి వీల్లేదు. వీళ్లిద్దర్నీ చూసి నలుగురూ అసూయపడటమే! నిత్యము ఈసడింపులే! పొగుపుమాపులే! సూటిపోటి మాటలే! ఇవన్నీ భరిస్తూ వుండటమే తనపని. తన భర్తలో ఒక్కనాడు తీవ్రంగా మార్పు వచ్చేసింది. నలుగురూ వుండగానే పెద్ద పెట్టున అరిచాడు. నలుగురూ హడలి పోయారు. అప్పటినుంచి అతనితీరే పూర్తిగా మారి పోయింది. తనకు పిచ్చిలేదు అని చెపుతూనే వున్నాడు. అయితేమాత్రం ఏం! అంతా పిచ్చివాని లాగానే మాట్లాడటం మొదలుపెట్టె! తన భర్తకు పిచ్చి ఎత్తిందనే మాట వినటంతోనే తన గుండె ఆగి నంత పనయింది. అంతే, చప్పున మొద్దుబారిపోయింది. తన హృదయానికి పెద్ద దెబ్బతగిలింది. తన భర్తను ఆసుపత్రిలో చేర్పించటం, తర్వాత ఇంట్లో వినరాని మాటలు వినటం అంతా అయోమయంగా వుంది. ప్రాణాలతో వున్నదన్న మాటే గాని చైతన్యరహిత అయిపోయింది. ఎవరు ఏమన్నా, ఎవరు ఏంచేసినా, తాను బాధపడేదిలేదు; సంతోషించేది లేదు. తాను ఇట్లా అయిపోయినా దేమిటి అని తానే ఆశ్చర్య పడింది. ఏమిటో అర్థంకాదు. పైకి చెప్పలేని వ్యథ మూగబాధ. తనభర్త మనస్సు అతి సున్నితము. అందరి

భావాలు తన భావనలే అనుకుంటాడు. ఎవరైనా కష్టపడు తుంటే చూసి ఓర్చుకోలేడు. అంత స్వార్థపు హృదయం. ఈ ఇంట్లో కర్కశాన్ని చూసి తట్టుకో లేకపోతాడు. ఒకమూల యమున ఇక్కడే ఉండి పోయి, తన భర్తను నానామాటలు అనటం, జ్యోతి తన ఇష్టం వచ్చినట్లు ప్రవర్తిస్తూ నలుగురిచేత మాటలు అనిపించుకోవటం, ఈశ్వరయ్య చేతికి ఒక్క పైసా అందనీకపోవటం. డబ్బడిగితే నానా మాటలు అనటం, దీనికి తగ్గట్టు అత్తగారు ఇష్టం వచ్చినట్లు మాట్లాడటం, సనత్ తెస్తున్న డబ్బు ఇంట్లో సరిపోకపోవటం, కుమారస్వామేమో ఇంకా సంపాదనలోకి దిగక పోవటం మహాఘోరంగా పరిణమించింది అది నర కంగా తయారయింది. ఒకరినిమరొకరు అర్థంచేసుకోక పోగా, ఒకరి ప్రవర్తనను ఒకరు విపరీతార్థాలు తీస్తూ వ్యాఖ్యానించటం, ఇంట్లో శాంతిలేకుండా చేసి పారేశారు నలుగురూ కలిసి. అయితే కుమారస్వామికి అంత నిబ్బరమైన మనస్సు లేదు. తెల్లారిలేస్తే ప్రతి దానికి చికాకుపడుతున్నాడు. ప్రతిదానికి కల్పించు కుంటున్నాడు. ప్రతివాళ్లను సంతోషపెట్టడానికి, తనకోర్కెలన్నీ ఉపసంహరించుకుంటున్నాడు. ఏం చేసినా, ఎంత ఇచ్చినా, ఇంకా తీసుకోవాలనే తాప త్రయం కాని అంతకంటె వేరె లేదు. తన ప్రవర్తనను సానుభూతితో ఆలోచించేవాళ్ళెవ్వరూ లేరు. తన మూలాన కస్తూరి తీవ్రమైన కష్టాలకు, బాధకు గురి కావలసివచ్చింది. అదికూడా తానే మానసికంగా బాధ పడాలసివచ్చింది. రానురాను హృదయం దుర్బలం అయిపోయింది. మనస్సు చలించింది. అంతకంటె ఏం లేదు. 'అమ్మో! ఈ కొంపలో నేనుండలేను' అని పెద్ద పెట్టున కేకపెట్టటం, తర్వాత క్రమంగా జరిగిపోయిన విషయాలన్నీ ఒక్కొక్కటే జ్ఞాపకం తెచ్చుకుం టోంది. కస్తూరికి అంతా ఆశ్చర్యంగావుంది. తనభర్తను అవాళ పిచ్చివాడని నలుగురూకలిసి తీసుకుపోయి నప్పుడు తనకేమీ తెలీలేదు. మళ్ళీ తానుకూడా యీ ప్రపంచంలో ఒక మనిషిలాగ సంచరిస్తానని అనుకో లేదు. మళ్ళీ యీనాడు భర్త యింటికి వచ్చినతర్వాత అతని ప్రవర్తన మారినతర్వాత కూడ, నిజంగా పిచ్చినే భావించిందికాని, ఈమాదిరి అని ఎట్లా అనుకోగలదు. తన భర్త అసలువిషయం చెప్పేశాడు. అప్పటి మనిషి కాడు. పూర్తిగా మారిపోయాడు. తనకు నిబ్బరమైన మనస్సుంది. తాను మెత్తగావుంటే ఏం లాభంలేదని గ్రహించినట్లున్నాడు. ఈ మిషతో ఈ ఇల్లు చక్క బడితే అంతకంటె కావలసిందేముంది!—అనుకుం టోంది కస్తూరి

తలుపులు ధఢేలుమని తెరుచుకున్నాయి. భయం కరంగా కుమారస్వామి గదిలోంచి బైటకువస్తున్నాడు. మంచం దగ్గరగా ముడ్చుకు కూర్చుంది కస్తూరి. కాత్యా యని గబగబ కస్తూరిదగ్గరకు వెళ్ళిపోయింది అతను కోరచూపు చూశాడు చప్పున వెనక్కు తగ్గింది.

'నాన్నా,...నీ దగ్గర డబ్బేముంది... చెప్పు?' నిలవేశాడు. ఈశ్వరయ్య గుడ్లు అప్పచెప్పి నిలబడిపో యాడు.

'పొద్దున్నే డబ్బుగురించి తెంపుకురా... మొహం కడుక్కో పోయి...' పరమేశ్వరి కొంత చనువు చేసు కుంది.

'ఎవరైనా అడ్డం వచ్చారంటే నే!...నా ఒళ్ళు నాకు తెలీదు. ముందరే చెపుతున్నా...' హూంక రించాడు.

'అట్లా నుంచుంటా రేమిటండీ! ఓ మూల మీద మీదకు వస్తుంటేను. పారిపోండి...' కేక పెట్టింది పరమేశ్వరి.

'నే పరుగెత్తలేననుకున్నావా?'

'నా మాట విను. ముందర మొహం కడుక్కో.' సనత్ మెల్లిగా కుమారస్వామి చెయ్యి పట్టు కున్నాడు.

చేతిని గట్టిగా విదిలించాడు. ఆ విదిలింపుకు సనత్ రెండు చుట్లు గిర్రున తిరిగాడు.

ఈశ్వరయ్య చాలా భయపడిపోయాడు.

'ఇదిగో తాళంచెవులు తీసుకో' అంటూ గిరాటు పెట్టాడు.

జ్యోతి గుండెమీద చెయ్యి వేసుకుని నివ్వెర పోతూ చూస్తోంది.

'నువ్వు సంపాదించిం దేమీ లేదు...అంతా మా తాత ఇచ్చిపోయిందే! అనుభవించటానికి నాకూ హక్కుంది. ఇక ఒక్క పైసా నీకు దక్కనీను...! అన్నయ్యా నీకెంత డబ్బు కావాలంటే అంత ఇస్తా.' సనత్ వైపు తిరిగాడు.

సనత్ తలవంచుకుని నిలబడ్డాడు.

'వదినా! నీకే, మరి, మంచిచీర కొనిపెడతా!' కాత్యాయని దగ్గరకు ఒకడుగు వేశాడు.

వీడెలాంటి అఘాయిత్యం చేస్తాడో ఏమో—అని భయపడిపోతోంది పరమేశ్వరి. సనత్ ఒట్టి పిచ్చివాడూ, తెల్లవన్నీ పాలనుకుంటాడు. వీడికెట్లా నచ్చచెప్పటం. అమ్మో! కాత్యాయని కూడా సామాన్యురాలు కాదు. ఈ కొంపమీదికి ఏం తెచ్చి పెడుతుందో!—అనుకుంటోంది.

డబ్బుతీసి విచ్చలవిడిగా ఖర్చు పెట్టేస్తున్నాడు. ఆ! అనేవాళ్ళు ఎవ్వరూ లేకపోయారు. గారాబం చేస్తూ, తండ్రి దగ్గిర చీటికీ మాటికీ డబ్బు పుచ్చుకునే జ్యోతికి పెద్దసంకటం వచ్చిపడింది.

చీటికీ మాటికీ కాత్యాయనిమీద ఎక్కడలేని ఆప్యాయత, ప్రేమ చూపిస్తున్నాడు కుమారస్వామి. సనత్, కాత్యాయనిమధ్య పోకపులు సాగినాయి. కాత్యాయని నిత్యమూ తీవ్రంగా బాధపడుతోంది. కస్తూరి చూడబోతే తనభర్త ఇట్లా ఉన్నాడుకదా అని కించిత్ కూడా ఏమీ బాధపడుతున్నట్లు కనబడటం లేదు. మరిది ఇట్లా అయిపోయాడే అని కాత్యాయని మాత్రం తీవ్రంగానే బాధపడుతోంది. అక్కయ్య తాపత్రయం, బాధ, ఆవేదన, చూస్తూ చూస్తూ, కస్తూరి ఉండబట్టలేకపోతోంది. ఎట్లాగైనాసరే అక్కయ్యతో చెప్పితే సంతోషిస్తుంది. ఎవ్వరితోనూ చెప్పకూడదే! అనుకుంటోంది. ఒకమూల భర్తేమో గట్టిగా చెప్పనే చెప్పేశాడు. ఎవ్వరితోనూకూడా తన విషయం చెప్పకూడదని. పోనీ అక్కయ్యతో చెపుతానని వారితో అంటే! అమ్మో! ఇంకేమన్నా వుందా! వద్దనిఅంటే ఎందుకు ఈ మధన? అక్కయ్య చాలా మంచిది. ఎవ్వరితోనూ చెప్పదు. తన మనస్సులోనే పెట్టుకుంటుంది. నా మీద అంతప్రేమ ఆప్యాయతలు చూపిస్తున్న అక్కయ్య క్షణ క్షణం అట్లా ఇదయిపోతూంటే చూస్తూ ఊరుకోవటం భావ్యం కాదు అనే నిర్ణయానికి వచ్చింది కస్తూరి.

కాత్యాయని ఎంతో ఆప్యాయంగా, జాలిగా, కస్తూరిదగ్గరకువచ్చి కూర్చుంది. కస్తూరిని చూసి కళ్లనీళ్లు పెట్టుకుంది. వెంటనే ఎక్కడ చూసిపోతుందో అన్నట్లు గబగబ కళ్లు అద్దుకుంది. ఏం మాట్లాడాలో అర్థం కావటం లేదు. ఏమిటో చెపుదామనుకుంటే వచ్చింది కాని, ఏమీ చెప్పటానికి తోచటం లేదు. ఊరికే అట్లాగే చూస్తూ కూర్చుంది.

'అక్కయ్యా!...' అన్నది కస్తూరి.

'కస్తూరి...' అంటూ గట్టిగా తనదగ్గరకు తీసుకుంది కాత్యాయని పెద్దగా ఏడవసాగుతోంది. రొప్పుతోంది. చెల్లెల్ని ఎట్లాఓదార్చాలో అర్థంకాక సతమతమయిపోతోంది. ఎట్లా ఇక వీళ్ళజీవితం అనిఆరాటపడుతోంది. ఇక మరిదికి పిచ్చి నయమయ్యేటట్లు లేదు. చూడబోతే అదివరకుకంటె బాగా ముదిరినట్లుగానే వుంది. ఇలాంటిపరిస్థితుల్లో ఎందుకు ఇంటికి తీసుకువచ్చినట్లు? అంతా అర్థరహితంగా కనిపిస్తోంది. ఇంకా ఎన్నాళ్లంటే [illegible] పట్టేము! అంతవరకు కస్తూరి ఏమవుతుంది? రకరకాలుగా ఆలోచించుకుంటూ దుఃఖపడుతోంది కాత్యాయని.

'అక్కయ్యా! నీతో ఒకమాటచెప్పనా' అన్నది కస్తూరి.

కస్తూరి ముఖంలో అదివరకు ఎన్నడూ తాను చూడని సంతోషం కనిపించింది.

'ఏమిటి?' అన్నది కాత్యాయని కళ్లు పెద్దవిచేసి.

'ఎవ్వరితో చెప్పకూడదు, బావగారితో కూడా చెప్పకూడదు...'

'ఊఁ...అట్లాగే!...'

'అట్లాగే అంటే కాదు...నాకు కచ్చితంగా మాటివ్వాలి...'

'చెప్పనంటున్నాగా! ఇంకెట్లా చెప్పాలి!...'

'మీ మరిదికి పిచ్చి లేదు... పిచ్చి నయమయింది. అసలు పిచ్చే లేదు...'

కస్తూరికి కూడా ఏదో అయిందని భయపడింది కాత్యాయని. విడ్డూరంగా చూస్తోంది.

'అక్కయ్యా, నేను నిజం చెపుతున్నాను..పిచ్చివాళ్లలాగ నటిస్తున్నారు, అంతే! అట్లాఉంటే కాని ఈ ఇంట్లో పరిస్థితులు ఒక దరికి చేరవు అని చెప్పారు నాకు. ఎవ్వరితో ఈ విషయము చెప్పొద్దన్నారు. నీతో ఒక్కదానితోనే చెపుతున్నాను. పైకి పొక్కిందంటే అంతా చెడిపోతుంది!' కస్తూరి నవ్వింది.

కాత్యాయనికి అంతా అగమ్యగోచరంగా వుంది. కస్తూరి చెప్పింది నిజమా? లేక కస్తూరికి కూడా పిచ్చి ఎక్కిందా? అన్నది నిర్ధారణచేసుకోలేకపోతోంది.

'నిజంగానా కస్తూరి!...'

'అవును నిజమే, నాకు చెప్పారు...'

'నాకేమీ అర్థంకావటంలేదు కస్తూరి.........నిజంగానా!...'

'నీతో అబద్ధం చెపుతానా!... ఇంత ఇదిగా తాను వుండకపోతే వదినగారి కాపరం కుదుటపడేది కాదుట...'

'అది నిజమే!... అవుతే మంచిపని చేస్తున్నావులే!...అమ్మయ్య! ఇప్పటికి నాకు ప్రాణం తెరిపి అయింది. నిత్యమూ నాలో నేను తగని బాధపడ్డాననుకో! మరిదిని చూస్తుంటే నాకు [illegible] మేస్తోంది. ఎవరితో చెప్పేదికాదు. నీతో చెపుదామనుకుంటే మరింత పిరికిదానివయిపోతావు. అసలు నిన్ను చూస్తుంటేనే నాకు జాలేస్తుంది. ఇంత పెద్ద నాటకమే ఆడుతున్నాడు. జాగ్రత్త...' కాత్యాయనికి ఇప్పటికిగాని కొంచెం శాంతించలేదు

'ఆడపడుచుమీద నీ అఘాయిత్యం ఏమిటిరా! తరిమి తరిమి దాన్ని వెళ్ళగొట్టావు... ఇక దీనిజోలికి వస్తున్నావు......' పరమేశ్వరి ఎంతో ఆక్కసుగా అంటోంది.

'ఇది చేస్తున్న నాటకం ఏమన్నా తెలుసా నీకు?' కుమారస్వామి గట్టిగా గద్దించాడు.

'నాటకమా!... ఇదెక్కడి తప్పులాయి వచ్చి పడిందంటు...'

'ఏ సంబంధం తెచ్చినా నాకు అక్కర్లేదని ఇక్కడే తిష్ఠవేసి కూర్చు దాముసుకుంటున్నావా! ఆ సంబంధం కనక చేసుకోనన్నావో! ఏ అర్ధరాత్రి వేళో వచ్చేసి పీక పిసికేస్తాను. దాంతో పీడ విరగడయిపోతుంది......' కుమారస్వామి జ్యోతివైపుకు గుడ్లురిమి చూశాడు.

జ్యోతికి గుండెల్లో రాయి పడ్డట్లయింది. ఈ పిచ్చిలో అన్నంతపని చెయ్యనే చేస్తాడేమో కూడా ఆరి రాత్రిళ్లు కంటినిండా నిద్రపోనేపోవటం లేదు. కళ్లు ఓయూల భగ భగ మండిపోతున్నా కూడా మేలుకునే కూర్చుంటోంది. నిద్రపోయి ఎన్నాళ్ళయిందో అనిపిస్తోంది. రోజురోజుకు చిక్కిపోతోంది. బాగా దిగులుపడిపోయింది. అన్నం ముట్టుకోవటంలేదు. పరమేశ్వరి కూతుర్ని చూసి కమిలిపోతోంది.

'అమ్మో! నా కంఠం పిసికేస్తున్నాడే!...' అంటూ గభాలున నిద్ర మంచంలోంచి లేచింది హఠాత్తుగా జ్యోతి.

'ఎక్కడే అమ్మా? ఎక్కడే?' అంటూ పరమేశ్వరి పరుగెత్తుకుంటూ వచ్చింది. కలొచ్చింది. కలలోనే అంత హడలిపోతే ఇంకా నిజంగా నే చేస్తే.

'ఈ కొంపలో నువ్వింక ఉండలేవమ్మా... పెళ్లి చేసుకుని అత్తారింటికి వెళ్లి సుఖపడు...' తేరొప్పుతోంది పరమేశ్వరి.

'నువ్వాడింది ఆట... పాడింది పాటనా! నోరు మెదపండి, ఏంచేస్తానో!' పెద్ద కర్రతీసుకుని నిలబడ్డాడు కుమారస్వామి.

కస్తూరి గుప్పిట్లో ప్రాణాలు పెట్టుకుని గబగబ గదిలోకి పరుగెత్తింది. సనత్‌కు నిజంగా భయమేసింది. గాభరాపడ్డాడు. ఏంచెయ్యాలో తోచలేదు. ఆ కర్రతో ఎవరిని బాదుతాడో ఏమో! ఇంకా ఒక్క క్షణం వీణ్ణి ఇంట్లో ఉంచటానికి వీల్లేదు. నలుగుర్ని పోగుచేసి సంకెళ్లు వేసి మళ్ళా ఆసుపత్రికి పంపాలసిందే! తగ్గిందంటే తగ్గిందనుకున్నా, ఇలాంటి పరిస్థితుల్లో ఇంట్లో ఉండటానికి వీల్లేదు అనుకున్నాడు.

'కాత్యాయనీ... నాకేమి తోచటంలేదు. వాడికి పిచ్చిలేదు. ఇంట్లో పరిస్థితులు తట్టుకోలేక అట్లా అయిపోయాడేమో అనుకున్నా. మొన్న ఇక్కడికి వచ్చినప్పుడు కూడా సరిగ్గా ఉన్నట్లే అనిపించింది... ఇప్పుడు పరిస్థితి చూస్తుంటే మహా భయంకరంగా వుంది. వాడికి నిజంగా పిచ్చే! బాగా ముదిరిపోయింది కూడా. ఇక ఇలాంటి పరిస్థితుల్లో ఇంట్లో ఉంచితే చాలా ప్రమాదం. నలుగుర్ని పిలిచి ఓదార్లోకి తీసుకురావాలి.' సనత్ బయలుదేరబోయాడు.

'ఏమండీ! మిమ్మల్నే!... కాస్త ఆగండి... కాసేపు ఆగితే ఆయనే సర్దుకుంటాడు...'

'ఏమిటి సర్దుకునేది?... ఇంకొంచెం ఆలస్యం అవుతే ఎవరిబుర్ర బద్దలవుతుందో...'

'అదేం కాదండి నే చెపుతున్నాగా ఆగండి...'

'జ్యోతిష్యం చెపుతున్నావా ఏమిటి?'

'నిజం చెపుతున్నానండి... ఆయన ఎవ్వర్నీ కొట్టడండి!...'

'నీ కేమన్నా చాదస్తమా ఏమిటి ఓయూల వాడు పిచ్చెక్కి ఇకవుతుంటే?'

'..... పిచ్చి కాదండి... మరి...... ఆయనకు పిచ్చిలేదండి...'

'మరి నీకు నాకూ నా పిచ్చి?'

'మీకో మాట చెపుతా ఎవ్వరికీ చెప్పకండి. చాలా రహస్యం. కుమారస్వామికి పిచ్చిలేదు. ఇంట్లో పరిస్థితులు చక్కపెట్టటానికిట్లా నాటకం. కస్తూరి నాకు చెప్పింది.'

"ఆ!...ఏమిటి..." సనత్ చప్పున నిలబడి పోయాడు.

# పిచ్చివాడు!

'అవును నిజం. కస్తూరి చెప్పింది...ఇంత ఇదిగా వుంటేగాని ఇంట్లో పరిస్థితులు ఒక దారికిరావు కొన్నాళ్ళు ఇట్లాగే వుంటాను అని చెప్పాడు...'

చప్పున సనత్, తమ్ముడిదగ్గరకు వెళ్ళాడు. కుమార్ చేతిలో కర్రతో ఎదురుగావున్న స్తంభాన్ని గట్టిగా కొట్టాడు. జ్యోతి దద్దరిల్లి పోయింది.

'నేను పెళ్ళి చేసుకుంటా...పెళ్ళి చేసుకుంటా' అని లోపలలోపల గొణుక్కుంది.

సనత్ అట్లాగే చూస్తూ నిలబడిపోయాడు. కొంతసేపయిన తర్వాత కుమారస్వామి శాంతించి లోపలకు వెళ్ళి పోయాడు. పరమేశ్వరికి ఒళ్ళు జలదరం పుట్టుకొస్తోంది. ఆ ఇంట్లో ఒక్క క్షణం ఉండటానికే బుద్ధి పుట్టటం లేదు. ముళ్ళమీద వున్నట్లుంది. ఇక జ్యోతి కూడా ఆ ఇంట్లోంచి వెళ్ళిపోయినతర్వాత, ఇంట్లో తన అన్నవాళ్ళెవ్వరూ - అని దిగులుపడుతోంది. ఇంకే ముంది? కోడళ్లిద్దరూ కలిసి తనను ఏంచేస్తారో ఏమో- అని భయపడిపోతోంది.

మర్నాడు మూడు నిమిషాల్లో జ్యోతి పెళ్లి నిశ్చయమయిపోయింది. పరమేశ్వరి కళ్లు అప్పచెప్పి కూర్చుంది.

జ్యోతికి పెళ్ళయినప్పటినుంచి కుమారస్వామిలో ఎంతో మార్పు వచ్చినట్లనిపించింది. ఆమార్పు చూసి ఈశ్వరయ్య ఆలోచించటం మొదలుపెట్టాడు నిజంగా వీడికి పిచ్చేనా, ఇదంతా నాటకమా అని. భార్యతో ఈ విషయము చెపుదామా వద్దా అని ఆలోచించుకుంటున్నాడు. పరమేశ్వరి కుమారుని చూసి ఆశ్చర్య పోతోంది. ఆమెలో కూడా ఏమో మార్పు వచ్చి నట్లుంది.

'ఏమండీ అబ్బాయిలో ఏదో మార్పు వచ్చి నట్లుగా కనిపిస్తోందండి. అదివరకున్న ఉద్ధృతం అంతా తగ్గిపోయినట్లుంది. అసలు నిజంగా పిచ్చి ఎత్తినట్లేనా? ఏమన్నా వేషం వేశాడంటారా?'

'ఏమో! నాకుకూడా అదే అనుమానంగా వుంది' ఈశ్వరయ్య ఆలోచనగా అన్నాడు. పరమేశ్వరికి రోజు రోజుకు బాగా అనుమానం ఎక్కువయింది. కస్తూరి కాత్యాయని ఇద్దరూ కూడా అత్తగారంటే ఆప్యాయంగానే ఉంటున్నారు. పరమేశ్వరి కూడా ఎంతో ఇదిగానే ఉంటున్నది.

ఏమిటి ఈమెలో ఇంత మార్పువచ్చిందేమిటని కోడళ్లిద్దరు అనుకుంటున్నారు. ఏమైనా అన్నిమంచికే వచ్చినాయని అనుకుంటున్నారు. సనత్ మనస్సు పూర్తిగా శాంతించింది. ఆ ఇల్లు చూడబోతే అంతా స్వర్గంగా కనిపిస్తోంది. ఈశ్వరయ్య ఆప్యాయంగా అబ్బాయి అని పిలుస్తున్నాడు. పరమేశ్వరికూడా ఎంతో ఇదిగానే వుంటూంది.

నలుగురూ హాల్లో కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. కుమారస్వామిమాత్రం తలుపులు వేసుకుని గదిలో కూర్చున్నాడు.

'భగవంతుని దయవలన అబ్బాయికి పిచ్చితగ్గిపోయినట్లే!' పరమేశ్వరి అన్నది.

'ఏమో ఆ ఉద్ధృతం తగ్గిపోయింది కాని...మళ్లా ఎట్లా వుంటుందో!' ఈశ్వరయ్య అంటున్నాడు.

'కళాకళలు...... వేళా వేళలు తగ్గటమేమిటి! హెచ్చటమేమిటి!...మళ్లీ ఎప్పుడు ముంచుకొస్తుందో తెలీదు...' సనత్ తన అపనమ్మకాన్ని సూచనగా అన్నాడు.

'నాకవుతే చాలా భయమేస్తోంది...మళ్ళీ ఏ వేళప్పుడు ఎట్లా మారుతుందో అని...' కాత్యాయని దీనంగా అన్నది.

కస్తూరి పక్కకు తిరిగి చిరునవ్వుతో వస్తున్న నవ్వును ఆపుకుంది. 'ఏమో ఆ దేవుని అనుగ్రహమంటాను ఇదంతా కస్తూరి చలవనే' పరమేశ్వరి అన్నది.

తలుపులు గభాలున తెరుచుకుని కుమారస్వామి వచ్చేస్తున్నాడు. మొహంలో చిరునవ్వులు తొంగి చూస్తున్నాయి. కళ్ళు విప్పారివున్నాయి. అతి నిదానంగా వస్తున్నాడు. కస్తూరికి నవ్వాగలేదు. కాత్యాయని మరిదిని చూచి తలవంచుకుంది.

సనత్ తమ్మునివంక చూస్తున్నాడు.

ఎవ్వరూకూడా ఏమీ మాట్లాడటం లేదు. అందరూ నిర్ఘాంతపోయి కుమారస్వామివైపు చూస్తున్నారు.

కుమారస్వామి నిబ్బరంగా అడుగులు వేస్తూ వస్తున్నాడు. తల్లి దగ్గరకు వచ్చాడు. గభాలున తల్లి పాదాలమీద పడ్డాడు.

'అమ్మా! క్షమించు...... నువ్వే నా పిచ్చి తగ్గించావు......నన్ను మంచివాణ్ణి చేశావు...నన్ను మంచివాణ్ణి చేశావు' కళ్లల్లోంచి జలజల నీళ్లు రాలాయి.

'అబ్బాయి ....' పరమేశ్వరి కుమారుని రెండుచేతులు పట్టుకుని లేవనెత్తింది.

'కుమారుడి పిచ్చి తగ్గిపోయింది! ...' వెర్రిగా కేకపెట్టింది పరమేశ్వరి.

# షష్ఠ్యంతముల పుట్టుపూర్వాలు

శ్రీ అమరేశం రాజేశ్వరశర్మ

ఆంధ్రకావ్యములందు కృత్యాదిని కనుపించు నాచారములు కొన్నింటిలో షష్ఠ్యంతపద్యములు ముఖ్యమైనవి. ఇవి మన కావ్యములలోనికి ప్రవేశించిన విధమును తత్క్రమపరిణామమును కారణములను కనుగొని దర్శించుట భావ్యము.

శ్రీనాథుని తరువాతి కవుల రచనలన్నిటియందును[1] సామాన్యముగా షష్ఠ్యంతములు కానవచ్చుచుండుటచేత నీయనంతర రచనలు వాని పుట్టుపూర్వోత్తరములు పరిశీలించుటకంతగా నుపకరింపవు. కనుక శ్రీనాథునకు పూర్వము ఆంధ్రవాఙ్మయ ప్రారంభయుగమునందు వెలసిన రచనలాధారముగా గొనియే షష్ఠ్యంతముల చరిత్ర నూహింపవలసియున్నది.

నన్నయ భారతాదిని షష్ఠ్యంతములను వ్రాయలేదు. నన్నెచోడుని కుమారసంభవ కృత్యాదిని షష్ఠ్యంతపద్యము లున్నవి.[2] తిక్కన నిర్వచనోత్తర రామాయణమునందు షష్ఠ్యంతములతో గృతిప్రదానము కావింపకపోయినను విరాటపర్వాదిని సంప్రదాయానుసారముగా షష్ఠ్యంతముల వ్రాసినాడు. కేతన దశకుమారచరిత్రమునందును మారనమార్కండేయపురాణమునందును షష్ఠ్యంతము లున్నవి. పాల్కురికిసోమన బసవపురాణ పండితారాధ్యచరిత్రములందును రంగనాథుని రామాయణమునందును షష్ఠ్యంతములు లేవు. ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశమునందు షష్ఠ్యంతముల వ్రాయక నృసింహపురాణమునందు మాత్రము పదునొకండు షష్ఠ్యంతకందములను వ్రాసినాడు. నాచనసోమన కృత్యాది లభింపనే లేదుకదా! మంచన కేయూరబాహుచరిత్రమునందును షష్ఠ్యంతములు గలవు.

వీనిలో నిర్వచనోత్తర రామాయణమునందు కృత్యాదిని షష్ఠ్యంతములు లేకపోగా పంచమాశ్వాసము చివరను షష్ఠాశ్వాసప్రారంభమునను షష్ఠ్యంతములు కనుపించుచున్నవి. కేతన దశకుమారచరిత్రమునందు కృత్యాదిని షష్ఠ్యంతములతోపాటుగా చతుర్థ పంచమాశ్వాసములకు చివరను పంచమ షష్ఠాశ్వాసములకు ప్రారంభమునను గూడ షష్ఠ్యంత పద్యములు గానవచ్చుచున్నవి. వీని చరిత్రము నరయుటకు ముందు వీనికి కృతిపతిత్వముతో గల సంబంధము గలదు గాన దానిని గురించి కొంచెము పరిశీలింతము.

నన్నయ భారతమును రాజరాజున కంకితము చేయలేదు. రాజరాజు భారతమునకు శ్రోత మాత్రమే. కనుకనే నన్నయ యాశ్వాసాద్యంత పద్యములతో రాజరాజును సంబోధించి కథను నడిపినాడు. కృతిప్రదాన మిందు లేకపోవుటచేత నిక్కడ షష్ఠ్యంత పద్యములకు ప్రసక్తియే లేకపోయినది. ఇదియొక రీతి కృత్యాది సంప్రదాయము. రెండవ విధపు సంప్రదాయము నారంభించినవాడు నన్నెచోడుడు.

నన్నెచోడుడు తన కుమారసంభవమును భక్తితో గురువగు మల్లికార్జునున కంకితము గావించినాడు. కాని నన్నయవలె మల్లికార్జునునకు వినిపింపలేదు.[3] అనగా మల్లికార్జునుడు కుమారసంభవమునకు గృతిపతియె కాని కృతిశ్రోత కాడనుట. కనుకనే కుమారసంభవమునం దాశ్వాసాద్యంత పద్యములలో సంబోధనాంతముల కవకాశము లేకపోయినది. పైగా చోడుడు తన గురువునకును శివునకును నభేదమును గల్పించి యాశ్వాసాంతములలో శివుని వర్ణన వచ్చునట్లు కూర్చి కొన్ని యాశ్వాసాద్యంత పద్యములను కృతినాయక కృతిపతుల కిరువురకు నన్వయించునట్లు విభిన్నవిభక్తికములుగా రచించినాడు. ఇక్కడ గృతిప్రదానము కలదు గనుక షష్ఠ్యంతముల రచనకు ప్రసక్తి కలిగినది.

---

1. మొల్ల రామాయణమునందు షష్ఠ్యంతములు లేవు 2. నన్నెచోడుని షష్ఠ్యంతరచనమును గూర్చిన వివరములు నా "నన్నెచోడుని కవిత్వము" అను పుస్తకమున జూడనగును.

3. ఇట్లనుటచే మల్లికార్జునునకు కుమారసంభవము పూర్తిగా వినిపింపలేదనుట కాదు, ఆయనను కేవలము శ్రోతగా గ్రహింపలేదనుట మాత్రమే.

# షష్ఠ్యంతముల పుట్టు పూర్వాలు

తిక్కన నిర్వచనోత్తరరామాయణమును దన ప్రభువగు మనుమసిద్ధి కంకితము గావించినాఁడు కాని వినిపింపలేదు. అనగా మనుమసిద్ధి రామాయణమునకు శ్రోత కాడనుట. కనుకనే యిక్కడ గూడ సంబోధనాంతములకుఁ బ్రసక్తి లేకపోయినది. చోడునివలె తిక్కన మనుమసిద్ధికి కృతినాయకుఁడగు శ్రీరామచంద్రునితో నభేదమును బాటించుట కుదర లేదు. అంతటి భక్తి తిక్కనకు మనుమసిద్ధియెడ లేదు గదా! కనుక తిక్కన యాశ్వాసాద్యంత పద్యములలో నొక క్రొత్తమార్గము నారంభింపవలసివచ్చెను. కనుకనే నిర్వచనోత్తర రామాయణములోని యాశ్వాసాద్యంత పద్యములలో వేరువేరు విభక్తులు కనుపించుచున్నవి. ఇందలి యీ ప్రణాళిక యిది. కథా సందర్భము ననుసరించి వచ్చు పాత్ర విషయము తరువాత నే విభక్తియం దున్నదో నాయాశ్వాస ప్రారంభ పద్యమును, నా వెనుకటి యాశ్వాసాంతపద్యములు నా విభక్తియందే యుండుట యీ ప్రణాళిక. ఉదాహరణమున కొక్కదానిం జూతము. ద్వితీయాశ్వాసమునందు "శ్రీరామచంద్రుం డిట్లు" అని కథ ప్రారంభమయినది. ఇందు "శ్రీరామచంద్రుఁడు" ప్రథమావిభక్తియం దున్నది కనుక ద్వితీయాశ్వాస ప్రారంభ పద్యమును ప్రథమాశ్వాసాంత పద్యత్రయమును ప్రథమావిభక్తియందే రచింపఁబడినవి. పంచమాశ్వాసము చివరను షష్ఠాశ్వాస ప్రారంభమునను షష్ఠ్యంత పద్యము లుండుటకు నిదియే కారణము. ("దశరథాధీశ్వరునకు" అని తరువాతి కథ ప్రారంభమయినది) కృతిప్రదానమున్నను కృత్యాదిని షష్ఠ్యంతము లిందు లేవు. అందుకుఁ గారణము తరువాతఁ జూతము. ముందుగా దీనితోఁ బోలిక గల దశకుమార చరిత్రము నరయుదము.

దశకుమారచరిత్రములోని యాశ్వాసాద్యంత పద్య ప్రణాళిక సరిగా నిర్వచనోత్తర రామాయణములోని దానివంటిదే. వీనిలోఁ గొన్ని సంబోధనాంతము లగుటయును, మఱికొన్ని షష్ఠ్యంతములుగా నుండుటయును, కడమవి కొన్ని ప్రథమాంతములుగా నుండుటకు నీ ప్రణాళికయే హేతువు. ఉదాహరణమునకు సప్తమాశ్వాస ప్రారంభమును జూతము. ఇందు "ఉపహారవర్మం గనుఁగొని" యని కథ ద్వితీయావిభక్తితో నారంభమయినది. కనుక సప్తమాశ్వాస ప్రారంభ పద్యమును షష్ఠాశ్వాసాంత పద్యములును ద్వితీయావిభక్తియందే రచితము లయినవి. కడమ యాశ్వాసములు నిట్లే యున్నవి. కేతన తన దశకుమారచరిత్రమును తిక్కనకు భక్తితో నంకితము గావించినాఁడు. కనుక కృత్యాదిని షష్ఠ్యంతములకు ప్రసక్తి గలిగినది. కేతనకూడ నన్నెచోడునివలెనే యెనిమిది షష్ఠ్యంతకందములను వ్రాసినాఁడు. కాని యీతని యం దింకొక విశేషము గలదు. కథాభాగముతో సంబంధము లేదని యెంచి కాఁబోలు నీతడు కృత్యాదిని ప్రత్యేకాశ్వాసముగా నిర్మింప నెంచినాఁడు. కనుక షష్ఠ్యంతపద్యములతోఁ బ్రథమాశ్వాసమును ముగించి ద్వితీయాశ్వాసమును "దిక్కనామాత్యున కభ్యుదయపరంపరాభివృద్ధిగా"నని ప్రారంభించినాఁడు తన ప్రణాళికప్రకారము. ఎనిమిది షష్ఠ్యంతములకుఁ జివర మూఁడాశ్వాసాంతపద్యములను షష్ఠ్యంతములుగా వ్రాసి ప్రథమాశ్వాసము ముగించి ద్వితీయాశ్వాసాదినికూడ నట్లే కందమును షష్ఠ్యంతముగా వ్రాసెను. ఇది యీతని యిందలి ప్రత్యేకత. దీనిఁ గమనింపక కొందఱు కేతన షష్ఠ్యంతకందముల మధ్య దూలము వంటి శార్దూలమును వేసెనని విమర్శించిరి!

ఇఁకఁ దిక్కనభారతముఁ జూతము. తిక్కన సోమయాజి తన భారతమును హరిహరనాథునకు భక్తితో నంకితము చేయుటయే కాక యంతస్సన్నిధి కల్పించుకొని యాతనికే దానిని విన్నవించెను. ఈ విధముగా హరిహరదేవుఁడు భారతమునకు కృతిపతియు, కృతిశ్రోతయు నయ్యె నన్నమాట, కనుకనే మొదట షష్ఠ్యంతములును తరువాత నాశ్వాసాద్యంతము లందును సంబోధనాంతములు నిండుచోటు చేసికొన్నవి. ఇది యొక క్రొత్తవిధానము. దీనివలన నొక క్రొత్తమార్గ మేర్పడినది. కృత్యాది కొక నియతరూప మేర్పడి తరువాతి కవులకు మార్గదర్శకమయినది. దీనివలన నన్నయ నన్నెచోడులు వేఱువేఱుగా స్థాపించిన రెండు సంప్రదాయముల కొక్కచోటఁ బొత్తు కుదిరినది. ఇదియే దీని యందలి తిక్కన వైశిష్ట్యము. ఇందువలన నిర్వచనోత్తరరామాయణ, దశకుమారచరితము లందలి యాశ్వాసాద్యంతములందుఁ గనిపించు గందరగోళపు విధాన మా రెంటితోనే నిలిచిపోయినది. 4

---

4 తరువాతి కావ్యములలో పింగళి సూరనార్యుని ప్రభావతీ ప్రద్యుమ్న కావ్యమునందలి యాశ్వాసాద్యంతపద్యములలో మాత్ర మీ సంప్రదాయము కాన

పాల్కురికి సోమనాథుని బసవపురాణమునకు గొబ్బూరి సంగన్న శ్రోత మాత్రమే. పండితారాధ్య చరిత్రమునకు బసవేశ్వరుఁడు కృతిపతి కాఁగా కూరనామాత్యుఁడు శ్రోత. ఇంతేగాదు సోమనాథుఁడు పూర్వులవలెఁ గాక కృతిశ్రోతయగు కూరనామాత్యున కభ్యర్థనపురస్సరముగా నారాధ్యచరిత్రము నాతనికి వినిపించినట్లు చెప్పికొనినాఁడు.5 కృతిపతి యున్నను నిందు షష్ఠ్యంతములు లేవు. రంగనాథుని రామాయణమునందును లేవు గదా! షష్ఠ్యంతముల వ్రాయుట ద్విపదకవుల యానాటి యాచారము కాదేమో! తరువాతివారు ద్విపదకావ్యములందును షష్ఠ్యంతములు వ్రాసిరి.6

ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశమునకుఁ గృతిపతియు కృతిశ్రోతయు వేమారెడ్డియే7 కనుక తిక్కనభారతము నందువలె దీనియందును నాశ్వాసాద్యంతపద్యములు సంబోధనాంతములుగ రచితములైనవి. కాని యిందు షష్ఠ్యంతపద్యములు లేవు నిర్వచనోత్తరరామాయణము నందు లేవు గదా!

ఎఱ్ఱన నృసింహపురాణము నృసింహస్వామికి భక్తితో నంకితము చేయఁబడి యాతనికే విన్నపము చేయఁబడినది. కనుక తిక్కనభారతమువలె నిందు షష్ఠ్యంతములును ఆశ్వాసాద్యంతముల సంబోధనాంతములును కూర్చబడినవి.

పై వివరణమునుబట్టి అంకితము చేయఁబడని వాని యందు షష్ఠ్యంతరచనకు ప్రసక్తియే లేదనుట తేలిన సారాంశము. ఇఁక నంకితము చేయఁబడియు షష్ఠ్యంతములు లేనివానినిగూర్చి మాత్రము. తిక్కనరామాయణము, ఎఱ్ఱనహరివంశము నిట్టివి. ఇవి రెండును రాజుల కంకితము చేయఁబడినవి. వారిగురువులు తమ కారాజులతో గల లౌకికసంబంధమును బురస్కరించుకొని తమ కృతులను వారి కంకితము గావించిరి. కాని భక్తితోఁ గాదు. కావుననే వీనియందు షష్ఠ్యంతములు లేవు.

ఎక్కడ భక్తితో నంకితము చేయుట గలదో యక్కడ షష్ఠ్యంతము లున్నవి. నన్నెచోడుని కుమారసంభవము తిక్కనభారతము కేతనదశకుమారచరిత్రము ఎఱ్ఱననృసింహపురాణము నిందు కుదాహరణములు.8 కాని యీ సంప్రదాయము తరువాతికవులు పాటింపలేదు. వారు అంకితమీయని షష్ఠ్యంతముల వ్రాసిరి. బహుశః దీని నారంభించినవాఁడు మారన కావచ్చును.

ఇటివే మఱికొన్ని యాచారములును తరువాతి కావ్యములందు వెలసినవి. మొదట శాస్త్రగ్రంథముల నంకితము చేయుట కానరాదు. కాని యదియు తరువాత వచ్చెను. మొదట కృతి నియతముగా పతియుండవలెనను నియమము లేదు తరువాత నది సర్వసామాన్యమయ్యెను. అట్లే కృతిపతియే సంబోధితుఁడగు సంప్రదాయము మేర్పడెను. ఇవి యన్నియు మన కృతిపతిపరిణామవిధానములు. పరిణామము ప్రకృతిసర్గముగదా!

---

నకును. దానికిఁ గారణమున్నది. మారన యీ కృతిని దన తండ్రి కంకితము చేసినాఁడు. కృతి నిర్మాణము నాటికా తండ్రి సజీవుఁడు కాఁడు. కావున నాతనిని శ్రోతగాఁ జేసి యాశ్వాసాద్యంతములఁ సంబోధించుటకవకాశము లేకపోయినది. అందువలన నాతఁడు మఱలఁ దిక్కన కేతనల మార్గము ననుసరించి యాశ్వాసాద్యంతపద్యములను కథాపాత్రములను సూచించు కబ్బము లేవిధములందున్న నా విధములలోనే రచించినాఁడు. దీనివలన మారనాదులు దనుక ఈ సంప్రదాయములోని యాంతర్యము అప్పటివారికిఁ దెలిసియే యుండెనని నిశ్చయింపవచ్చును.

5 "ఘనదీయపుత్రపౌత్రాభివృద్ధియు...భూరిసమృద్ధియు బొందెదు మని దీవించి నన్ను సంభావించి శ్రోతఁ గావింతు" (పండి. దక్ష. ప్ర. పు. 17).

6. చూ. గౌరనహరిశ్చంద్రోపాఖ్యానము.

7. చూ. హరి. పూ. అ. 1 ప. 42.

8 శాసనములలోని షష్ఠ్యంతపద్యములు నీ భావమునే బలపఱచుచున్నవి. చూ (1) శాసనపద్యమంజరి. 2 భా. 4 వ శాసనము (క్రీ॥ శ॥ 1136 సం॥) "అతిభక్తిఁ బార్వతీహితునకు...చంద్రమౌళికిన్. (2) తెలంగాణా శాసనములు 16 పుట. కరీంనగర శాసనములోని "వరమంత్రకూట" యను పద్యము.

# హిమాని హ్రాది

శ్రీ వేగుంట మోహన్ ప్రసాద్

రాముడూ! వేసెయ్! తలుపులు వేసెయ్!
ఆ కిటికీ రెక్కకు చిమత లేదల్లే ఉంది!
పోస్నీ, ఏదైనా రాయన్నా అడ్డం పెట్టు.
ఇదేమిటిరా! రాముడూ! ఇవ్వాళిట్లా
వడగాలిలా, సుడిగాలిలా యీ చలిగాలి!
నా హృదయం అనే ఎయిర్ కండిషన్డ్ రూంలో
వెచ్చగ ముసుగు తన్ని, మూడంకె వేసి
హృదయాంతరాళపు రుధిరప్రవాహంలో
నాలో నేనుగ పడుకొన్నాను కద!
ఇంకా ఏమిటిరా యీ చలి! మరీ ఆగడం.
కాశ్మీర్లో చచ్చేచలి గనుకనే
అన్నన్ని ఉన్ని శాలువాలు.

రాముడూ! ఈ నా కవోష్ణ హృదయంలో
చేతులు కొంగర్లు పోయి,
పై పెదవికి క్రింది పెదవికి పోట్లాట రాగ,
దవడలు చప్పట్లు కొడుతూంటే
పులకరించిన దేహం చూస్తూ ఊరకొంటూంటే
మంచుముక్కలా పడుకున్నాను కద!
ప్రపంచం మరీ యింత నీళ్ళుగారి పోతూన్నదేం?
కళ్లముందు ఏమిటీ పొగమంచు!
భ్రాంతి అనే ఎండమావిలా యీ మంచుపొగ!
ప్రపంచమనే యువతి వేసికొన్న మేలిముసుగు!
నాకే యింత చలివేస్తున్నదే,
నీళ్ల కెంత చలో మరి!

రాముడూ! నాయీ కళ్ళనేకుంపట్లలో
కాస్తంత నిప్పు రాజెయ్యరా బాబూ!

కవుపాకలకే యీ రెండు రాకుసి బొగ్గులు
రాజుకొంటేనన్నా యీ చలాగుతుందేమో!
నీ శ్వాస అనే విసనకఱ్ఱతో
యీ పోయ్యూదు!
మనయింట్లో కొబ్బరినూని సీసాలో నూని
గడ్డకట్టుకొని పోయింది కదూ?
కాస్త నా కళ్ళ సెగన, పొయ్యి గడ్డమీద పెట్టు దాన్ని!
ఈ అర్ధరాత్రి నెవరు రా వారు!
"నీ యింట్లో, నీ హృదయంలో యీ నైట్‌కి కాస్త
తలదాచుకోనియ్యి" అంటారు!—వీల్లేదని చెప్పు.

రాడూ! తలుపు తియ్యకు! తీశావో,
చలిగాలి 'ఉహు హు' అని వణుకుతూ వచ్చి
తనచలి తీర్చుకోవటానికి నన్ను కౌగలించుకొంటుంది.
హృదయం అంటే సామాన్యమా! కర్మ!
నాలోని నవనాడులు కలిసే చోటు.
ఆత్మకు, దేహానికి పేచీ వచ్చే దిక్కడనే.
'ప్రేమ' అనే ఆ దరిద్రపు గుడ్డిదీపం వెలిగి కొండెక్కే దిక్కడనే.
హత్యకు ఆత్మహత్యకు యిదే బలిపీఠం.
స్వర్గసీమ వల్ల కాదు రెండూ యిదే.
ఇక్కడే జీవి చనిపోయేదీ, చావు బ్రతికేదీను.
అసలు నీవూ నేను ఉన్నదే యిక్కడ.
మనకున్న యీ ఒకే ఒక దుప్పటిని నీవుకూడా పంచుకో.

రాడూ! చూడు చూడు! ఏమిటా గాజుల సవ్వడి!
జలపాతంలా అందెల మువ్వల చిందులు!
అందాలరంగవల్లి రా ఎవ రావిడ?
బొమ్మల పెళ్లిలో లక్కచిట్టిలా ఎవరు!
రాడూ! తీసెయ్! తలుపులు బార్లా తీసెయ్!

# ఇంటింటా స్వంత గ్రంథాలయం

## —సరికొత్త ప్రణాళిక—

### సులువుగా, చౌకగా ఎవరికివారు స్వంత గ్రంథాలయం ఏర్పరచుకొనుటకు

### అపాయంలేని ఉపాయం

### సారస్వత వ్యాసంగం చేసేవారికి బంగారువంటి అవకాశం!

ఇది మీకు మీ పనిపాటల్లోనూ, మీ ఊబుసుపోకకూ మిక్కిలి ఉపయోగపడే, మీకు బాగా నచ్చిన, మహామహులు వ్రాసిన మంచిమంచి పుస్తకాలు మీకు అట్టే శ్రమ లేకుండా సమకూర్చిపెడుతుంది.

ఇందుకై చేయవలసిందల్లా—

నెలనెలా అయిదే అయిదు రూపాయలచందా పద్దెనిమిది నెలలపాటు పంపడం! అంతే!!

అలా పంపితే—

దేశంలోని ప్రసిద్ధ ప్రచురణకర్తలు ప్రకటించిన, వేయింటికి దాటిన ఉత్తమ గ్రంథాలనుండి మీకు సర్వాత్మనా నచ్చిన రూ. 100 ల పుస్తకాలు మీ స్వంత గ్రంథాలయానికి లభిస్తాయి.

ఇవే కాకుండా—మరొక తొమ్మిది మంచిపుస్తకాలుకూడా బహుమతిగా వస్తాయి. మొదటి నెల చందా చేరగానే మా బహుమతి గ్రంథాల జాబితానుండి మీరు కోరిన మూడు గ్రంథాలు తొలికానుకగా పంపుతాము.

అంతే కాదు—సమకాలీన సాహిత్య ప్రథలను, సాహిత్య పరిణామాన్ని ఎప్పటికప్పుడు వెల్లడిపరచే 'పుస్తక ప్రపంచం' మాసపత్రిక తాలూకు 18 సంచికలు వరసగా మీకు ఉచితంగా వస్తాయి.

పైగా—వీటన్నిటికీ బంగీ - రవాణాఖర్చులు యావత్తూ మావే

మూడుముక్కల్లో చెప్పాలంటే—

నెలకు అయిదే అయిదురూపాయలఖర్చుతో 18 మాసాల్లో పుస్తకాలూ పత్రికారూపంలోనైతే నేమి, తదితర సదుపాయాల రూపంలోనైతే నేమి, మొత్తంమీద రూ. 127 ల ఫలితం పొందుతారు. అంటే, రూ. 90 మీద రూ. 37 ఆదా అన్నమాట.

పుస్తకాలు ఎప్పుడెప్పుడు ఎలా ఎలా వస్తాయి?

1 పథకంలో చేరి మొదటి నెల చందా కట్టగానే మూడు మంచిపుస్తకాలు ఉచితంగా లభ్యమవుతాయి.

2. 7 నెలలు వరుసగా కడితే మా కేటలాగునుంచి మీరు కోరే రూ. 30 ల పుస్తకాలూ, ఇంకొక మూడు ఉచితంగానూ వస్తాయి.

3. 13 నెలలు కట్టగానే, మా కేటలాగునుంచి మీరు కోరే మరి రూ. 30 ల పుస్తకాలూ, ఇంకొక మూడు ఉచితంగానూ వస్తాయి.

4. 18 నెలలూ కడితే అలాగే మరి రూ. 40 ల పుస్తకాలు వస్తాయి.

ఈ రూ. 100 ల పుస్తకాలతోనూ, 9 బహుమతి పుస్తకాలతోనూ సంపారపత్తుంగా చిన్న గ్రంథాలయం ఏర్పరచుకోవచ్చు.

ఇంకొక ముఖ్య సదుపాయం—

ఎప్పుడైనా, ఏ కారణంచేతనైనా మీరు మధ్యలో చందాకట్టడం మానివేసినా, అప్పటివరకూ మీరు చెల్లించిన మొత్తం విలువకు సమానమైన గ్రంథాలు మీకు తప్పక వస్తాయి. కాగా, ఇందులో చేరడంవల్ల మీకు నష్టపోయేదేమీ ఉండదన్నమాట. కాబట్టి—

**తక్షణమే ఇందులో చేరి మీ స్వంత గ్రంథాలయానికి పునాదులు వేసుకోండి!!**

---

## కూపను

ఊరు..............................

తేదీ..............................

ఆంధ్రప్రదేశ్ డిస్ట్రిబ్యూటర్సు,
రాష్ట్రపతిరోడ్, సికిందరాబాదు

వ్యవస్థాపకమహాశయా, నమస్తే.

మీరు కొత్తగా ఏర్పాటుచేసిన 'ఇంటింటా స్వంత గ్రంథాలయం' ప్రణాళిక అస్మదాదులకు మిక్కిలి ఉపయోగకరంగా కనబడుతున్నది. కాబట్టి, నన్నూ అందులో ఒక చందాదారుగా చేర్చుకొనగోరుతున్నాను. మొదటినెల చందా రు. 5 ఇదిగో మనియార్డరుగా/పోస్టల్ ఆర్డరుగా/నేరుగా కడుతున్నాను. తొలి ఉచిత పుస్తకాలుగా వెనుకవైపు జాబితాలో గుర్తుపెట్టినవానిని పంపగోరుతున్నాను.

ఇట్లు, విశ్వసనీయుడు

..............................

చిరునామా..............

ప్రక్కపుట చూడండి

మా ఈ

# 'ఇంటింటా స్వంత గ్రంథాలయం' ప్రణాళిక

## గురించి మహాజనులు ఏమంటున్నారో చదవండి

"దేశంలో చదివే అలవాటు వికాసానికి వసంతోదయం ... భావనాపూర్ణమూ, శ్లాఘ్యమూ అయిన సంవిధానం."

—డాక్టర్ యస్. ఆర్. రంగనాథన్.

మద్రాసు గ్రంథాలయసంఘ అధ్యక్షుడు.

... ... ...

"చక్కని యోచన. తెలుగు పాఠకలోకం మన్ననలను తప్పకుండా చూరగొంటుంది... యునెస్కో శుభాకాంక్షలు." UNESCO

... ... ...

"శ్రేష్ఠమైన యోచన. ఆంధ్రదేశంలో మధ్యతరగతికి చెందిన ప్రతిమనిషీ సునాయాసంగానూ, చౌకగానూ మంచి మంచి పుస్తకాలను క్రమంగా తెప్పించుకొనుటకు బాగా తోడుపడుతుంది."

—ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్య.

"అత్యుత్తమమైన ఊహ. దేశంలో ముఖ్యంగా తీరవలసిన అవసరాన్ని తీర్చితీరుతుంది."

—డాక్టర్ యస్. చంద్రశేఖర్.

... ... ...

"తక్కువ ధరలకు చక్కని గ్రంథాలను సమకూర్చియిచ్చి, 'ఇంటింటా స్వంతగ్రంథాలయం' స్థాపనను ప్రజాబాహుళ్యంలో ప్రచారం చేయడానికై మీరు చేపట్టిన ప్రణాళికను నేను మిక్కిలి హర్షిస్తున్నాను. మీరు ఇస్తామంటున్న ఇతర సదుపాయాలు కూడ ఆకర్షణీయంగా ఉన్నాయి. మీ ప్రణాళికను బహు జాగ్రత్తగా పరిశీలించాను. పుస్తకపరిశ్రమ వ్యాపకంగా మీరు ఈ విషయంలో మీచేతనైనంతలో గొప్పపని చేసినట్లు గట్టిగా గ్రహించాను."

—బి. యస్. కేశవన్.

ఢిల్లీ జాతీయ గ్రంథాలయాధికారి.

# ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు

## రాష్ట్రపతి రోడ్డు  సికిందరాబాదు

## ఇందులో మూడు ఉచితం

1. నిమజ్జనం—ఇటాలియన్ భాషను గూడ ఎక్కిన ముంజేరీ ఈశ్వరన్ అద్భుతనవలకు తెలుగు.
2. సిద్ధార్థ—నోబుల్ బహుమతి గడించిన హెర్మాన్ హెస్ నవలకు అనువాదం.
3. రాజాజీ కట్టుకథలు—జగమెరిగిన చక్రవర్తి రాజగోపాలాచార్యులుగారి రచనలకు ఆంధ్రీకరణ.
4. ఆధునిక విజ్ఞానము ; మానవుడు—పండితపామరులందరికీ కూడ విజ్ఞానశాస్త్రంతో అవలీలగా పరిచయం కలిగించే. డా॥ చాగంటి సూర్యనారాయణమూర్తిగారి రచన.
5. పాశ్చాత్యుల వృద్ధిక్షయములు—ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్యగారి అద్భుత చిత్రణ.
6. పౌరుడు : రాజ్యాంగము—భారత రాజ్యాంగాన్ని గూర్చి ప్రతిపౌరుడూ తెలిసికొని తీరవలసిన విషయాలు. ప్రొ॥ యం. రత్నస్వామిరచనకు తెలుగు.

# కస్తూరి గుమగుమల కన్నడ వచనాలు

శ్రీ కే. కుశాలప్పగౌడ

కన్నడభాషలో తొలి అలంకారశాస్త్రగ్రంథం 'కవిరాజమార్గ' అనేది. ఇది 9 వ శతాబ్దిలో రచితమైంది. అంతకుముందే కన్నడంలో పద్యకావ్యాలూ, గద్యకావ్యాలూ ఉన్నట్టు ఉల్లేఖం ఉన్నది. 'విమలోదయ, నాగార్జున, జయబంధు, దుర్వినీత'గులు గద్యశ్రమ గురుతాప్రతీతిని పొందిరని ఈ గ్రంథం పేర్కొంటున్నది. అయితే వారి గద్యగ్రంథాలేవీ మనకు లభించలేదు. "వడ్డారాధనె" అనే గద్యగ్రంథమొకటి శివకోట్యాచార్యుడు రచించినది ఇటీవల లభించి, కాలనిర్ణయం విషయంలో మతభేదాలున్నా 10 వ శతాబ్దిది కావచ్చునని బహుమతంతో నిర్ణీతమైనది. కవిరాజమార్గంలో, పద్యపాద నియమాస్పదం లేక, 'అలంకృతం క్రియాకారకదోళ్ పుదిదర్థ వ్యక్తియ నిపుణ గద్యమ్, అనేక రూపభేదవిభక్తం" (అలంకారయుతము, క్రియాకారకంలో గతనార్థవ్యక్తి నిచ్చునది గద్యం, ఇది అనేక రూపభేదవిభక్తం) అని గద్యస్వరూప వివరణమూ ఉన్నది. సంస్కృతహర్షచరితం, కాదంబరి తత్సమానగద్య గ్రంథాలని ఉదాహరణకూడా ఉన్నది. కన్నడంలో 10 వ శతాబ్ది తర్వాత లభించే గ్రంథాలన్నీ చంపూరూపంగా — గద్య పద్య సమ్మిశ్రరూపంగా — కనిపిస్తున్నాయి. ఇలా చంపూరూపగ్రంథాలలో కనిపించే గద్యభాగాన్ని 'వచనం' అన్నారు. ఈ వచనస్వరూపం కవిరాజమార్గంలోని నిరూపణకు సరిపోలుతుందో, లేదో తెలియదు. ఈ గద్యం — అథవా వచనం — శబ్దాలంకారాడంబరంతో సంయుతం. "గద్యం కవీనాం నికషం వదంతి" అనే వాక్యాన్ని మనసులో ఉంచుకునే పలువురు కవులు సంయమమనేది లేక పాండిత్యప్రదర్శనానికే అవకాశం కలిగించుకొన్నట్టు తోస్తుంది. ఏమైనా, మాత్రాత్మక ఛందస్సులనే తప్పలవెంట తగిలిన ఈ గద్యం వృత్తాల దంపత్యానికి పురోహితుడు వేసిన మంత్రగ్రంథిలాగ ఉండి, తర్వాత తర్వాత వీరశైవ శరణుల (భక్తుల) చేతిలో విశిష్టత సంపాదించుకొని, లౌకిక విషయాలకు ఆధ్యాత్మిక మధువు పరుపించే జనుల హృదయానికి ఆనందామృతము ఆస్వాదింపజేసే — గద్యపద్యాల మధ్య సువర్ణసేతువుగా కనుల పండువైంది.

మనోజ్ఞమైన, పావనమైన విషయాలను అభివర్ణించవలసి వచ్చినప్పుడు గద్యం తన మేరమీరి పద్యచ్ఛాయను పొంది వృత్తగంధి అవుతున్నది. దీనికి ఉదాహరణగా రవీంద్ర కవీంద్రుని గీతాంజలిశైలిని చూడవచ్చు. ఇంగ్లీషులో 'Poetic Prose' అనేది కన్నడంలోని 'వచనం' అనే శబ్దానికి తగినట్టిది. సాహిత్యధర్మాన్ని, సరళతను నవీనతాస్వర్ణలేపంతో మెరిసేట్టు చేయగలశక్తి ఉన్నందుకు 'వచనం' చాల మన్నన పొందింది. అంగకోసమే సాహిత్యప్రియులు దానిని కొండాడుతున్నారు. వెయ్యేండ్లకు ముందునుంచి నిరంతరాయంగా పెరుగుతున్న కన్నడ సాహిత్యంనుంచి విశ్వసాహిత్య భండారానికి ఇవ్వదగిన కానుక ఏదైనా ఉన్నదంటే, ఈవచనమే మొట్టమొదటి ఉపాయనమని కోవిదులు నోరారా పొగడినారు. స్థూలంగా చూస్తే, ఈ వచనాలు రసాత్మకమైన విడికవితలై వెలుగొందుతున్నాయి; సంస్కృత పదభూయిష్ఠతను వదలి నిరాభరణసౌందర్యంతో శోభిస్తున్నాయి; కేవల వ్యాకరణచ్ఛందోలంకారాది శాస్త్రాలను మననం చేసిన దిట్టంతి పండితులే కావ్యరచనకు కావ్యరసాస్వాదనకు సమర్థులని, గూఢతర ధర్మాలను సరళంగా తెలిపితే గాంభీర్యం లుప్తమైపోతుందని ఉన్న శిష్టుల ముడిముసుకును పటాపంచలు చేసి మెరుస్తున్నాయి. అంతేకాక, కేవలం ఔపచారికంగా కాక, వాత్సల్యంతో, ప్రేమతో "అయ్యా, అణ్ణా, అవ్వా, అక్కా" (అయ్యా, అన్నా, అమ్మా, అక్కా) అని ఆత్మీయతతో సంబోధించి, ప్రజల మనసులను చూరగొని, తమ వైపు ఆవర్జించుకొనే శక్తి ఈ వచనాలలో ఉంది. "అయ్యా ఎందడె స్వర్గ, ఎలవో ఎందడె నరక" (అయ్యా అన్నప్పుడు స్వర్గం ఒరే అన్నప్పుడు నరకం) అని బసవేశ్వరుడు వినయ సందేశమిచ్చాడు.

వచనకారులు వ్యవహరించిన భాష చాల సరళమైనది; తేటైనది. వారు ఎంచుకొన్న మాటలు ప్రజలు తమ సుఖదుఃఖాలను తమ ఆత్మీయులతో చెప్పుకొనేటప్పుడు వ్యవహరించేటట్టివే. అందువల్ల ఈ వచనాలు ఆత్మీయత తొణికిసలాడుతూ, మాటల లాలిత్యంతో హృదయవికాసం కలిగిస్తాయి. వారి మాటలలో అంతటా ముత్యాలవంటి సౌమ్యకాంతి చౌకళిస్తుంది.

“కొరడు కొనరగ బల్లుదే? బోహు హాయనాగ బల్లుదే! కురుడంగె కన్నడియ తోరిదరె నోడబల్లనే” (మోడు చివురవునా? గొడ్డు పాడి యిచ్చునా? (గుడ్డివానికి అద్దం చూపితే, చూడగలిగినా?) అని ఆత్మజ్ఞానం శతమూర్ఖునికి ఏమి చేసినా కలుగదని ఒక వచనకారుడంటాడు. “బిసజ తంతువిన సంచదింద మదగజ బంధవడెయు బల్లుదే? తరగెలె ముసుకిదొడె దావానల కెడబల్లుదే!” (బిసతంతు సంచయంతో మదగజం కట్టుబడినా? కారాకులు దుల్లి ముసుగుకొన్నంత మాత్రాన దావానలం అణగారినా?) అని ఆత్మజ్ఞానిని కర్మబంధం ఏమీ చెయ్యజాలదని మరొక వచనం చెబుతున్నది. విశ్వతోముఖుడైన పరమాత్మ మనలో అణగి ఉన్నాడు. ఇది తెలుసుకోక పరమాత్మని మరొకచోట అరయుట భ్రాంతి కాదా? “కైయల్లి జ్యోతియ హిడిదు, కత్తలె యన లేతక్కె? పశుపరస కైయల్లిద్దు కూలియ మాడ లేతక్కె? (చేత జ్యోతి పట్టుకొని చీకటి పడటం ఎందుకు? పరుసవేది చేత ఉండగా కూలిచేయుట మెందుకు?) అని ఒక వచనకారుడు ప్రశ్నిస్తాడు. మహాజ్ఞాని అయిన అల్లమప్రభువు మానవులు—జ్ఞానులనిపించుకొన్నవారూ—కేవలం బాహ్యాచరణమందే మేను మరచినట్టున్న పన్ని వేశం చూచి దుఃఖంతో అంటున్న ఈ మాట మర్మస్పృక్కుగా ఉన్నది. “అర్ఘ్యం, పత్రం, పుష్పం, ధూపం, దీపం, నివాళి—వీనితో పూజించి పూజించి బడలుతున్నారు; ఏమిటో తెలియరు, ఎంతని తెలియరు. జనములలో, జాతరలలో అన్నట్టు అందరూ పూజించి, దనిని కానక, లయమైపోయారు గుహేశ్వరా?”

మానవునిలో దేవత్వాన్ని కనిపెట్టే దృష్టి దివ్యదృష్టి. ఇలాంటి దివ్యచక్షువుగల జ్ఞాని యొకడు తానే తానై, అడుగడుగున ఆనందాశ్చర్యానుభూతితో మేను మరుస్తున్నాడు: “మొయిలు మరుగు సూర్యునివలె, నేలమరుగు నిధానంవలె, ఒరమరుగు అలుగువలె, పండులోని రసంవలె, శరణాల శరీరంలో మరుగై పరమపావనమూర్తి, పరాపరుడు తానుతానై యున్నదానిని ఏమని చెప్పనయ్యా!” ఈ మాట లేమో చిన్నవి. దీని కర్త “పరాపరుడు తాను తానై ఉన్న” స్వరూపం తెలుసుకొని ఆనందించేట్టు అతడు చెప్పే చిన్నచిన్న పోలికల మహత్వజ్ఞానం మనకు కలుగుతున్నది. రక్త మాంస మజ్జలతో రచితమైన ఈ పార్థివదేహం సూర్యునివలె, అలుగువలె, నిధానంవలె తళతళ మెరిసే ఆత్మను మరుగుచేసుకొనివుంది. అందువల్ల అజ్ఞానానికి, మాయాపాశబంధనాలకి, అధఃపతనానికి ఆత్మ కూడా లోబడుతున్నట్లు తోస్తుంది. అజ్ఞానమనే మొయిలు మాయమైనప్పుడు, ఆ దివ్యజ్యోతి తీక్ష్ణప్రభతో లోకానికంతా వెలుగు చల్లుతుంది; శూరుడు ఒరనుండి లాగిన వాడి కత్తితో తన్ను ముట్టడించిన శత్రువులను నిగ్రహించేటు జ్ఞానికూడ తన దేహమనే (చర్మపు) ఒరలో అణగియున్న జ్ఞానమనే కత్తితో మాయామోహాహంకారాది వైరులను నరికివేస్తాడు. మట్టిలో పూడుకుపోయినా మట్టిలో చేరక, చిలుముపట్టక చెక్కుచెదరని నిధానంవలె ఆత్మ ఈ పార్థివదేహంలో పూడుకొనిపోయినా, దానికి ఈ ప్రాపంచిక సుఖదుఃఖాలు, కష్టక్లేశాలు అంటవని సూచన.

ఈ దేహం పారమార్థిక సాధనకు ఒక ఉపకరణ మాత్రం. సాధన సిద్ధించినతర్వాత ఈ ఉపకరణం ప్రయోజనం ఏమిటని సూచించే వచనమిట్లున్నది:

‘పట్టు తిన్న పినప మానును ఎవరు నరికితే ఏమి? వదలివేసిన పినప వనితను ఎవరు కూడితే ఏమి? భూమిని మనం వదలుకొనినపిదప ఎవరు దున్నితే ఏమి? చెన్నమల్లికార్జునుని అరసిన తర్వాత ఈ కాయాన్ని కుక్క తింటే ఏమి? నీరు నిండితే ఏమి?” రాణిఅయి అంతా త్యజించి విరక్తయై దిసమొలతో కల్యాణపట్టణంలోని శరణుల సమూహంవద్దకు వచ్చిన తనను పరీక్షించడానికి అక్కడి శరణసందోహం అడిగిన ప్రశ్నకు, చేసిన పరిహాసానికి ఈ సమాధానమిచ్చి, వారి నోరు మూయించి, మహాజ్ఞానులైన అల్లమప్రభు, బసవేశ్వరుడు మొదలయినవారిని వెరగొందజేసిన అక్కమహాదేవి వచనమిది.

భక్తుడు భగవంతుని సన్నిధిలో చేరిపోయినపిదప భగవద్భక్తభేద మేమీలేదు; వేరుగా తోచదు. పర

# కస్తూరి గుమ గుమల కన్నడ వచనాలు

మాత్మలో జీవాత్మ అంతర్లీనమై ఒక్కటైన పిదప వేరుగా భావించడానికి అవకాశం లేదు – అని జ్ఞాని అల్లమప్రభు "కర్పూరద గిరియను ఉరిహిడిదబళిక, ఇద్దలుంటే? మంజిన శివాలయకె బిసిలిన కళస ఉంటే? కెంపన గిరియు అరగిన బాణదలెప్పడె మరళి బాణద నరస లుంటే? మహేశ్వర కెంబ లింగవ బెరిసు మరళి నెనెయలుంటే?" (కర్పూరగిరికి చిచ్చు తగిలినపిదప బొగ్గు ఉంటుందా? మంచు శివాలయానికి ఎండ కలశముందా! నిప్పుకుప్పలో పెట్టిన బాణాన్ని మరల అరయగలమా? మహేశ్వరుడనే లింగాన్ని తెలుసుకొన్నపిదప తనను తలచడం ఉండేనా?) అని ప్రతిపాదిస్తాడు.

ఇలాంటి చిన్న చిన్న మాటలలో కావ్యకాంతి నిశ్చలమై వెలుగుతుంది. నిండిన లాలిత్యం, తేలికడిలో పొదిగిన గాంభీర్యం, మొత్తంపై తనంపట్టిన శ్రుతి మాధుర్యపు సొబగు, హృదయహృదయ స్పర్శిగా ఉన్నాయి. నృపతుంగ చక్రవర్తి రచించిన 'కవిరాజమార్గ' (9 వ శతాబ్ది)లో కన్నడనాడు జనసామాన్యం గురించి చెప్పిన "అ నాడవర్గళ్ చదురర్ నిజదిం కురితో దదెయుం కావ్యప్రయోగ పరిణత మతిగళ్" (ఆనాడు ప్రజలు నిజంగా చతురులు, క్రమశిక్షణతో చదువు లేని గొర్రెల కాపరులుకూడా కావ్య ప్రయోగ పరిణతమతులు) అన్నమాట కేవలం స్వాభిమానపు మాట కాదని బసవేశ్వరాది వచనకారుల కాలపు విప్లవయుగంలోని జటుపోట్లవల్లనూ తెలుస్తున్నది. సమాజంలో కడజాతివారని, అస్పృశ్యులని పరిగణితులయినా, "కురితోదదెయుం" కావ్యప్రయోగ పరిణత మతితో ఉత్తమ వచనాలు పాడారు. ఇలాంటి వారిలో ముఖ్యులైనవారి వచనాలు వారి వారి నామాంకితాలుగానో, ఇష్టదేవతా నామాంకితాలుగానో మనకు కనుపిస్తాయి. జే(దే)డర దాసిమయ్య, మడివాళ మాచయ్య, మేదార కేతయ్య, హడపద అప్పణ్ణ, అంబిగర చౌడయ్య అనే వారందరూ వచనకారులై గౌరవానికి పాత్రులయ్యారు. కొందరు వచనకారులు చెప్పినట్టు అసంఖ్యాకులైన వచనకారులు కోటానుకోటి వచనాలను పాడినట్టు తెలుస్తున్నది. దీనిలో చాల అతిశయోక్తి ఉన్నా, ఆ కాలపు ఉద్యమంలో అల్లమప్రభువు, బసవేశ్వరుడు, సిద్ధరామ, చెన్నబసవ మొదలయిన ప్రవక్తవ్యక్తులను అనేకానేక శివశరణులు, నాడు ప్రజలు అండగా ఉన్నారన్నమాట నిర్వివాదం. [స్థూలంగా మనం వచన సాహిత్యావలోకనానికి ఈ ముఖ్యుల రచనలనే పరిశీలించడం సాధ్యమనడంవల్ల తక్కినవారిని గురించి చెప్పకపోవడం అనివార్యమౌతున్నది.] అల్లమప్రభువు అద్వితీయజ్ఞాని; బసవేశ్వరుడు అసమాన భక్తుడు; అక్కమహాదేవి సాటిలేని విరక్త. ఇట్టి భక్తిజ్ఞాన వైరాగ్యాల సంగమం కల్యాణ నగరంలో బసవేశ్వరుడు స్థాపించిన "అనుభవ మంటపం"లో కలిగింది. ఈ పర్వకాలంలో వచనాలు చెలమై, బుగ్గయి, పెద్ద పరీవాహమై ప్రవహించి, సాహిత్య ధార్మిక క్షేత్రాలను సంపన్నం చేశాయి.

అల్లమప్రభువు వచనాన్ని ఒక దానిని అప్పుడే మనం చదివాము (అర్ఘ్యం, పత్రం). అతను ధర్మాంధతతో అన్యమతాలను నిందించలేదు. తనవారిలోని తప్పులను కప్పిపెట్టలేదు. ఇంకా ఎందుకు! తనవారు, పరవారు అనేది అతనికి లేదు. బసవేశ్వరుని వంటి భక్తాగ్రణి, సొన్నలిగె సిద్ధరామ వంటి బహుజనోపకారి, నిత్యపూజాధ్యాన మగ్నులైన అనేక శివశరణులు – అతని కటువచనాల గురికాని వారు కారు. బసవేశ్వరుని మేనల్లుడైన చెన్నబసవుడు, చిన్నవాడైనా, జ్ఞానియని పొగడడానికి అతడు వెనుకాడలేదు. ఇట్టి గౌరవపూర్ణ వ్యక్తి బహుజనుల మన్ననకు పాత్రుడయ్యాడు. బుద్ధిమంతులు తమ తప్పులను తెలుసుకొని, దిద్దుకొని, అతని మన్ననపొందారు. ఇతనికోసం ప్రభులింగ లీల అనే గ్రంథం అవతరించి తెలుగు తమిళాది భాషలలో అనువదించబడింది.

బసవేశ్వరుడే మొదటి వచనకారుడన్న సిద్ధాంతం ఇప్పుడు సకారణంగా పరాస్తమైంది. శైవాగమాల సారాన్ని సంగ్రహించి, వీరశైవమనే నూతన శాఖను స్థాపించిన, దళితమంతటా నూతన ధార్మికోద్యమాన్ని రేకెత్తించిన, సంఘ సంస్కరణ సంఘటనలతో జాతిభేదాన్ని నిర్మూలించిన శ్రేయస్సు బసవేశ్వరునిది. "కూడలి సంగమదేవా!" అనే అంకితమున్న ఇతని వచనాలు చదివినప్పుడు, ఇతని వ్యక్తిత్వంతో నికట పరిచయమౌతుంది. ఈ వచనాలలో కావ్యపు కమనీయత ఉంది; ఆత్మ ఆవేగముంది. భావగీతాల భావోన్మాద ముంది; భక్తుని తన్మయత్వముంది; సంఘ సంస్కర్త సంతాపం, వివేకి హితవు, అన్నిటికన్నా మిన్నగా ఆత్మవిమర్శ, అంతర్నిరీక్ష అణగిఉన్నాయి. రాజమంత్రి అయిన బసవేశ్వరునికి విరోధులు లేక

పోలేడు. విరోధుల సూటిపోటు మాటలకు సరైన సమాధానమిస్తూ, ఆత్మ పరిశుద్ధతను పెంచుకుంటూ, సదా పరమాత్మపైనే దృష్టినిలుపుకొని వున్న బసవేశ్వరుని వ్యక్తిత్వం చాలా ఘనమైనదిగా కనిపిస్తున్నది. మాలమాదిగలని, హీనజాతివారని నిందితులైన వారందరిని చేపట్టి ఉద్ధరించడానికి బసవేశ్వరుడు బహు కృషి చేశాడు. హీనజాతివారు తన బంధువులనే అనుకంపతో ఆయన చెప్పిన వచనమిది: "అప్పను డోహార కక్కయ్య నాగి ముత్తయ్య చెన్నయ్య నాదరే అను బదుకువెను. ముత్తి శ్వపచయ్యన సన్నిధి యింద భక్తియ పడ్గణ నానావె నయ్యా! కష్టజాతి జన్మదల్లి జనిసిదె. ఎన గీ విధియో కూడలి సంగమదేవా?" (తండ్రి డోహార కక్కయ్యఅయి, పినతండ్రి చెన్నయ్యఅయితే నేను బ్రతుకుతాను. మరి శ్వపచయ్య సన్నిధిలో భక్తి పద్ధతిని నేను తెలుసుకుంటాను. కష్టజాతి జన్మలో జనించాను. నాకిది విధియా కూడలి సంగమదేవా?)

తాను రాజకార్యాలలో చిక్కుకొని, లౌకిక వ్యవహారాలలో మునిగినా, కూడలి సంగమదేవుని నిరంతరం పూజించేవాడు. అంతమాత్రాన అతని సంతృప్తి కాలేదు. భక్తిపారవశ్యంతో మునుగుతూ వాలని ఆలోచించినా, లౌకిక వ్యవహారానికి కట్టుబడిన అతనికి తృప్తి దూరమైంది. ఒకసారి అట్టి, ఒకసారి ఇట్టి అన్నట్టు లౌకిక రాజకీయవిషయాల సుడిగుండంలో చిక్కుకొని తిరిగి తిరిగి అలసి సొలసిన బసవేశ్వరుడు 'ఎనితు కాల కల్లు నీరొళగిద్దు ఫలవేను? ఎనితు మృదువాగ బల్లుదే? ఎనితు కాల నిమ్మను పూజిసి ఏవెనయ్యా? మనదల్లి దృఢవిల్లదన్నక్క? నిధానవ కాయ్దున బేతాళనంతె అవర విధి ఎనగాయిత్తు కూడలి సంగమదేవా?" (ఎంత కాలం రాయి నీటిలోవుండి ఫలమేమి? నాని మెత్తబడునా? ఎంత కాలం మిమ్మల్ని పూజిస్తేనేమి మనస్సులో దార్ఢ్యం లేనప్పుడు? నిధికి కాపలా వున్న పిశాచంవలె ఉన్నాను. దాని విధి నాకయింది కూడలి సంగమదేవా?) అని నిట్టూరుస్తాడు. నిధానమును కాపాడే పిశాచం భగభగ మెరిసే ఆ నిధినిచూస్తూ, కళ్లు మిడకాల్సిందే! దానిని అనుభవించడానికి దానికి సాధ్యం కాదు. ఈ విధంగానే కూడలిసంగమదేవుని సాన్నిధ్యం తన కున్నప్పటికీ, భగవద్ధ్యానంలో లీనం కాక తక్కిన చిక్కులలో పడ్డ తన్నుగురించి తానే నిందించుకొంటున్నాడు.

ఒకప్పుడు భక్తి పారవశ్యంతో నీవు అనన్య శరణ్యుడనే పవిత్రభావనతో "వచనదలి నామామృత తుంబి, నయనదలి నిమ్మ మూర్తి తుంబి, మనదల్లి నిమ్మ నెనహు తుంబి, కివియల్లి నిమ్మ కీర్తి తుంబి, కూడలి సంగమదేవా నిమ్మ చరణకమలదొళగాను తుంబి" (మాటలలో మీ నామామృతం నింపి, నయనాలలో మీ మూర్తి నింపి, మనసులో మీ తలంపు నింపి, చెవులలో మీ కీర్తి నింపి—కూడలి సంగమదేవా నీ చరణకమలాలలో నన్ను నింపికొన్న తుమ్మెదను) అని భగవత్సాన్నిధ్యపు సుఖంలో మునుగుతాడు. చెప్పేది, చూచేది, తలచేది అంతా విశ్వవ్యాపినే. సర్వేంద్రియాలలోను పరమాత్మను అనుభవించి, అతని పాదకమలయుగంలో భక్తిమధువు పానంతో మైమరచిన మధుకరుడు బసవేశ్వరుడు. ఎంతటి విశాలభక్తి! ఎంతటి ఉన్నతమూర్తి!

ఇతని వచనాలవల్లనే అప్పటి సంఘపరిస్థితి స్పష్టచిత్రం లభిస్తున్నది. చాళుక్యసామ్రాజ్యం నశించి, కళచుర్య హయాములలో కలహం పుట్టి అశాంతి వాతావరణం దేశమంతటా వ్యాపించింది. ధర్మంపేరుతో అనాచారం. అత్యాచారం. వెనుకబడిన వారియెడ తిరస్కారం తాండవిస్తుండగా, జనులకు దారిచూపడానికి బసవేశ్వరునివంటి వ్యక్తులు అవతరించవలసివచ్చింది. ఆ కాలపు ఆహ్వానమే — ప్రజల పిలుపే — బసవేశ్వరునికి అండగానిలిచి ఆయనను కార్యక్షేత్రంలో దూకించింది. ఇలా దూకిన బసవేశ్వరుడు సంఘంలోని దుష్ట సంప్రదాయాలను విమర్శించాడు; జనం వివేకవంతం కావాలని హితబోధ చేశాడు. ఆయన చెప్పిన వచనాలలో ఇటువంటి సన్నివేశాన్ని ఈ వచనం నిరూపిస్తున్నది. "కల్ల నాగర కండరె హాల నెరె యంబరు. దిటవ నాగర కండరె కొల్లెంబరయ్యా. ఉంబ జంగమ బందరె నడెయంబరు ఉణ్ణద లింగక్కె బోనవ హిడియంబరయ్యా! నమ్మ కూడల సంగన శరణర కండు ఉదాసీనవ మాడిదరె కల్లు తాగిద మిట్టె కెంతప్పనయ్యా" (రాతినాగును చూస్తే పాలుపోయమంటారు. నిజమైన నాగును చూస్తే చంపమంటారు. తినే జంగముడు వస్తే నడువుమంటారు. తినని లింగానికి బోనము పట్టుమంటారు. మనకూడలి సంగమదేవుని శరణులను ఉదాసీనంచేసే రాయితాకిన మిట్టవలె గలగలాడేవారయ్యా అని) తీవ్రంగా విమర్శించాడు.

"దేవనొబ్బ నామ హలవు" (దేవుడొక్కడే, పేర్లుపెక్కు) అని బోధించిన బసవేశ్వరుడు జనుల

నానా దేవతలను, దయ్యాలు భూతాలను పూజించడం చూచి కటువుగా విమర్శించాడు. "హాళు మొరడిగళల్లి, ఊరదారిగళల్లి కెరె బావి హూగిడ మరంగళల్లి, గ్రామద మధ్యదల్లి, చౌపదపట్టణప్రదేశదల్లి, హిరియాలద మరదల్లి మనెమాడి. కరెవెమ్మె హసుగూసు, బసురి, బాణంతి, కుమారితి కొడగూసెంబ, హిడిదుంబ తిరిదుంబ బీరయ్య ఖేచర గావిల అంతక చింతక, కాళయ్య, మారయ్య, కేతయ్య గళెంబ నూరుమడికెగె నమ్మ కూడల సంగమదేవన శరణెంబొందు దొణ్ణెసాలదె?" (పాడు బీడులలో ఊరిదారులలో, చెరువు, బావి, పూలచెట్ల చేమలలో గ్రామమధ్యంలో చతుష్పథంలో పట్టణప్రదేశంలో పెద్దమర్రిమానులో ఇల్లుకొని కరవమ్మె పసికందు, గర్భిణి, బాలింత కుమారి అనేటి, పట్టితినే, నలిపితినే బీరయ్య, ఖేచర, పిశాచ, కాళయ్య మారయ్య, కేతయ్య అనేటి నూరు కుండలను మా కూడలి సంగమదేవుని శరణనే ఒక బడియ చాలదా?) అన్నాడు

జీవుల జోలితో ప్రాణిహింస జరగడం సహించని బసవేశ్వరుడు ఎవరూ ధర్మానికి అపచారం చేయరాదని "దయవిల్లద ధర్మవావుదయ్యా? దయవే బేకు సకల ప్రాణిగళెల్లరల్లి; దయవే ధర్మద మూలవయ్యా! కూడలి సంగయ్యనంతల్ల దొల్లనయ్యా!" (దయలేని ధర్మమేమి అయ్యా? దయయే కావాలి సకల ప్రాణులలోను. దయయే ధర్మ మూలమయ్యా! కూడలి సంగయ్య అది లేని దానిని ఒల్లడయ్యా) అని సారెసారెకు చెప్పాడు. జాతి హెచ్చులొచ్చులు జన్మతో కాదు, వృత్తితో నని "కొల్లువనే మాదిగ, హొలసు తింబవనే హొలెయను! కులవేనో, అవందిరకులవేనో?" (హింస చేసే వాడే మాదిగ, మురికి తినేవాడె మాల, కులమేమిటోయ్? వారి కులమేమిటోయ్?) అని వినయంతో విహ్వలాలను కోపాన్ని కప్పి పుచ్చుకొని అన్నాడు.

కేవలం పారమార్థికంపై దృష్టి పెట్టి బసవేశ్వరుడు ఇహాన్ని తెగడలేదు. 'స్వర్గలోక మర్త్యలోకవెంబుదు బేరిల్ల కాణిరో' (స్వర్గలోకం, మర్త్యలోకం అనేది వేరేలేదు సుమీ!) అని ఇహంలో అంతా ఉందని నిశ్చయంగా చెప్పి, ఈ భూలోకపు జీవితాన్ని దేవలోకంగా చేసివేయాలని చాల ఆశించాడు. "కళబేడ; కొలబేడ; హుసియ నుడియలు బేడ; తన్న బణ్ణిసబేడ; ఇదిర హళియలు బేడ; అన్యరిగె అసహ్యపడబేడ ఇదె అంతరంగశుద్ధి; ఇదే బహిరంగ శుద్ధి. ఇదే కూడల సంగన నొలిసువపరి" (దొంగిలవద్దు. చంపవద్దు. అబద్ధాలు చెప్పవద్దు. తన్ను పొగడవద్దు. ఎదిరిని తెగడవద్దు. ఒరులను అసహ్యించుకోవద్దు. ఇదే అంతరంగశుద్ధి. ఇదే బహిరంగశుద్ధి. ఇదే కూడలి సంగన్నను సంతసపెట్టే పద్ధతి) అని బోధించి సాటి మానవుల బ్రతుకు బంగారం కావాలని వాంఛించాడు.

ఈ రీతిగా బసవేశ్వరుడు వీరశైవ వచనకారులలో అత్యంత శ్రేష్ఠ వ్యక్తి. అన్యమతావలంబి అయిన రాజు ఆస్థానంలో ఉంటూ, జనోద్ధారానికి వీరశైవ ధర్మాన్ని స్థాపించి, మహాభక్తులందరినీ ఒకచోట చేర్చి, వారిచే జనులను బోధనుచేయించి జ్ఞానప్రసారం చేశాడు. ఈ కారణంవల్లనే వీరశైవులందరే కాక ఇతరులతోను గౌరవంపొంది, అందరికి "అక్కరెయ అణ్ణ, బసవణ్ణ" (అక్కరగల అన్న బసవన్న) అయ్యాడు.

కన్నడ సాహిత్యకాలంలో ధ్రువతారలా మెరసే వ్యక్తిత్వం అక్కమహాదేవిది. సామాన్యంగా పుట్టిపెరిగిన ఆమె అలౌకిక సౌందర్యంతో కౌశికరాజు పట్టపురాణి అయింది. సతీపతి భావపు భక్తితో సహజంగా పొరపు లేని తన్మయతను ఆమె చూపింది. తాను కౌశికుని రాణి అయినా చెన్నమల్లికార్జునుడే తన మగడు తానామె భార్య అనుకుని మహేశుని పూజచేస్తున్న ఆమెను కౌశికరాజు అడ్డురాగా సకలం త్యజించి, విరక్తురాలయి, దేహాభిమానం లేక దిగంబర అయి కల్యాణనగరాభిముఖి అయింది. ఆమె అలౌకిక సౌందర్యమే ఆమెకు శత్రువయినందున ఆమెకు అపనింద. అతి అమాయి సింధువ యసులోని వ్రత, నగ్నంగా నడవడం చూచి ముగులుగొన్న వారెందరో! మోహించిన వారెందరో! కామించినవారెందరో! కొందరు జ్ఞానులలో పసలిన సమయం బలపరచుకొన్నవారెందరో! ఆమెను పరీక్షించినవారెందరో! మొత్తంమీద, ఆకష్ట పరీక్షలన్నిటిని దాటి, తనను కష్టపెట్టినవారి కళ్ళమాయను హరించి, బసవ, అల్లమప్రభువు మొదలయిన జ్ఞానులతో పొగడించుకొన్న కవి ఆమె. ఆమె వచనాలలో నిండిన హృదయభావనే రసపూర్ణ కావ్యపుంజమై రంజింపజేస్తుంది. ఆమె వచనాలలో స్త్రీ సహజమైన కోమలత, ప్రియురాలు తన ప్రియునికోసం ఉత్కంఠపడినట్టు భక్తహృదయం భగవంతునితో అనుసంధానం కావాలని ఆశించే ఆశించే ఉత్కంఠత నిండి ఉంటాయి. మహాదేవి అక్క తృషిత నేత్రాలకు - కవికన్నులకు పర్వతీసుకుంగా సత్యం శివం సుందరం సాక్షాత్కారమైనట్టు - వచనాల తీగలతలలోను చెన్నమల్లికార్జునుడే కనిపిస్తాడు! "వనవెల్ల నీవే; వనదొళగణ దేవతరు వెల్ల నీవే; చెన్నమల్లికార్జునా సర్వభరితనాగి ఎనగె ముగ

దొరా (వనమెల్ల మీరే, వనంలోని దేవతరువులన్నీ మీరే, చెన్నమల్లికార్జునా సర్వభరితుడవై నాకు నీ ముఖం చూపుమోయీ!) అని ప్రేమవిహ్వలాలతో పిలుస్తుంది.

చెన్నమల్లికార్జునునిలో ఐక్యం కావడానికి ఉబలాటపడుతున్న మనసు మరేవానివైపు మొగ్గదు. కౌశికుని రాజ్యమున్నది; రాజ్య సింహాసనంలోను, అతని హృదయసింహాసనంలోను రాణిగా విరాజమాన అయినట్టిది; తనకోసం సర్వ త్యాగం చేస్తున్న రాజుకు కృతజ్ఞురాలుగా వుండవలసిన కర్తవ్యపు ధర్మసంకటం ఏర్పడింది. కాని. అది సాధ్యంకాదు ఈ విషయమై ఆమెకు సఖులు హితవు చెప్పారేమో! ఈ వచనం ఆ హితవుకు సమాధానంగా ఉన్నది "గిరియ ఉల్లదె హుల్లుమొరడియల్లాడువుదే నవిలు? కొళనల్లదె కిరుకుళ్ళక్కెళసువదే హంసె? మామర తళితల్లదె స్వరగైవుదే కోగిలె? పరిమళవిల్లద పుష్పక్కెళసువదే భ్రమర? ఎన్నదేవ చెన్నమల్లికార్జుననల్లదె అన్యక్కెళసువదే ఎన్నమన? కేళిరా కెళదియరిరా! (గిరిలో కాక గడ్డిమేటిలో ఆడినా నెమలి? కొలనిలో కాక చిగుర కసు వెళ్లినా హంస? మామిడిచివురును కాక మరొకటి మెసవినా కోయిల? పరిమళంలేనిపూవు పైవాలినా భ్రమరం? నాదేవుడు చెన్నమల్లికార్జునిని తప్ప మరోవైపు వెళ్లినా నామనసు? వినరా చెలులారా!) మరొకచోట "ఎందూ అళియిల్లద గండనిగె నన్న మదువెయ మాడిదరు (ఎన్నడూ నాశంలేని మగనికి నన్ను పెండ్లి చేశారు) అని, "ఈ లోకదఅళివ గండరన్నెల్ల ఒలెయొళగిక్కిరవ్వా" (ఈ లోకపు నశించే మగలందరినీ పొయిలో పెట్టండమ్మా!) అని కొంచెం కోపంతో చెబుతుంది.

ఒక దిశకు పారుతున్న నది తనకు అడ్డమైన రాళ్లను, గుట్టలను, ఇక్కట్టులను దాటి సాగరంలో లీనం కావడానికి పోయేట్లు, ఆమె మనసు కౌశికరాజు మాయను, ఇతరుల అడ్డంకి వీటన్నిటినీ మీరి పరమేశుని ఎడకు సాగుతుంది. తన కష్టాలు దొడ్డవికావు; వాటి వల్ల ఆత్మగుణాలు కాంతి హెచ్చుతాయని సోదాహరణంగా చెప్పిన వచన మిలా వుంది: "చందనవ కడిదు కొరెదు తేయ్దడె నొందు కంపబిట్టితే? తందు సువర్ణవ కడిదొరెదొడె బెందు కళంక హిడిదిత్తే? సందు సందు కడిద కబ్బను గాణదలిక్కి, అరెదు పాకగుళ్ళ సక్కరెయాగి నొందె నెందు సవియ బిట్టీతే?..." (చందన వృక్షం నరికివేసి చెక్కగానే నొప్పిపడ్డానని సువాసనను విడిచేనా? బంగారం తెచ్చి నరికి ఒరపిడిపెట్టి కాల్చగా, చిలుముపట్టేనా? కణుపు కణుపున నరికిన చెరుకు గానుగలో నలిగి కాగి పాకమై, చక్కెర అయి నొప్పి పడ్డానుగదా అని చవిని వదిలేనా?)

రాచనగరు వదలి గిరివనాలలో తన హృదయేశ్వరుని వెదుకుతున్న అక్క విరహంతో ఉద్విగ్నురాలై ప్రకృతిని ఈవిధంగా ప్రశ్నిస్తుంది: "అళిసంకులవే, మామరవే, బెళుదింగళే, కోగిలెయే. నిమ్మనెల్లరను ఒందబేడువెను. ఎన్నొడెయ చెన్నమల్లికార్జున దేవర కండరె కరెదు తోరిరె!' (అళిసంకులమా, ఆమ్రమా, వెన్నెలా, కోకిలా, మిమ్మల్నందరినీ ఒక్కటి అడుక్కుంటాను. నా ఒడయుడు చెన్నమల్లికార్జున దేవుని చూస్తే పిలుచుకొని వచ్చి చూపండమ్మా!) మానవులను ప్రార్థించి ఫలంలేదని ముగ్ధమోహకాలైన అళిసంకులాదులను వేడిందేమో! మరొక వచనంలో ఆమె విరహోత్కంఠత నిశ్చలంగా వ్యాపించింది, మొదట అళిసంకులాదులను సంబోధించి, చెన్నమల్లికార్జుని పిల్చి చూపండి అన్నది. ఇప్పుడు ప్రతిదానిని 'నీవు చూచావా! నీవు చూచావా?" అని నిర్దిష్టంగా ప్రశ్నిస్తుంది:

"చిలిమిలి ఎందోదువ గిళిగళిరా, నీవు కాణిరె? నీవు కాణిరె? సరవెత్తి పాడువ కోగిలెగళిరా నీవు కాణిరె? నీవు కాణిరె? కొళన తడియొళాడువ హంసెగళిరా నీవు కాణిరె? నీవు కాణిరె? ఎరగిబందాడువ తుంబిగళిరా, నీవు కాణిరె? నీవు కాణిరె? గిరిగహ్వరదొళాడువ నవిలుగళిరా నీవు కాణిరె? నీవు కాణిరె? చెన్నమల్లికార్జున ఎల్లిద్దహనెందు నీవు హేళిరె, నీవు హేళిరె!" (జిలిబిలి పలుకులు పలికే చిలుకలారా, మీరు చూచారా! మీరు చూచారా? గొంతెత్తిపాడే కోకిలలారా, మీరు చూచారా? మీరు చూచారా? కొలనుగట్టులలో నడయాడే హంసలారా, మీరు చూచారా? మీరు చూచారా? ఎగిరివచ్చి ఆడే తుమ్మెదలారా. మీరు చూచారా? మీరు చూచారా? గిరిగహ్వరాలలో ఆడే నెమళ్లారా, మీరు చూచారా? మీరు చూచారా? చెన్నమల్లికార్జును డెందున్నాడన్నది మీరు చెప్పండే: మీరు చెప్పండే!)

ఇలా ఆర్తితో పలవించి పిలిచే, వేడే దేవికి అంతిమఘట్టంలో దైవ సాక్షాత్కారమౌతుంది. దానితో పొంగిన హృదయంతో, విచ్చిన మనసుతో పరమానంద భరితురాలై "హొళెవ కెంజెడెగళ మణి మకుట, ఒప్పువ సులిపల్ల, నగెమొగద కంగళ కాంతియిం ఈరేళు భువనవం బెళగువ దివ్యస్వరూపవ కండె నాను! కండెన్న కంగళ బర హింగిత్తిందు! గండర గండర ఎల్ల హెండిరాగి ఆళువ గురువను కండె నాను. జగదాదిశక్తి యొళు

# తొలుత పిదప

శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి

మును పారసీక దేశం
బున "దారా" పేరి దసి పుత్త్రుఁడు ఋజువ
ర్తనుఁడు, సరళ స్వభావుం
డనవద్యుఁడు బుద్ధిశాలి యలరుచు నుండెన్.

అతఁడు విద్యలు మొలకెత్తనట్టి చవుడు ఆభిజాత్యవాసన లేనియట్టి పువ్వు
అగును శ్రీ వెలివేసిన యట్టివాఁడు గాని సద్గుణ సంపత్తిఁ గ్రాలువాఁడు.

కులముఁబట్టి వాఁడు కొంచెపువాఁడైన గుణముఁబట్టి యయ్యె గొప్పవాఁడు.
వాని కీర్తి వల్లి ప్రాకి వీధులఁ బల్లెల్లుకొనియె దేశమెల్ల మెల్ల.

పారసీకరాజు వానిఁగూర్చి యెఱింగి పిలువనంపి తనకు కొలువొసంగెఁ;
బడయు మన్ననలను బుడమి గుణంబులె; కాదు కులము; ధనముఁ గాదు గాదె?

మెల మెల్ల నెదిగె నాతఁడు కొలువున వామనుని పోలెఁ గొనకొనెఁ దా భూ
తలపతి మంత్రిపదంబును నిలుచుకొనియె శ్లాఘ్యవృత్తి వెలయిచ్చి తగన్.

పెద్దవానిఁ జేసి పెఱసేవకులపైని శీతకన్ను వేసె క్షితివరుండు
దాన వారు వానిఁ దఱివేచి గద్దె దింపంగవలయు నంచుఁ బ్రతినఁగొనిరి.

క్షితిపతి విశ్రబ్ధుండై యతని చరిత్రంబునందు నంపెను దనకుం
బ్రతినిధిగా నేలఁగ నన్యాగమంబగు రాష్ట్రమునకు నక్కాలమునన్.

తఱిఁ జూచి రేని మనసును విఱువంగాఁ గాచియున్న పెద్దలతని డ
గ్గఱి చెవికెక్కించిరి తచ్చరితం దలక్రిందు సేసి సత్యేతరముల్.

"లంచంబుల్ తినుఁ; బన్నులెక్కువ వసూల్గావించుఁ బీడించి; చే
యించుం దద్దయు వెట్టిచాకిరినిఁ గానీ సీక; తా ర్మగు సే
యించుం జూపఁగ లెక్క; లివ్విధి నతం డెంతేని ద్రవ్యంబు నా
ర్జించెన్ భారతమంతయా నతని చారిత్రంబు వర్ణించినన్.

తనతోడం గొనిపోవు నెచ్చటికి నాతం డేఁగు నచ్చోటికిన్ కా
ధన పేటి; న్నెడఁబాసియుండఁ డెపుడున్ దానిన్ క్షణంబేని ర

లని యేకాకిగ దానినిం దెఱచి చాలా ప్రొద్దు లెక్కించు; నీ
చనవుం గైకొని చంక కెక్క నతఁడీ చందంబునన్ భూపతీ!

మీరేగి యకస్మాత్తుగ దానిని బరీక్ష సేయఁదగు నిక; మా వ్యా
పారమునఁ గల్ల నిజములు మీరలె గ్రహియింతు"రన్న చేకొని విభుఁడున్.

జనపతి యొక్కనాఁడు నడి చప్పుడు లేని నిశీథమందు నా
తని నిలయంబు సొచ్చి తన కగ్గఱఁ బెట్టిన పెట్టెనోడఁ గూ
ర్చొను నతనిం గనుంగొనఁగఁ జూచి యతండును లేచి విస్మయం
బున నెదురేగి తెచ్చెను; నృపుం డనియె న్నచట న్నిషణ్ణుఁడై.

"నీకుఁ ద్రోసిపుచ్చి నిష్ఠఁ గోశంబు రక్షించుచుంటి రేలఁ జెంత నిలిపి
యెంత మొత్తముండె నీ పెట్టెఁ జూపుడీ? అన్యథా తలంప కడిగితినని.'

అనవుడు గ్రహించి ప్రభుమతి కనఁబఱచెం దెఱచి చంపుకా పెట్టియు
తని; కత్తఱ కచ్చటికే చను దెంచిరి రాజభృత్యజను లొక్కొకరన్.

చిఁగి తూఁట్లు వడియుఁ జెదలు గొట్టుచు దుమ్ము గొట్టియున్న దుస్తొకండు
వెలికిఁ దీసి చూపి పెట్టియ బోర్లించెఁ గాని రాలకుండె గవ్వయేని.

వెఱఁగుపడి యెల్లవారలు బరికించుచునుండ నతఁడు పలికెను "రాజా!
ఎఱుఁగుదువే? దీనికతం బురాతనంబైన నాదు భూషణమిది సూ!

నను నీవు నీదు కొలువునఁ గొనకమునుపు దాల్చినట్టి కుడుతా యిది; దీ
నిని రత్న భాండమును వలె ననయముఁ గాపాడుచుంటి నానాఁటఁ గొలెన్.

తేని కొలువున తన భృత్యుని నెత్తికిఁ గళ్లువచ్చు; మనసు ద్రుళ్ళిపడును;
పెద్దదగును నోరు; హద్దు దాఁటును గాలుఁ జేలు; దీనికన్న కీడఁ కేమి?
తన తొలుతటి దశ నెవ్వఁడు మనసం బొనరించుకొనునొ మాటికి నది వా
నిని ద్రుళ్ళనీక మొట్టుచు వినయ విధేయతల కభివివృద్ధిఁ జేయున్.
ఇందుల కే దేవర! యీ యందకఁ గలపాఁతఁ బెట్టియం బెట్టితి; దై
నందినముఁ జూచుకొందును; వెందిరిగి మఱతునో పూర్వవృత్తమును వెఱన్.

ధనమింత దాఁచితివి నవి యనుమానము గలిగి మీర లఱుదెంచితిరో
యనుకొందుఁ; బరీక్షింపఁగఁ బనివడి నడిరేయి నేల వత్తురు మీరల్?

కం. పెరిగితిఁ బెద్దఁగ మీకొలు
వరినై; బహు భోగభాగ్యవంతుఁడనైతిన్
మఱవను నా ప్రథమదశన్
స్మరియింతును; దాన నాకు శాంతి లభించున్."

బులక లంకురితములయ్యెను. అతడు తన్ను బరిగ్రహించినచో మరల వేలని బంటుగా దక్కిగొనవచ్చునని యామె మురిసిపోయెను. మదనునిచేతి కీల్బొమ్మయై యామె దీపించు పెంద త్తఱంబున లజ్జ పెడత్రోవ నాతని కడ్డముగా నిలిచి, విభ్రాంతుడై యాత డడిగిన ప్రశ్నకు ఉత్తరముగాఁ దనయుదంతము నెఱింగించి, యింటికి గొనిపోయి ఆతిథ్యము గ్రహింపుమని వేడుకొనెను. కుందనమువంటి యాతని మేను మధ్యందినాతపోష్మహతిఁ గందుటయు, నొప్పులొల్కు వదనము వసివాడుటయు నామె కనంతమైన చింత కలిగించెను. ఆమె మానసమున మదనజ్వర మెంత యుత్కటముగా నుండెనో జెలిమియు సురార్చనయు జిక్కుచుండఁ, దనయాహితాగ్నితకవరోధము కలుగకుండ, నింటికేగి కర్మకలాపము తీర్పవలెనను త్వర ప్రవరుని మానసమున నంత యుద్వేగముగా నుండెను. గంధర్వాంగనయైన తనపొందు సశరీరస్వర్గ సుఖమనియు, దానిని దిరస్కరించుట సిరి రా మోకాలడ్డుట యనియు వరూధిని భావము. త్రయీ కర్మములు పాపములనియు. రతి పుణ్యమనియుఁ దలంచుట మోక్షమార్గమునకు మానవుని దూరునొనరించునని ప్రవరుని యాశయము. ఆమెకు గావలసినది తాత్కాలికము ఐంద్రియము నైన యానందము; అతనికి కావలసినది శాశ్వతము అతీంద్రియమునైన మోక్షానందము. వారిరువురికి నిట్టి భావవైరుద్ధ్య ముండుటచేతనే యాతని కామెమాటలు సిగ్గును వెగటును గలిగించెను. ఆగడామె తెల్పు భావములు కాముకుండైనవానికి రుచించునే కాని తనకు రుచింపవనియు, రేపునుమాపు హవ్యములచే దృప్తుడై వహ్ని కారుణ్యమున నొసంగు సౌఖ్యము లూహాతీతములనియు నెఱింగించి, యామె వేడికోలు విడఁబుచ్చెను. ఇటు పెద్దన శాంతి శృంగారములకు, కర్మ భోగనిష్ఠలకు, ధర్మ కామములకు, ఆత్మేంద్రియానందములకు, సనాతనాధునాతన భావములకు విచిత్రమైన సంఘర్షణము కూర్చు నొక యపూర్వ సన్నివేశము సృష్టించినాఁడు.

ప్రవరుని పల్కులు వరూధినికి గోపమును చిన్నదనమును గలిగించెను. అతిలోకసుందరియైన తాను దనంతటఁ దా వలచి యావలపు వ్యక్తము చేయుట చులకనమునకును తిరస్కారమునకును హేతువయ్యెనని యామె భావించెను. ఇంక నిల్పోపజాలక రతిసంరంభము మీఱ వైపాటున నాతనిఁ గౌఁగిలించి యధర మానించెను. ప్రవరాఖ్యుఁ డోరమోమిడి, శ్రీహరినామ స్మరణ మొనరించి, యామె యంసము లంటిపొమ్మని త్రోసివైచెను. భోగలాలసపై నిగ్రహమును, ఇంద్రియలోలతపై హృదయము ధీరతయు బొందిన విజయము నిట పెద్దన లెస్సగా సూచించుచు "కలంచునే సతుల మాయల్ ధీరచిత్తంబుల" నని యుక్తకంఠుఁడై వాక్రుచ్చెను.

త్రోపువడిన వరూధిని యూరకుండక యేడ్చుచు భూతదయార్ద్రబుద్ధి సద్గతి కారణమనియు; దయావిహీనతచేఁ జేసిన పుణ్యములు ఫలహీనము లగుననియు, దాశకన్యఁ గూడిన పరాశరాదుల కట్టి లాఘవము చేకూరలేదనియు వాదించి "నీ చదువేల చెప్పుమా" "వారికంటెను నీ మహత్త్వంబు ఘనమె" యని ప్రవరాఖ్యుని నిందించెను. ప్రవరుఁడు వరూధినిని దిరస్కరించుట దయాహీనతను భూతదయార్ద్రబుద్ధిరాహిత్యమును సూచించునా యను ప్రశ్న ధర్మసూక్ష్మమునకు సంబంధించినది. దానికి సమాధానము చెప్పవలసిన యక్కఱ ప్రవరునికిఁ దోఁపలేదు. అతఁ డేమియు బలుకక యవ్వనజగంధిమేని జవ్వాది పసకదంబించు నొడలు కడిగికొని వార్చి తన యుపాస్యుఁడైన గార్హపత్యాగ్నిని ప్రార్థించెను. అతని వేడికోలు భక్తజనప్రసన్నుఁడగు పావకుఁడు సఫలము కావించెను. తత్ప్రసాదాతిశయమునఁ బ్రవరుఁడు నిజమందిరమున కరిగి నిత్యకృత్య సత్కర్మకలాపములు నిర్వర్తించెను. తిరస్కారచింతాతాప మొకవంక, విరహతాప మింకొకవంకను జేప వరూధిని యచ్చటనే యుండిపోయెను.

పెద్దన యిచ్చట భోగలాలసతోఁ గూడిన విషయపరాయణత కవమాన తిరస్కారములును, విషయపరాఙ్ముఖమైన ధార్మిక ప్రవృత్తికి భగవదనుగ్రహమును ఫలములుగా లభించునని నిరూపించెను. దానజపాగ్నిహోత్ర పరతంత్రుఁడై పరదారధనాదులం గోరక భగవత్పాదాంబుజ ధ్యానమునఁ గాలము పుచ్చు ప్రవరునకుఁ బావకుఁడు సన్నిహితుఁడై యభీష్టార్థ ప్రాప్తి కలిగించుటయుఁ, గామాంధయై కంటికింపుగాఁ గనిపించిన యాగంతుకునిపైఁ బడఁగోరిన వరూధిని విఫలమనోరథయై విలపించవలసి వచ్చుటయు నిందుకు నిదర్శనములు.

అంతకుమును పే యనంగ విద్యా పారగుఁడైన గంధర్వకుమారుఁడొకఁడు వరూధిని విలాసముల నారసి

త్వము మెయిం జూపెదైనా నత్తతిన్" అనుటచే స్త్రీకి యందుగూడ నీయభిప్రాయమే గర్భితమైయున్నది.

స్వరోచి మొదట మనోరమను తరువాత విభావసీ కళావతులను వివాహమాడి యామువ్వురితో వివిధ విహారము లొనరించుచుండెను. విషయలోలత్వమందతఁడు తల్లిదండ్రుల కెవరికిం దీసిపోవువాఁడు కాఁడు. సమాగమసమయమున సమాధిని పొందిన ప్రవనాఖ్య భావనచే నామెకు జనించిన యీ కుమారుని గర్భమందనీకుములైన సుగుణములు పెక్కులవశించిన భోగలాలస వదలినది కాదు. చక్రవాకీ హంసల సంభాషణము నాలించి యాతఁడు తలవాంచి కొంతవడి యుస్సురని మదిం దలపోసి సురలలనాతతులతో సౌఖ్యమనుభవింప నెంచలిడెను. అతని కొకనాఁడు మిచుం బ్రాయపు లేడి పిండు వెంటరా వనభూమిం జరించు నొకహరిణోత్తంసము కానఁబడెను. లేడిపిండు తన చెవుల వాల్కన్నులు పోల మెచ్చి వియోత్తి స్త్రీయు నాననము మూర్కొనుచు సల్లాపసుమంత నాహరిణంబు హుంకారమొనరించి "వేగలఁడె యోహో నేను స్వారోచినె పంకేజాక్షులతోడ నెల్లప్పుడు దర్పస్ఫూర్తి క్రీడిసప్రజ్ఞాంకూరం బణఁగించినారు. తలపోయు వాని దోఁతిసెవ్య మీరింకం బోయి వరింపుఁ డొక్కనిని భోగేచ్ఛ వారించితిన్.

"బరువడి నింతుల దనకుఁ
బల్వురఁ గూర్చుట భోగవాంఛ గా
కరయఁగ నొండు గాదు, తన
మున్న ప్రభుత్వంబు సంగనా జనో
త్కర సముపార్జితం బటులు
గావున వీనికి లేదిహంబు నం
బరమును నన్నట్లు పలు
పంబని లేడిది సెప్పె నేఁటికిన్

"వీని వినంబున వనితాధీనుఁడై పెంపు దక్కి తిరుగుచునుండఁగా నే వట్టి తమకము మానితినం' డని వానిని నిరసించెను. ఆ మాటలు విన్న స్వరోచికి వనితాసంగము వర్జింపవలయునను తలంపు పొడమించెను, కాని యది స్థిరమైనది కామిచే నాతఁడు దుర్వారములైన కోరికలకు బానిసయై వివేకము తక్కి సురల నాసెలంతలతో నాటినాటి విహారపములు విహరించి వారియందు సంతానముఁ బడసెను. ఈ ఘట్టమున స్వరోచి మితిమీఱిన విషయలోలతచేఁ దివ్యకులకుఁ గూడఁ బరిహాసపాత్రుఁడయ్యెను. అతి మాత్రమైన విషయాసక్తి యెంతకన్న నుత్తమఫలము నెట్లు చేకూర్పఁజాలును?

పిమ్మట స్వరోచి మృగీరూపమున నుండిన వనదేవతను కరుణార్ద్రచిత్తుఁడై కౌఁగిలించి యంగనగా మాఱిన యామెయందు శౌర్యగుణాఢ్యుఁడు, తేజోనిధి, మానఘనుఁడు సామ్రాజ్యైక హేతు ప్రభూతాంచల్లక్షణ లక్షితుఁడు, గుణరత్నాకర రత్నాకరుఁడునైన కుమారవరునిఁ గాంచెను. సమాధిని ప్రసరించిన యతిలోకమైన యనురాగ వైరాగ్యము, సమాధానపరమున వహించిన ప్రశాంత భావన, స్వరోచికిఁ గలిగిన వనదేవతాసంపర్కము అట్టి కుమారరత్నము జననమునకుఁ గారణము లయ్యెను. పితృపితామహులనుండి పరంపరగా నాతనికిఁ జెక్కు గుణగణములను పాటించుచు కౌలుష్యము ప్రాపించి యుండెను గదా! శాంతి దాంతి దయా సత్య శౌచనిరతుఁడైన యాతఁడు తపముచే నపమానరించి, ప్రక్షాళితసకలపాపుఁడై విష్ణువు వరలాభము నందుటయే కాక మనువర్యుఁడై యనన్యసామాన్యమైన యున్నతిని బడయఁజాలెను. సాత్త్వికమైన తపోవిశేషము సర్వపాపతాపోపశమనమునకు నెట్టి నబ్బురమేమున్నది? తల్లిదండ్రుల పుణ్యపాపముల ఫలములు, గుణాగుణముల ప్రభావమును, తనయుల విశేషాంశములుగ నెఱుకు ప్రసరించుననియుఁ గులమున జనించి లోకోత్తరగుణశాలియైన యొకఁడు వరిమ తమన్న పూర్వాపరవంశీయుల నెల్లఁ దరింపఁ జేయుననియు నీకథ సూచించుచున్నది

కళావతి స్వరోచికిఁ దన జననవృత్తాంత మెఱిఁగించు సందర్భమునఁ బౌరాణికకథకుఁ బ్రసక్తి కల్గినది. అతఁడు దండ్రము నిలమోపి పంచాగ్ని మధ్యమున ముకుంద చరణధ్యానావధానమున మెఁ దప మాచరించుచుండ నింద్రుఁడు భీతాత్ముఁడై యతనికి దపపుంజికస్థలయను నచ్చరను బంపెను. ఆమెయుఁ బతిశాసనమున నయ్యెడకేగి పూపులు కోయునట్లు నటించుచుఁ జెలువొనపట్టిన యనంగుని మోహనబాణమో యన నామునికిఁ గన్పట్టెను. అతఁడామె సౌందర్యము గాంచి పంచశరకాండవిఖండిత ధైర్యసారుఁడై జపతపములను దమ్ము మఱచి కందర్పకేళిం దేలెను. కొంత కాలమున కామె గర్భవతియై యొకయాఁడు శిశువును

# అంతా దొంగలే!

శ్రీ సర్వేపల్లి రామారావు

[ఏప్రిల్ సంచిక తరువాయి]

## మూడవ అంకం

[మొదటి రెండు అంకముల మాదిరి స్థలం]

సుందరమ్మ: కూర్చోండమ్మా!

సుబ్బువరసమ్మ: ఉండనా, పోనా? ఏం చేస్తే బాగుంటుంది?

సుం: కూర్చోండి తల్లీ. మీరు పోతే రజనమ్మ నా మీద కోప్పడుతుంది.

సుబ్బు: అసలు నేను వచ్చింది రజనితో మాట్లాడాలనే. చాలా ముఖ్యమైన విషయం. ఎవరినో భోజనానికి పిలచేరన్నారే ఎవర్ని?

సుంద: ఎవరూ లేదమ్మా, కుటుంబయ్యగారు.

సుబ్బు: [దగ్గరకు వచ్చి] ఎట్లా! ఇప్పుడు కుటుంబయ్య ఇక్కడికి తరచుగా వస్తున్నాడన్నమాట.

సుంద: వస్తూ న్నారు.

సుబ్బు: ఎం చేత?

సుంద: మిల్లు వ్యవహారం కోసం. మీరుండండమ్మా.

సుబ్బు: వాళ్ళతో వ్యవహారాలు మాట్లాడుతుంటే నే నెందుకూ అడ్డం. మళ్లీ వస్తాను.

సుంద: తప్పకుండా రావాలి తల్లీ.

సుబ్బు: తప్పకుండా. వాళ్లెవరైన బయట వెడితే వెళ్లనీ. రజనికి మాత్రం నేను వస్తానని చెప్పు. ఆమెను బాగ ఆలోచించమను. ఆమె తండ్రి మరణించడం నా తప్పా? మా అబ్బాయి — నేను చెప్పేది మీకు అర్థం అవుతుంది కదూ?

సుంద: బాగా అవుతుందమ్మా. అయితే ఈ విషయం బిడ్డతో నేను చెప్పలేను. మీరే చెప్పండి.

సుబ్బు: [పిలుపుగంట వినబడుతుంది] అదుగో మిమ్మల్ని పిలుస్తున్నారు. నేను వస్తాను. [వెళుతుంది]

సుంద: తాటికి ముందు.

[కుటుంబయ్య చెయ్యి పట్టుకొని విజయలక్ష్మి ప్రవేశిస్తుంది. వెనుక సీతమ్మ, శ్యామల, రజని వస్తారు. సుందరమ్మ వెళ్ళిపోతుంది.]

కుటుంబయ్య: [విజయలక్ష్మితో] అబ్బ! భోజనం చాలా ఎక్కువ అయింది. కొంచెం పట్టుకో నీకు పుణ్యముంటుంది. [విజయ చేయివదలి దూరంగా పోతుంది.]

కుటుం: [ఆమె దగ్గరకు వెళుతూను] మీ తోబుట్టువులు అందమయిన పిల్లలు. మీ రజనీ భారీ అయిన పిల్ల. పిల్లల నాణెం నాకు తెలియకపోలేదు. అయితే అందరిలో నీవే ఫస్టు.

విజయ: మా అమ్మగారితో మాట్లాడండి.

కుటుం: సీతమ్మగారూ, ప్రేమ్ కుమార్ ఎందుకు భోజనానికి రాలేదు?

సీతమ్మ: ఊర్లో లేడు. వాడేదో మిలటరీలో చేరాలని వెళ్ళాడు. నా మటుకు వాళ్ళనాన్న స్థాపించే మిల్లులో చేరిపించాలని వుంది.

కుటుం: ఏం చేస్తాడు మిలటరీలోకి చేరక. [సీతమ్మతో] మీరు శ్రీనివాసన్ని చూచారా?

సీతమ్మ: చూడలేదు. చూడనుంటారా?

కుటుం: [ఏమి చెప్పడానికీ తోచక జవాబు చెప్పడు. విజయవైపు తిరిగి] నీవు, సీతమ్మగారు, మీ అక్కచెల్లెళ్లు మా ఇంటికొకమారు రండి. మీరేం చిన్నపిల్లలు కారు రేపయో పూలమొక్కలు నెదిమేయడానికి. మధ్యాహ్నం భోం చేసి బయలుదేరారంటే సాయంత్రం భోజనానికి మళ్ళీ ఇంటికి చేరుకోవచ్చు. మీకిప్పుడు ఏమీ పనులు లేవుగా. ఇదైనా ఒక వినోదంగా వుంటుంది.

సీతమ్మ: మేము ఎక్కడికి రావాలండి! ఈ అప్పుల వాళ్ళబాధ ఎక్కువగా వుంది.

కుటుం: పనుంటే మీరువెళ్ళి చూసుకోండి. నేను మీ అమ్మాయితో పిచ్చాపాటీ మాట్లాడుతాను.

సీతమ్మ: మీ ఇష్టం వచ్చినంతసేపు వుండండి. (విజయ వద్దకు వెళ్ళి) కుటుంబయ్యగారితో మాట్లాడావటమ్మా?

విజయ: ఇంకా లేదు.

సీతమ్మ: ఏం ఇష్టంలేదా?

విజయ: పన్నెండువేల రూపాయలు ఎలా అడగను?

సీతమ్మ: అయితే అడగవద్దులే.

విజయ: ఆ సేటుగాడు జప్తీ చేస్తే ఏం చెయ్యను? ఆ బట్టలదుకాణంవాడు మాత్రం....

సీతమ్మ : నే వస్తుంటాను తల్లీ. నీకేందుకు కంగారు?

విజయ : ఇదే ధైర్యం చేయవలసిన సమయం. నే చేస్తాను.

కుటుం : (శ్యామల ప్రక్కగా సోఫాలో కూర్చొని) మీరు అక్క చెల్లెలు అన్యోన్యంగా వుంటారు కదూ ?

శ్యామ : చాలా.

కుటుం : మీ ఇద్దరిలోను ఎవరు తెలివైనవాళ్లు.

శ్యామ : విజ్జి.

కుటుం : (విజయవైపు చూస్తూ) ఆమెను పెళ్ళి చేయరూ ?

శ్యామల : ఇంకా ఏమీ అనుకోలేదు.

కుటుం : అందమయిన పిల్ల కదూ ?

శ్యామల : మహా ! ! !

కుటుం : నిజం. ఈ కాలంపిల్లలు మాదిరి పెన్సిల్ లాగ వుండదు. పీనుగులాగ వుండదు. పొడుగు కాదు, పొట్టి కాదు. మంచి గడుసుతనం కూడా వుంది.

శ్యామల : దాన్ని చూస్తే హడలు.

కుటుం : ఖర్చు మనిషా ?

శ్యామల : డబ్బు విషయంలో అతి జాగ్రత్తగా ఉంటుంది.

కుటుం : ముసలివాళ్ళ విషయంలో, జబ్బువాళ్ళ విషయంలో దయగా వుంటుందా ?

శ్యామల : మిక్కిలి దయగా వుంటుంది.

కుటుం : నమ్మకమయిన మనిషేనా ?

శ్యామల : [ఎగా దిగా చూస్తుంది, ఆశ్చర్యంతో కోపంతో చూస్తుంది.]

కుటుం : [లేచి] శ్యామలమ్మ మీ అక్క దగ్గరకు పో అమ్మా. మాడు [రజనివైపు చూపించి] రజని అలా కొంపమునిగినట్లు కూర్చొంది ?

విజయ : [కుటుంబయ్యదగ్గరకు వస్తుంది. ఆయన ఆమె వద్దకు వస్తాడు. ఇద్దరూ స్టేజిముందుకు వస్తారు.]

కుటుం : ఏం అమ్మాయి నీ చేతిలో వుంటేది ?

విజయ : ఖాళ్ళ గండి.

కుటుం : ఎందుకు ?

విజయ : మాకు జేబులు లేవు చూడండి.

కుటుం : అవు నవును.

విజయ : కుటుంబయ్యగారూ, మా అమ్మ మిమ్మల్ని అడగమందండి.

కుటుం : ఏమిటి ?

విజయ : బాకీవాళ్ళంతా ఒక టయినట్టుంది. ఇదివరకు ఎన్నాళ్ళయినా అడిగేవాళ్ళు కారు. ఇప్పుడు ఊపిరి సలపనీయడం లేదు. నాకు ముందంటే నాకని ...

కుటుం : రావలసినవాళ్ళకి అడగడం తప్పా ?

విజయ : సామ్మువుంటే గదండీ ? ఉంటే ఇన్ని మాటలు తిస్తుకుంటామా ? పెద్ద మొత్తం కూడా. పన్నెండు వేలు కావాలి. మీరు దాన్ని జతపరిస్తే ఈ సన్న కారు పోరు తీరిపోతుంది. [జవాబు లేదు.]

కుటుం : లాయరుగార్ని చూశారా ?

విజయ : ఆయన ఎందుకండీ?

కుటుం : మీరు నాకు ఇరవై వేలు ఇవ్వాలి. మళ్ళీ ఈ పన్నెండు వేలు అయితే ముప్పయిరెండు వేలవుతుంది. నేను మీకు ఇచ్చింది ఎక్కడికీ పోదనుకోండి. వసూలు చేయడానికి తగు చర్యలు తీసుకొంటూ నే వుంటున్నాను. [అని సీతమ్మదగ్గరకు వెళ్ళి] మీ రెండవ అమ్మాయిగారు చెప్పారు మీకు పన్నెండు వేలు కావాలని. తీసుకురావడానికి వెళుతున్నాను. [వెళ్ళుతాడు]

సీతమ్మ : [విజయతో] నా తల్లీ! ఇలా రా. వెనవడబ్బు అడగవద్దు లే అనుకున్నా.

విజయ : అడిగాను లే అమ్మా. [శ్యామల వెళ్ళి పోతుంది.]

సీతమ్మ : శ్యామలా! ఎక్కడికి వెళుతున్నావు?

శ్యామల : నాకు నిద్రవస్తూంది.

సీతమ్మ : కూర్చో.

శ్యామల : పోతానమ్మా

సీతమ్మ : కూర్చో. [పోబోయ్యే శ్యామల వాళ్ళ తల్లి దగ్గరకు వస్తుంది] మనస్థితి ఏమిటి? నీవు నిద్రపోవడం ఏమిటి?

శ్యామల : 'పాడింది పాడరా పాచిపళ్ల దాసరీ" అని ఏం ఉపయోగం? నీచేతగాదమ్మా వ్యవహారాలు చక్కబరచను.

సీతమ్మ : నా చేత కాకపోతే నీవు చేయకూడదూ చూద్దాం.

శ్యామల : నేనా? బాబోయి!!!

సీతమ్మ : కూర్చో శ్యామలా, మనం ఏం చెయ్యాలో కొంచెం చెప్పు.

శ్యామల : మనం దణ్ణంపెట్టి ఊరుకోవాలి. ఇది నా అభిప్రాయం.

సీతమ్మ : వాళ్ళు మనల్ని దోచుకుంటుంటే...

శ్యామల : మనమేమి చేయగలం! అంతా వాళ్ళు అమ్మి పారేసే మిగిలింది మనకవుతుంది. పాతపీడ వదలితే కొత్త సుఖంగా వుండవచ్చు.

సీతమ్మ: ముందు నీ వరించి నీకేమీ భయంలేదన్న మాట?

శ్యామల: లేదు. పాపం రజనీ పెళ్ళి కాదేమో!

సీతమ్మ: ఎందుకట్లా అపశకునం పలుకుతావు?

విజయ: ఎవరన్నారా మాట?

శ్యామల: అందరూ. నేను కనుకయితే ఈ వెధవ పెళ్ళి నాకు వద్దనేద్దును.

సీతమ్మ: నువ్వూరుకోవే శ్యామలగా తయారౌతున్నావు. నన్ను చివాట్లు పెట్టావు ఇప్పుడు అక్కయ్యను అంటున్నావు. చూడు, రజనీ ఏడుస్తూంది.

శ్యామల: [రజనీ దగ్గరకుపోయి] నామీద కోపమా అక్కయ్యా?

రజని. [కళ్లు తుడుచుకొంటూ] లేదు. నీవు గిరిగారిని తెలియక అంటున్నావు వాళ్ళతల్లి ఎంతచెప్పినా ఆయన వినేవారు కారు. నా పెళ్ళికి ఒప్పుకొంటే ఆమెకే మంచిది.

సీతమ్మ: ఇదేం పాపమే పిల్లల్లారా? నేను ఏమి చెప్పినా కాదంటారు. మీరు చెప్పరు. చూడండి. మనలాయన్ని చూరిస్తే బాగుంటుందా?

విజయ: ఎవర్ని ఏర్పాటు చేసుకుందాం?

సీతమ్మ: మరెవర్నయినా. సుబ్బమ్మ చెప్పింది; ఆయన పేరు ఎక్కడ పెట్టానో. ఆమె ఇచ్చిన అడ్రెస్సు డ్రాయరులో చూడు శ్యామలా? విజయా, నీవు చూడమ్మా బీరువామీద పెట్టానా? నీవు చూడు రజనీ. [ఎవరూ పలకరు] ఇదిగో నా బ్యాగులో వుంది. [అని తీస్తుంది. చదువుతుంది] భావనారాయణరావుగారు. [శ్యామల వైపు చూచి] ఎందుకే నవ్వుతున్నావు?

శ్యామల: మన బ్రతుకంతా వెతుకులాటతో సరిపోతుంది.

సీతమ్మ: నీవేమో నన్ను చంపేదాకా వదలవులే. సుఖపడుదువుగాని లే అవతల.

శ్యామల: [దగ్గరకుపోయి] లేదులే అమ్మ బంగారు కదూ! మంచిదానివే [అమ్మను ముద్దు పెట్టుకుంటుంది. రజని, విజయ, అమ్మదగ్గరకు పోతారు ఓదార్చడానికి.]

అప్పన్న: [ప్రవేశించి] లాయరుగారు వచ్చారమ్మా. [అని వెళతాడు.]

శ్యామల: నేను పోతాను—

సీతమ్మ: మీరందరూ వెళ్ళి పండుకోండమ్మా. ఫరవా లేదు.

శ్రీనివాసన్: [ప్రవేశిస్తూ] నే చెప్పింది మీకేమీ చెవి కెక్కడం లేదని రావడం మానేశా. నేను చెప్పబొయ్యే చెడువార్తకు నన్నేమీ అనకండి.

సీతమ్మ: ఫరవా లేదు. మీరు అనేకదా తెస్తున్నారు.

శ్రీనివాసన్: ఈపరిస్థితులలో మీకు ఓర్పుఅత్యవసరం.

సీతమ్మ: లాయరుగారూ, మావల్ల మీకు శ్రమకలుగుతుందిగాని ఒక నయాపైసాకూడా లాభంలేదు. మీరు కూర్చోండి. మంచాయన ఇంకొకరు వున్నారు.

శ్రీనివాసన్: మహారాజుగా! నాకు ముందుగా చెప్పి పంపివుంటే ఈ రావడం తప్పిపొయ్యేదిలెండి. పోనీలెండి. మీ కాయితాలుఅంతా తీసికెళ్ళండి.

సీతమ్మ: ఇంకా ఆయనతో మాటలాడండి. అట్టే తొందరలేదు.

శ్రీనివాసన్: తొందరకేం. మంచివాడు, కలిమైన వాడు, అందమయినవాడు అంటున్నారు. వాణ్ణే వుంచుకోండి. తప్పకుండా... ఎవరాయన?

సీతమ్మ: భావనారాయణగారు...

శ్రీనివాసన్: శభాష్! తగినవాణ్ణే చూశారు. వాడి సన్నదు రద్దుచేశారు క్లయింటు డబ్బు కొట్టివేశాడని.

సీతమ్మ: క్షమించండి. శ్రీనివాసన్ గారు మీరే వుండండి.

శ్రీని: [చేతిలోకి కాగితాలు చూస్తూ] మీకు భావనారాయణగారే ఉండాలమ్మా. మీ కాగితాలు చూస్తూవుంటే గడువుతీరే తనఖా అరవై వేలది ఒకటి కనుపించింది.

సీతమ్మ: ఏం చెయ్యమంటారు?

శ్రీని: అదే మిమ్మల్ని అడగాలని వచ్చేను. మీరు, ఇల్లు అమ్మవద్దన్నారు. కుటుంబయ్యగారు, మిల్లు వేలానికి తెమ్మని నాకు కబురు చేశారు.

సీతమ్మ: కుటుంబయ్యగారా? అబద్ధం.

శ్రీని: అయితే ఈ వుత్తరం చిత్తగించండి. (జేబులోనుంచి వుత్తరం తీసి ఇస్తాడు.)

సీతమ్మ: ఉత్తరం నావద్దనే వుంచి వెళ్ళండి.

శ్రీని: మా కాగితాల్లో వుండాలి.

సీతమ్మ: కుటుంబయ్యగారూ, నిశ్చయాన్ని మార్చుకోకపోతే మీకు ఇస్తానులెండి. (శ్రీనివాసన్ వుత్తరం ఇస్తాడు.)

సీతమ్మ: మీకు తెలియదా కుటుంబయ్యగారు మా ఇంటికి తరుచుగా వస్తూన్నారని?

శ్రీని : అలాగా?

సీతమ్మ: మా అమ్మాయిలంటే ఆయనకు మిక్కిలి అపేక్షగా వుంది.

శ్రీని : రొట్టె విరిగి నేతిలో పడిందన్నమాట.

సీతమ్మ: మా ఇంట్లో భోజనంకూడా చేస్తూన్నారు.

శ్రీని : దానిలో వింత ఏమిలేదు కాని, ఒక వేళ మీరు ఆయన ఇంట్లో భోజనంచేస్తే మట్టుకు కొంత ఆశ్చర్యంగా వుండేది.

సీతమ్మ: మా పరిస్థితులు క్షేమ మనవి చేసుకొంటే వారు మాకు పెద్ద మొత్తంకూడా ఇస్తామన్నారు.

శ్రీని : కావాలంటే నే నివ్వనా అమ్మా మీకా సొమ్ము? ఈ తుయ్యాభై వేలు ఇల్లుకట్టడానికంటే నాకు ఇబ్బంది కాని పగులు ఇరవై వేలు నకొక లెక్కా?

సీతమ్మ: మిమ్మల్ని అపార్థం చేసుకొన్నదానికి వెయ్యి క్షమాపణలు. నాకేమీ తెలియదు బాబూ. మూల కూర్చుని ఏడ్వవలసినదాన్ని. విలువలేక వ్యవహారాలలో చిక్కుకున్నా.

శ్రీని : (ఆమెవద్దకు వెళ్ళి) నేను ప్రయత్నిస్తాను. కుటుంబయ్యగారితో చెప్పి మిల్లు అమ్మడానికి లేవద్దని. అయితే ఒక్క షరతుమీద మీరు కట్టే ఇల్లు మాత్రం అమ్మకతప్పదు. (సీతమ్మ కోపంగా చూస్తుంది) నేను మీ మంచికే చెబుతున్నా నన్నమాట. మీకు ఒక్కదానిలో సహాయం చేసినదానికి ప్రతిఫలంగా మీరు మరొకదానిలో నన్ను ఇరికించకూడదని గ్రహించాలి. (జవాబులేదు. అప్పన్న ప్రవేశిస్తాడు.)

అప్పన్న: నటేశంగారు వచ్చారమ్మా.

సీతమ్మ: [లేచి] రమ్మను [శ్రీనివాసన్‌తో] మీరు నటేశంగారితో ఒక్కక్షణం వుండండి. నేను ఈ విషయం మా పిల్లలను అడిగివస్తాను.

శ్రీని : అలాగేలెండి. [సీతమ్మ ఎడమవైపునుంచి వెళ్ళిపోతుంది.]

నటే : [ప్రవేశించి] నమస్కారం శ్రీనివాసన్ గారూ.

శ్రీని : ఎలా వున్నావోయ్?

నటే : మీరు సీతమ్మగారి కోసం కాచుకొన్నారా?

శ్రీని : ఒకరు నాకోసం కాచుకొంటారోయి. అయితే సీతమ్మగారి సంసారం మోతుబరులు కాబట్టి నేనే వస్తాను. సంగీతం చెబుతున్నావటోయి?

నటే : శ్యామలమ్మ వారి నాన్నగారు చనిపోయేటప్పటినుంచి మానేసిందండి.

శ్రీని : వారి పరిస్థితులేమీ బాగా లేవు. వారు చెప్పించ లేరనుకుంటాను.

నటే : అలాగా?

శ్రీని : అవును.

నటే : కాంతారావుగారు, కోటేశ్వగారు లనేవాళ్ళు.

శ్రీని : చాలా డబ్బు సంపాయించారు కాని—

నటే : దుర్వ్యయం చేయలేదనుకొంటాను.

శ్రీని : ఎక్కువ లాభంకోసం వ్యాపారంలో పడేశారు. పాపం చేసే దానికంటె అదే ప్రమాదం కదూ?

నటే : గొప్ప ఆస్తి పెట్టి పోతారనుకొన్నా.

శ్రీని : వాళ్ళకు తిండానికి తిండివుంటే అది సార్థకమే అనుకోవాలి.

నటే : ఆశ్చర్యం. బండ్లోడలు అవుతయి; ఓడలు బండ్లు అవుతాయి.

శ్రీని : ఎవరితో అనబోకు. [ఇద్దరు కొంతసేపు మాటలాడరు].

నటే : వీళ్ళేమంటారు?

శ్రీని : ఇంకే దారేముంది? ఏడవవలసిందే.

నటే : అంతేనా. తెలియదండి. నేను అర్జంటుగా వెళ్ళానని సీతమ్మగారితో చెప్పండి.

శ్రీని : మళ్ళీ వస్తావుకదా?

నటే : దేవుడెరుగు

శ్రీని : సీతమ్మగారిని పరామర్శించవా? కొంచెం ఓదార్చరాదూ.

నటే : నామాటలవల్ల ఏడుపు జాస్తి అవుతుందేమో. మీరంటే లాయరుగారు. పొంకంగా చెప్పి నాను. ఓదారుస్తారు. అయితే వారు సంగీతం చెప్పుకోరన్నమాట?

శ్రీని : లేదు.

నటే : అయితే నాకు సెలవు. [వెనుకనుంచి వెళ్ళిపోతాడు]

సీతమ్మ: [ప్రవేశించి] నటేశం వెళ్ళిపోయాడా?

శ్రీని : నన్ను చూచి. మీరంతా పనిమీదవున్నారు. మరి నేను ఎందుకూ మళ్ళీ వస్తానని వెళ్ళాడు.

సీతమ్మ: పిల్లలు ఆయన్ని లేక రమ్మన్నారే?

# అంతా దొంగలే!

శ్రీని: వెళ్ళినవాడు ఎలాగూ వెళ్ళాడు. మరి పిల్లలేం చెప్పారమ్మా?

సీతమ్మ: ఏమీ అనలేదు. కుటుంబయ్యగారిని చూసింది ఏమీ చెప్పరట.

శ్రీని: ఆయన ఏమి చేస్తాడంటారు?

సీతమ్మ: ఆయన ఇల్లు అమ్మించాలని శాయశక్తుల ప్రయత్నిస్తున్నాడు. సూటిగా, ఆయన్నే అడుగుదాము, మమ్మల్ని ఎందుకు నాశనం చేస్తారని.

శ్రీని: ఆ ధోరణిలో మాట్లాడితే అసలుకే మోసం.

సీతమ్మ: నేను మాట్లాడను లెండి. మొదటిసారే మేం దెబ్బలాడాం కదూ? మాట్లాడితే మళ్ళీ అదేపని అవుతుంది. విజయమ్మ పట్టుదలతో వ్యవహారం నడుపుతానంటున్నది

శ్రీని: ఎంతకాలం బ్రతుకుతాడు ఆయన ఎలాగయినా? అమ్మాయి ఆయన్ని పెండ్లాడింది అంటే ఆ ఆస్తి అంతా మనకే దక్కుతుంది. కొంచెం ఆలోచించండి?

సీతమ్మ: చిరకాలం బ్రతుకనీ ఆయన్ని. ఎవడిక్కావాలి ఆయన ఆస్తి? మాది మాకు దక్కితే చాలు. మాకు ఇవ్వవలసింది ఇస్తే అదే పదివేలు.

శ్రీని: మీతో మాట్లాడితే ఏం లాభం లేదు. బ్రతుక లేని వాళ్ళు.

సుంద: [ప్రవేశించి] కుటుంబయ్యగారు వచ్చారమ్మా.

సీతమ్మ: కొంచెం ఉండు సుందరమ్మా. [శ్రీనివాసన్ వైపు చూచి] మీరు ఉండాలి.

శ్రీని: ఉండాలా?

సీతమ్మ: [సుందరమ్మతో కుటుంబయ్యను పిలుచుకు రమ్మని సంజ్ఞ చేసి శ్రీనివాసన్‌తో] విజయను పంపుతాను [వెళ్తుంది. సుందరమ్మ వెళ్తుంది. కుటుంబయ్య ప్రవేశిస్తాడు.]

శ్రీని: ఏం కుటుంబయ్యగారూ ఇక్కడికి వచ్చారేం?

కుటుం: రాకూడదా?

శ్రీని: మీరిక్కడ మకాం వేస్తున్నారని ఊరంతా అంటున్నారు.

కుటుం: అనుకోనివ్వండి. దానివల్ల మనకేం నష్టం.

శ్రీని: మీకేం? పెద్ద నాటకం ఆడుతున్నారే? ఒక ప్రక్క వీళ్ళమీద వ్యవహారం నడిపించమంటున్నారు. మరో ప్రక్క వారితో సరససల్లాపాలు సాగిస్తున్నారు. నాకేం బోధపడటం లేదు.

కుటుం: లాయరుగారూ, నా వినోదాలు నావి. వాటితో మీకేమి అవసరం లేదు. మీ పని మీరు జరిపించాలి.

శ్రీని: విజయమ్మ చేతిలో మీరు ఆట బొమ్మ అయ్యారటగా?

కుటుం: ఎవరు చెప్పారు?

శ్రీని: వాళ్ళ తల్లి చెప్పింది.

కుటుం: అధిక ప్రసంగం.

శ్రీని: వీళ్ళంతా ఏదో కుట్ర పన్నుతున్నారు జాగ్రత్తసుమండీ.

కుటుం: ఈ కుటుంబయ్య ఏమంత అమాయకుడా? తమరింక దయ చేయండి.

శ్రీని: చిత్తం [మరల దగ్గరకు వచ్చి] ఇల్లు అమ్మకం విషయం మరి సాగిస్తున్నారన్నమాట.

కుటుం: తప్పకుండా [శ్రీనివాసన్ వెళ్ళిపోతాడు.]

కుటుం: లాయరుగారూ! [శ్రీనివాసన్ వెనకకు వస్తాడు. నేను, పుల్లమ్మ మాట్లాడిన విషయం, మీతో చెప్పానా? వాడు ఇంకా ఇల్లు కడుతున్నాడు. వాడితో మంచిగా వుంటే మనకు దేనికయినా మంచిది.

శ్రీని: మళ్ళీ వాడితో లావాదేవి పెట్టేరన్నమాట. నోటికొచ్చినట్లు మాట్లాడాను వెనక.

కుటుం: మీరు ఇంకా ఉద్రేకంగా వున్నారన్నమాట. ఏమిటండీ, అంత పంతం అయితే పనులు ఎలా జరుగుతాయి.

శ్రీని: మీ అభిప్రాయాలు మీవి. నేను మీతో ఇల్లు అమ్మకం చేయిస్తానని వాగ్దానం చేశాను. అది మాత్రం చేస్తాను. ఇతర విషయాలతో నాకేమి నిమిత్తం లేదు. [విజయ ప్రవేశిస్తుంది. దగ్గరకు పోయి] కుటుంబయ్యగారిని మీరే ఒప్పించాలి. నా వల్ల అయ్యేలా లేదు. మీకు సాధ్యమవుతుందేమో చూడండి. [వెళ్ళుతాడు.]

కుటుం: [విజయదగ్గరకు పోయి లెదర్ బ్యాగ్ లోంచి నోట్లకట్టలు తీసి] సొమ్ము ఇదిగో. అప్పుల వాళ్ళతో జాగ్రత్త సాధ్యమైనంత వరకు తోసివేతకు చేరమాకు. ఇచ్చిన వాళ్ళకే మళ్ళీ ఇస్తేవు సుమా. [విజయ వెళ్ళబోతుంది] సొమ్ముకు రసీదు?

విజయ: అవతల ఇస్తాను.

కుటుం: సొమ్ము, రసీదు, నీ చేతిలో సొమ్ము, నా చేతిలో రసీదు, ఒకసారి పడాలి. [ఆమె మేజాదగ్గరకు వెళ్ళి, వ్రాసి తెచ్చి ఇస్తుంది. ఇద్దరూ పలకరు

కొన్ని క్షణాలు] ఏదో చెప్పాలని వుంది. నీకు లేదూ అలా?

విజయ: ఏ విషయంలో?

కుటుం: ఇప్పటి పరిస్థితిలో మీకు ఇంత పెద్ద ఇల్లు అనవసరం. వచ్చిన వాళ్ళకంతా పీటలు, భోజనాలు పెడుతుంటే వీధిలో పడవలసి వస్తుందని తెలుసా?

విజయ: ఈ విషయంగానే మా బంధువు ఒకాయన, వాళ్ళ గ్రామానికి రమ్మని తొందర చేస్తున్నాడు.

కుటుం: ఈ ఔదార్యం నిజం అనుకోకండి. మీరు రారని చేసే మర్యాద, వెడితే నిజం బయట పడుతుంది.

విజయ: అయితే ఇక్కడే వుంటాము.

కుటుం: వుండి ఏం చేస్తారు అంట?

విజయ: అవసరం వస్తే మా శ్యామల సంగీతపు పాఠాలు చెబుతుందట.

కుటుం: చెవిటి మిగత అందరికి ఆమె ఎందుకు పెట్టాలి ఊరికే కూర్చోబెట్టి?

విజయ: నేను కూడా ఏదో పనిలో చేరాలనుకొంటున్నా.

కుటుంబ: నిజంగానా? ఏం పని? ఏం పని?

విజయ. ఇంకా నేనేమి అనుకోలేదు.

కుటుం: దాని విషయమే నేను నీతో మాట్లాడాలి. [నీళ్లు నములుతూ] నాదగ్గర చేరరాదూ. మా ఇంట్లో నే వుంటువు గాని

విజయ: [ఏమి చెప్పడానికి తోచదు. చికాకు పడుతుంది.] మా తల్లిగారు ఒప్పుకోరండి. మా వారి నంతా ఎలా విడచి వుండేది?

కుటుం: అలా అంటావేమిటి, విజయలక్ష్మీ? ఈడు వచ్చిన పిల్లవు నీదారి నీది వాళ్ళదారి వాళ్ళది కదూ?

విజయ: నేనలా అనుకోనండి

కుటుం: మునిగే పడవలోంచి తప్పించుకోవడం తప్పా? నీళ్ళలో పడిచావడం మంచిదా? ఏం చెప్పవూ?

విజయ: మా పడవ మునగడం లేదండీ. [కొంతసేపు ఎవరూ పలుకరు]

కుటుం: నేను తరచుగా ఇక్కడికి రావడం ఎందుకో తెలుసా?

విజయ: నాకు తెలియదు.

కుటుం: మీ వారి కోసం నన్ను బలి చెయ్యాలనా నీ అభిప్రాయం?

విజయ: ఏమిటి కుటుంబయ్యగారు అలా మాట్లాడుతున్నారు? క్షమించండి. మీరు గొప్ప పొరపాటు పడుతున్నారు. మీకు ఎవరూ లేరు. ఇక్కడికి వస్తే కలిసి వుండడం జరుగుతుందనుకొన్నాం. అయితే మీరు అపార్థం చేసుకున్నట్టుంది అదీ కొంత నిజమే. మా తండ్రిగారుండగా మీరు అట్టే వచ్చేవారు కారు. మమ్మల్ని అవతలగూడ రమ్మని కష్టపెట్టి వుండకూడదు. ఎవరి సమస్యలు వారు ఎదుర్కోవాలి. ధైర్యంతో పరిష్కారం చేసుకోవాలి. కాని ఎవరిని బాధపెట్టకూడదు. (నిశ్శబ్దంగా వుంటారు)

కుటుం: ఎంతమంది మీరు? నీవు, సీతమ్మగారు, రజని, శ్యామల.

విజయ: సుందరమ్మత్త.

కుటుం: ఆమె ఎవరు?

విజయ: మా వంటమనిషి. అయినా మమ్మల్నంతా పెంచి పెద్దవాళ్ళను చేసింది. దేవతలాంటి మనిషి —

కుటుం: నా దగ్గర వచ్చినా నోర్లు బ్రతుకరే? మీదగ్గర ఎలావుండమన్నా అన్నాళ్లు? మీరు నలుగురు చాలరా? ఒకవేళ నీకోసం వుంచుకోవలసివస్తే ఇంతమందిని భరించగలనా?

విజయ: మమ్మల్ని ఎవరు భరించమన్నారండీ?

కుటుం: అది కాదు చిన్నప్పుడు ఒంటరిగా వుండినా, ఫరవాలేదు. వయస్సు చెల్లినవాణ్ణి ఏ ప్రమాదం ఎప్పుడు వస్తుందో అని

విజయ: ఒంటరితనం మీరు కోరి తెచ్చుకొన్నదే కదూ?

కుటుం: నాకు పెళ్లి చేసుకోవాలని వుంది.

విజయ: (ఆశ్చర్యంగా) తోడు కావాలంటే పెళ్ళి అవసరమా? మీ తల్లితండ్రులున్నారు కదూ?

కుటుం: 'అబ్బ', 'డబ్బు' అని ప్రాణం తీస్తువుంటే వాళ్ళ మొఖంకూడా చూడడం లేదు. ఎవరన్నా చిన్న అమ్మాయిని చూచి మొదట కొన్ని రోజులు దగ్గర పెట్టుకొని చూడాలని వుంది. నేను వున్నన్నాళ్ళు ఫరవాలేదు అవతల కొంత ఆస్తి కూడా పెట్టిపోతాను. పెళ్ళి చేసుకుంటే ఏమి? చేసుకోకపోతే ఏమి? అంతా ఒకటే కదూ!

విజయ: [రౌద్రమూర్తి అవుతుంది] కుటుంబయ్యగారూ, మీరు తక్షణం వెళ్లిపొండి. ఇంకొక క్షణమైనా మీరిక్కడ వుండడానికి తగరు

మీరు అమాయకంగానే అనివుండవచ్చు. కానీ దానికి ఇంకొక అర్థంకూడా వుంది. అది తలచుకుంటే ఒళ్ళు మండుతుంది. వెళ్ళిపొండి.

కుటుం: [భయంతో, సిగ్గుతో, మాటలు తడబడుతూ] నే నేమన్నాను విజయా?

విజయ: ఏమీ లేదు. మీ రెవరనుకొన్నారు. మా తండ్రి ఎవరో, ఆయన మీకెంత సాయం చేశారో, కొంచెం స్మరించుకొండి. (డ్రాయరు దగ్గరకు వెళ్ళి నోట్లకట్టలు తీసికొనివచ్చి ఆయన చేతికి ఇస్తుంది.) మీ డబ్బు తీసికెళ్ళండి. లాయరుగారు కావలసినంత ఇస్తానన్నారు. వెళ్ళండి, లేకపోతే సుందరమ్మగారిని పిలుస్తాను. (సుందరమ్మ ప్రవేశిస్తుంది) ఇదిగో ఆమే వచ్చింది.

సుంద: సుబ్బువరసమ్మగారు వచ్చారు

విజయ: లోపలికి రమ్మను.

సుంద: ఏందమ్మా రోజుతున్నావు? ఎవరన్నా నిన్నేమన్నా అనలేదుగదా?

విజయ: సుబ్బువరసమ్మగారిని పిలుచుకురా.

కుటుం: నేను వెడతాను. వీలైతే శ్రీనివాసన్ గారితో మాట్లాడి, మీ విషయాలు చక్కబెట్టేదానికి ప్రయత్నిస్తాను. వెళ్ళివస్తాను విజయా. (విజయ జవాబు చెప్పదు.)

సుంద: వీడివద్ద నిన్ను ఒంటరిగా వదలడం తప్పమ్మా.

సుబ్బు: [కుటుంబయ్య పోవడం, ఆమె రావడం జరుగుతుంది. ఒకరినొకరు చూచుకొంటారు. సుందరమ్మ ఎదుమైపు వెళుతుంది.] విజయలక్ష్మి, బాగున్నావమ్మా? ఎప్పుడువచ్చినా కుటుంబయ్య ప్రత్యక్షం తప్పడంలేదు. అదేం శుభసూచకమో? అతనితో యేమైనా రాజీ ఏర్పాటు చేసుకొంటున్నారా? ఏమిటి అమ్మా నాకు తెలియక అడుగుతున్నాను.

విజయ: లేదండీ.

సుబ్బు: పొరబాటు పడ్డానులెండి.

విజయ: ఈవేళ ఆయన కడసారిగా మా యింటికి వచ్చాడు.

సుబ్బు: అలాగా? అయితే అంతా దద్దమ్మలన్నమాట. రజనీ వుందా?

విజయ: ఉంది.

సుబ్బు: ఆమెను ఒక్క క్షణం ఇలా రమ్మంటావా. మీ అమ్మగారిని మరొకసారి చూస్తాగాని అవస్థ పెట్టకొమను. రజనీతో మాట్లాడి వెడతాను.

విజయ: అలాగే [అని నిష్క్రమిస్తుంది]

సుబ్బు: [స్వగతం] ఈ పిల్లలతో కుండ పగలెయ్యాలి. అమ్మా! గిరి ఎంతవాడైనాడు! నాకే ఎసరు తెచ్చిగాడు. దేవుడి దయవల్ల మరొక సంబంధం కుదరబట్టి తప్పిపోయింది. "ఈ సంబంధం మాని వేస్తావా, లేకపోతే నీ మొఖం చూడను." అన్నదాంతో కదలిపోయింది. ఇది పెళ్ళి అయిందాకా ఓపిక పట్టలేకపోయిందిగా!

రజనీ: [ప్రవేశించి] నమస్కారమండీ.

సుబ్బు: బాగున్నావా తల్లీ?

రజనీ: నన్ను ఆశీర్వదించండి.

సుబ్బు: ఏమని?

రజని: "శీఘ్రమేవ వివాహ ప్రాప్తిరస్తు" అని.

సుబ్బు: దానికేంలే. పిచ్చిపిల్లవు. ముందు నీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడవలసి వుంది. నీవు దానిని వివేకంతో, ఓర్పుతో, నేర్పుతో పరిశీలించాలి. మా గిరి నిన్ను ప్రేమిస్తున్నాడు అంటాడు. అడ్డు చెప్పక, నువ్వు ప్రేమిస్తున్నావు. చిన్నపిల్లలు ఒకరినొకరు చూచేసరికి మోజు పడతారు.

రజని: మోజు గాదండీ. అనురాగం గాఢమైనది.

సుబ్బు: ఓస్! ప్రేమ కేమిలే అమ్మా అది పవిత్రమయింది. అయితే దాని తస్సాదియ్యా అది న్నాళ్ళుంటుం దంటావు? మానమ్మా. బాగా ఆలోచించు. ఈ ప్రేమ అన్నం పెడుతుందా? గుడ్డ లిస్తుందా? మేమేమీ శ్రీమంతులం కాము. మీరా విధంగాత్తు వీధులు పట్టవలసిన గతి ఏర్పడింది జోగీ జోగీ రాచుకుంటే బూడిద రాలుతుంది. యిద్దరూ సుఖపడాలంటే ఒకటి చెబుతాను.

రజని: నేను వినను. వీలేదు. మేం పెళ్ళిచేసుకొని తీరాలి. మేం పెళ్ళిచేసుకొంటాం.

సుబ్బు: పిచ్చితల్లీ మీరు చేసుకొంటారా, నేను ఒప్పుకుంటే కదా.

రజని: మీరు ఒప్పుకుంటారు.

సుబ్బు: అలాగా. నీవు పెద్ద పొరబాటుపడుతున్నావు అన్నమాట. ఇరవై వేలు కట్నం ఇస్తారన్నరుట.

రజని: గిరిగారు, ఎన్నటికి అలా అనకోరు. కట్నం ఈయలేనందువలన నన్ను మరీ ప్రేమిస్తా రని నానమ్మకం.

సుబ్బు: మొగాడి మనస్సులోని విషయం నీకెలా తెలుస్తుంది?

రజని: నన్ను మీరు మోసగిస్తున్నారు.

సుబ్బు: లేదమ్మా. పిల్ల చేష్టలు చేయక పెద్దరీతిగా నడుచుకో — అని నేను సలహా ఇచ్చాను మా వాడికి. అంచేత ఈ పెళ్ళి మానుకొన్నాడు.

రజని: ఆయన ఎన్నటికి అలా చేయరు.

సుబ్బు: చేశాడు.

రజని: అలానా! అంతదాకా వస్తే ఇప్పటివరకూ నా మీద గౌరవం చేత ఆయన నాకు చెప్పిన రహస్యం ఒకటి మీకు చెబుతాను.

సుబ్బు: మీ రహస్యంఅంతా నాకు తెలుసులే. [రజని అలజడితో కంపించిపోతుంది. పరుగెత్తి సుబ్బు నరసమ్మ కాళ్ళు పట్టుకొంటుంది. తన తల సుబ్బు నరసమ్మ మోకాళ్ళమీద ఆనిస్తుంది. సుబ్బు నరసమ్మ తల నిమురుతూ] తప్పు నీదా లేక గిరిదా, అని నేను విమర్శించడం లేదు. తప్పు మీ తల్లిది, నాది. యువకులను విచ్చల విడిగా విడవడం మా తప్పు. ఏదో పొరబాటు జరిగిపోయింది. క్షణికమయిన ఆ పొరబాటు కోసం శాశ్వతమయిన గ్రహపాటుతో మీ రిద్దరూ దగ్రంతో నూరేళ్ళు బాధపడతారా? దాన్ని మరచిపో. మా వాడు కాని, నేను కాని ఎవరితో అనం. ఈ విషయం పరమ రహస్యంగా వుంచుతాం.

రజని: [పొనుగనా లేచి నిలబడుతుంది] కూడదు.

సుబ్బు [కూడా లేస్తుంది] గిరి ఇంక మీ ఇంటికి రాడు. బోధపడిందా?

రజని: ఆమాట అతని నోటినుండానే వినాలి.

సుబ్బు: నామాట కాదంటాడా గిరి?

రజని: కాదనాలి. అతని విధి.

సుబ్బు: నీ విధి నీవు నిర్వర్తించావు గనుకనా?

రజని: పొడుపుమాటలు ఆపండి. అవమానించకండి. మీ రంతా చెప్పేయండి.

సుబ్బు: రజనీ! నిన్ను చూస్తే నాకు పాపం అనిపిస్తుంది. నీ మనస్సు నొప్పించడం నాకేమాత్రం ఇష్టం లేదు. ఒకమాట, ఇప్పుడు నీవు కట్నంలేని పిల్ల వయినావని తెలుసుగా?

రజని: మీరు పొరబాటుపడుతున్నారు. దీనికి ప్రతీకారం సాధిస్తాను.

సుబ్బు: ఏంచేస్తావు?

రజని: మీ కొడుకు సమాచారం కనుక్కొంటాను. మీరు న్యాయం చేయకపోతే ప్రతిచోట, అతనిని అవమాన పరుస్తాను. ఆ నీచుని బ్రతుకు గంగలో కలుపుతాను.

సుబ్బు: పొరబాటు పడుతున్నావు. నిన్ను పిచ్చి దానిగా కట్టివేస్తారు. వ్యభిచారిణి వంటారు. కడుపు చించుకుంటే కాళ్ళమీద పడుతుంది. ఇంటిగుట్టు బయటపెట్టుకోడానికి మీ అమ్మ మాత్రం అనుమతి ఇస్తుందా. పోయివస్తానమ్మా. [ఆమెను పట్టుకొని] పోకండి అత్తగారూ.

సుబ్బు: ఉండి ఏంచెయ్యనమ్మా?

రజని: చూడండి. నాకళ్ళు ఎర్రబడి కొంత నిప్పులు లాగున్నాయి. లోపల తగలబడి పోతూంది. నరాలు లాగుతున్నాయి

సుబ్బు: నాకు బాగా అర్థమవుతుందమ్మా నీ పరిస్థితి. నెమ్మది మీద అదే పరిపాటి అవుతుందమ్మా తొందర పడి ఏమీ చేయకు తల్లీ!

రజని: మీ కాళ్ళు పట్టుకొంటా అనుమతించండి పెళ్లికి. మీకు దాసినవుతా.

సుబ్బు: ఆమాట అనకు. ఎన్నటికీ వీల్లేదు. [రజని కళ్ళలోని కందీలులాగా భయంతో, దుఃఖంతో స్తంభించిపోతుంది. సోఫాలో కూలబడుతుంది.]

సుబ్బు: [రజనివద్దకు వెళ్ళి] నేను నీకు రాక్షసిలా, భూతంలా కనిపిస్తున్నానుకదూ. మా పిల్లవాడి మంచినీ నీ మంచినీ కూడా గ్రహించి చెబుతున్నా. గిరిని మరిచిపో.

రజని: [మళ్ళీ కాళ్ళమీద పడుతుంది] వినండి గిరిని పెళ్ళాడకపోతే నాగతి ఏమవుతుందో గ్రహించారా? వట్టి నిశ్చితార్థంఅయితే నేను ఇంతగా అవమానకరంగా బ్రతిమాలేదాన్ని కాను. మీ ఇష్టం. నే నిప్పుడే నుయ్యో, గొయ్యో చూచుకోవాలి. సహించలేని అవమానం.

సుబ్బు: వట్టిఅమాయకురాలివి. ఆత్మహత్య పరమపాతకం. చిన్నదానివి, అలాఅనకు. వెయ్యి. ఒక వేళ నేను ఒప్పుకున్నాను అనుకో. ఒక్క సంవత్సరంలో లేదు ఆరు నెలల్లో నీవే నన్ను నిందిస్తావు. చింకి చాప, మెడలో నల్లపూసలు పొయ్యి పొగతో ఎఱ్ఱబడినకళ్ళు, మూర్తీభవించిన దరిద్ర

దేవతలా వుంటావు. గిరి కో చింకిచొక్కా- ఊరినిండా అప్పులు, నిన్ను ద్వేషిస్తాడు. నేను చెప్పినట్లు చేస్తావా, ఎంతమార్పు కలుగుతుందో చూడు, గిరి నిన్నెన్నటికీ మరువజాలడు. మీ ప్రేమ అమృతత్వం వహిస్తుంది. ఎన్నటికీ మరువ లేని దవుతుంది. శాశ్వతమైన మధురస్వప్నంలాగ వుంటావు అతనికి. నీవు మాత్రం రూపంలేని దానవు కావు. నీ చుట్టు పదులు ఇరవైలుగా యువకులు మూగుతున్నారు. వారిలో ఓచ్ఛగా డైన నూనూగు మీసాల రాయుడిని గాకుండా రెండవ పెళ్ళి అయినా సరే వెయ్యి రూపాయలు తెచ్చే ముసలి లాయరుని అయినా చేసుకో. నాకూతురికైనా నేను చెప్పే సలహా ఇదే.

రజని : [పకపక నవ్వుతుంది సేజి ముందుకు వస్తుంది] మిల్లు నుంచి ఎంత ఆలస్యంగా వచ్చావు నాన్నా? తొందరగా పదండి. మేమంతా కాచుకో వున్నాం. తొందరగా ఫలహారం చెయ్యండి. పోదాం. బంగారు నాన్న దూ? [అని చెయ్యి పట్టి లాగినట్లు అభినయిస్తుంది.]

సుబ్బు : [కేక వేస్తుంది] ఎవరక్కడ? రండి! రండి! [సుందరమ్మ ప్రవేశిస్తుంది] సుందరమ్మ ఇదేందో చూడమ్మా. రజని వెర్రిగా మాట్లాడ్తూంది [సుందరమ్మ రజనిదగ్గరకు పోతుంది. సుబ్బనరసమ్మ త్వరగా వెళ్ళిపోతుంది.]

రజని : [సుందరమ్మను కౌగలించుకొంటుంది] నేను పతి నట. అమె కొడుక్కు ఉంపుడుకత్తెగా వుండాలట [వెక్కి వెక్కి ఏడుస్తుంది.] ఎంత నీచుడు? అకార్యం చేసి నమ్మించి గొంతు కోసాడు. అమ్మచాటును దాంకొన్న తుచ్ఛుడు. భరించలేను. నా కాళ్ళుచేతులు చల్లబడుతున్నాయి. (మూర్ఛపోతుంది. సుందరమ్మ కేక వేస్తుంది సీతమ్మ పరిగెత్తుకొని వస్తుంది.)

సీతమ్మ: ఏమిటి? ఏమిటి? అయ్యో రజని కేమయింది? (పైబడి ఏడుస్తుంది. శ్యామల ప్రవేశిస్తుంది.)

సుంద : (సీతమ్మతో) అమ్మా నీవు కొంచెం తే. శ్యామలా కొంచెం నీళ్ళుతీసుకురా అమ్మా. (పరుగెత్తుకొని నీళ్ళచెంబు తెస్తుంది. ముఖాన జల్లుతుంది. శ్యామల సుందరమ్మ రజనిని ఎత్తుకొనిపోయి సోఫామీద పడుకోబెడతారు.)

సీతమ్మ: ఈ వేళ రజని, రేపు నేను. మనమంతరం చచ్చిపోదాం. వీళ్ళకళ్ళు చల్లబడతాయి. శ్యామలా, నీవు వెళ్ళి లాయరుగారితో చెప్పు అంతా అమ్మేయమని. సర్వనాశనం కానీ.

శ్యామల: అందరం అనాయాసంగా, ఆనందంగా చచ్చిపోదాం. (తెర వాలుతుంది.)

## నాల్గవ అంకం

[పేదవారి ఇల్లు. సంపన్న కుటుంబపు కుర్చీలు, సోఫాలు వెక్కిరించినట్లు ఉన్నవి. టేబిలు వుంటుంది. దానిమీద ప్లేట్లు కప్పులు ఉంటాయి. ఒక పెద్ద ప్లేటుమీద తినగా మిగిలిన ఇడ్లీలుంటాయి.]

సుందరమ్మ : రాండి నరేశంగారూ.

నరేశం: లాయరుగారన్న మాట అబద్ధం కాదు. పాపం పరిస్థితులు చాలా నీచంగా ఉన్నాయన్నమాట.

సుంద: కాదండీ మరి. నిన్న మోతుబరులు, ఈనాడు బికారులు. మహారాజు బిడ్డలకు ఎంతగతిపట్టిదండీ. వీధికి తలవొగ్గాలి.

నరే: ఎందుకల్ల అయిందంటారు ఇదంతా.

సుంద: దోచుకొన్నారు. సర్వనాశనం అయింది. ఒక దమ్మిడీకూడా మిగుల లేదు.

నరే: నయా పైసా అన్నమాట.

సుంద: ఏదెందో నాకు తెలియదు. యజమాని చనిపోయిన తరువాత, శవంమీద శ్మశానంలో వాలేవి రాబందులు. రెక్కలులేని ఇంట్లో నే వాలాయి.

నరే: ఇక్కడ వుండాలంటే నే అసహ్యం వేస్తున్నది.

సుంద: మాకుమాత్రం లేదా నాయనా?

నరే: తాహసీల్ దారుకు ఉద్యోగంపోతే, వంటమనిషికి పోయిందటమ్మా! మీరు మరొకరి ఇంట్లో చేరరాదూ?

సుంద: అమ్మో నాయనా నేను లేకపోతే ఈ బిడ్డలు ఒక్క క్షణం ఏం చేస్తారు? నాకు మట్టుకు తోస్తుందా? ఇప్పటివాళ్లనూ? చెప్పనాయనా. మీరు వచ్చేరని చెప్పమంటారా?

నరే: సీతమ్మగారితో చెప్పనవసరంలేదు శ్యామల గారితో మాత్రం చెప్పండి. (శ్యామల ప్రవేశిస్తుంది)

సుంద: ఆమె వచ్చింది నాయనా!

శ్యా : (వశేశం గారి దగ్గరకు పోయి) నమస్కారమండీ.
(వశేశం నమస్కారం పెడతాడు.)

శ్యా : అవ్వగారూ మీరు వెళ్లండి (సుందరమ్మ వెళ్ళిపోతుంది) మీకు నేను రెండుసార్లు కబురు చేశాను, రెండు ఉత్తరాలు వ్రాశాను.

వశే : నాకు ఒక వుత్తరమే చేరింది.

శ్యామ: పోనీండి, మా పరిస్థితులు మారాయిగా.

వశే : ఏం జరిగిందో చెప్పండి.

శ్యా : చెప్పి ఏం లాభం? మీకు వినడానికి మాత్రం ఏమానందం? చెప్పడానికి మనసురాదు. మా హక్కులు నిలబెట్టుకోలేక పోయాం. దానికి దావా దట్టుకు కావలసిన డబ్బు లేక పోయింది. ఆస్తంతా ముక్కలులాగిన విస్తరి అయిపోయింది.

వశే : ఒక్కమాట నాతో చెప్పకూడదటమ్మా అంతా జతపరిచే వాణ్ణే.

శ్యామ : ఇప్పుడు దాన్ని గురించి ఎందుకు కదుపుకోడం. కూర్చోండి వశేశంగారూ. మీ రేమన్నా తొందరగా పోవాలా?

వశే : చాలా పనివుంది. చెప్పేది ఏదో సూక్ష్మంగా చెప్పండి.

శ్యామ : చెప్పనా?

వశే : చెప్పండి.

శ్యామ : నేను సంగీతం పాఠాలు చెప్దా మనుకొంటున్నా.

వశే : ఏమిటీ? నీకేమొచ్చునమ్మా? ఒక వేళ వచ్చినా, పాఠాలు చెప్పి సంపాదించాలంటే పడేపాలు పరమాత్ముడికెఱుక. శాస్త్రాలి సంగీతం మాష్టరంటే మట్టిని చూచినట్లు చూస్తారు. ఆ అవమానం భరించాలి.

శ్యామ : పోనీండి. సినిమాలో ప్లేబాకు సంగీతంలో గాని, రేడియోలో గాని—

వశే : (విరగబడి నవ్వుతాడు) నాకే సాధ్యం కాదు. చూడు, దానికి శిక్షణ కావాలి. పైకి రావడానికి కావలసినవాళ్ళు వుండాలి.

శ్యామ : అయితే ఏం చెయ్యమంటారు?

వశే : ఏమీ లేదు— సినిమా వాళ్ళ చేతుల్లో మటుకు పడవాక. యౌవనాన్ని నడిసంతలో అమ్ముకున్నట్టే.

శ్యామల : థాంక్స్. మీకు లేనిశ్రమ కలిగించాను.

వశేశం : అంటే నన్ను వెళ్ళమంటున్నారన్నమాట.

శ్యామల : మిమ్మల్ని వుండమనటం లేదు.

వశేశం : [లేచి] వెళ్తాను. ఏమిటీ కోపం? [అని వెళ్ళిపోతాడు)

విజయ : [ప్రవేశించి] ఏమి శ్యామలా ఉగ్రమూర్తి వయ్యావు?

శ్యామల : ఏమీ లేదు. నా రెండు ప్లానులు విఫలమయాయి. నీకు చెప్పింది ఒకటి, చెప్పంది మరొకటి.

విజయ : చెప్పంది ఏమిటి?

శ్యామల : నీతో ఇప్పుడు చెప్పినందుకు ఏమి లాభం?

విజయ : చెప్పు చూద్దాం.

శ్యామల: నేను సినిమాలో చేరా లనుకున్నాను.

విజయ : సినిమాలోనా !!!

శ్యామల : అవును. చేరితే తప్పా? ఉన్న కాస్తోకూస్తో అంతా కరిగిపోయిందాకా పూరుకుంటే ఎలాగ? అమ్మ ఏమి చెయ్యలేంది కదూ! తమ్ముడికి మిలిటరిలో వచ్చేది వాడికే చాలదు. ఇంకా నీకా ఏ లోయర్ డివిజన్ క్లార్కో అవుతాను. ఏ పూరికన్ను మూరిస్తే అది నిరుమటుకు చాలుతుందా? పాపం రజని నెత్తి కుదురుతుందో లేదో?

విజయ : నిజం చెప్పు. రజనికి ఎలా వుంటూందో!

శ్యామల : ఒకరోజు తెలివిగా వుంటుంది. మరొకరోజు వెర్రిమొర్రిగా వుంటుంది. ఎవరినీ గుర్తుపట్టదు. ఏమీ తెలియదు. అది అలా ఉండటమే కొంత మేలు. ఎందుకంటే ఆ శేషగిరి పెండ్లి విని వుంటే దాని ప్రాణాలే పొయ్యేవి. భగవంతుడి కృపవల్ల మనకు దక్కింది (బతికినన్నాళ్ళు కాపాడవలసివస్తే మనము కాపాడుదాం. పిచ్చితల్లి, అదితో బుట్టు కాదు. మనకిప్పుడు కడుపున పుట్టిన బిడ్డలా అయింది. విజ్జీ దానికోసం మనం అన్నీ మానుకోవలసివస్తే మానుకొందాం.

విజయ : శ్యామలా ఎంత మంచిదానివే [అని అన్యోన్యంగా ఆలింగనం చేసుకొంటారు. కొన్ని క్షణాలు తరువాత.] అమ్మ నీతో ఏమైనా చెప్పిందా ఆ లాయరుగారు వచ్చారని?

శ్యామల : చేసిందంతా చాలక, ఇంకా మళ్ళీ ఏం కావాలట ఆ గాడిద మొహంవాడికి.

విజయ : కుటుంబమ్మే నన్ను పెండ్లాడుతానని వర్తమానం చేశారు.

శ్యామల : నీ చుట్టూ కుక్కలా తిరిగేవాడు.

విజయ : నన్ను ఒప్పుకోమంటావా ?

శ్యామల : నేనిలా చెప్పేది. అది నీ స్వవిషయం. జీవితాంతం నీ భవిష్యత్తును గతించిన విషయం.

విజయ : [శ్యామలను కౌగలించుకొని] శ్యామలా నీది ఎంత ఉదారహృదయమే! [వారిద్దరు కౌగలించుకొని వుంటారు. సుందరమ్మ ప్రవేశించి కొన్ని గిన్నెలు టేబిలుమీద పెడుతుంది. అక్కచెల్లెళ్ల వద్దకు వస్తుంది. వాళ్లిద్దరు విడిపోతారు.]

శ్యామల . అన్నమయిందా?

సుంద : రాండమ్మా భోజనానికి.

విజయ : శ్యామలా, టేబిల్ మీద అన్నీ వుంచమ్మా. [టేబిల్ ముందుకు తెస్తారు. కుర్చీలు అనుగుస్తారు. ప్లేటు తెస్తారు. నెయ్యి సాంబారు కూర తెస్తారు. విజయ వెలుపలికి వెళ్తుంది. కొన్ని క్షణాలకు రజనిని తల్లి పిల్చుకొని వస్తుంది. రజని నెట్టి మాపులు చూస్తువుంటుంది. సీతమ్మగారి జుట్టు నెరిసిపోయింది. ముఖం ముసలిబారింది. రజనిని కుర్చీలో కూర్చోంపబెడుతుంది. అందరూ కూర్చుంటారు. సుందరమ్మ నిలబడి వడ్డిస్తుంది. చాలాసేపు ఏవరూ పలకరు ]

సీతమ్మ : ఇప్పుడు మీ తండ్రి మనల్ని చూస్తే! [అందరూ ఏడుస్తారు. శ్రీనివాసన్ ప్రవేశిస్తాడు]

సుంద : మీరెలా వచ్చారండీ?

శ్రీని : తలుపు బార్లగా తీసి వుంది. ఉన్నది కాస్తా దొంగలు ఎత్తుకుపోతే ఏం చేస్తారు?

సుంద: [అతనివైపు ద్వేషంగా చూస్తూ] అభయం లేదు. ఆపని ఇదివరకే జరిగిపోయింది. చేసే వాళ్ళు పెద్దమనుష్యులు, లాయర్లు, మిల్లు ఓనర్లు.

శ్రీని : [పెడచెవిని పెడతాడు. సీతమ్మ లేస్తుంది. ఆమెతో] సీతమ్మగారు మీరు లేవకండి భోజనం చెయ్యండి నేను ఉంటాను మీకయిందాకా.

సీత : ఏం చెప్పవచ్చారు ?

శ్రీని : నన్ను కుటుంబయ్యగారు పంపారమ్మా నేను చెప్పిన విషయం విజయమ్మగారితో చెప్పారా?

సీత : చెప్పాను.

శ్రీని : ఆవిషయం ఆమెను అడుగుతుంటారా ?

సీత : శ్యామలా, రజనిని తీసుకుపో అమ్మా. విజయ, శ్రీనివాసన్‌గారు ఏమోమాట్లాడాలట. [శ్యామల రజనిని పిల్చుకుపోతుంది.]

శ్రీని : మీ అమ్మ చెప్పింది కదూ ?

విజ : చెప్పిందండి.

శ్రీని : మీ స్వబుద్ధితో నే వద్దన్నారా ?

విజ : అవును.

శ్రీని : మీఅమ్మ వాళ్లు మిమ్మల్ని వదలటానికి ఇష్టం లేక ఏమన్నా చెప్పేరేమో అనుకున్నా. మీరు వద్దంటే ఇక లాభమేముంది! నేను వెడతాను. [అని లేవను.]

సీతమ్మ చెప్పమ్మా. భయమెందుకు?

విజయ : కుటుంబయ్యగారిమీద, నాకు వెనుకటికంటె గౌరవము కలిగిందని ఆయనతో చెప్పండి, నన్నే పెండ్లాడాలని వుండడమే దానికి కారణం. అయితే ఆలోచించుకోడానికి కొంత వ్యవధి కావాలని చెప్పండి.

శ్రీని : బాగా చెప్పావమ్మా. మనసు మార్చుకొన్నట్టున్నావు?

సీతమ్మ: ఆమె మార్చుకోవచ్చు కానీ నాకు ఈ సంబంధం ఎన్నటికీ ఇష్టం లేదు.

శ్రీని : తొందరపడకమ్మా. అవతల విజయమ్మగారు మిమ్మలను నిందిస్తారు. [విజయవద్దకు వచ్చి] మీ సంకోచానికి కారణం నాకు బాగా తెలుసు అతను పెద్దవాడని. మీరు వాయిదాలు వేస్తే, చూడండి అసలుకే మోసం వస్తుందేమో!

విజయ: శ్రీనివాసన్ గారూ, మిమ్మలని ఒకటి అడుగుతాను కుటుంబయ్యగారు నమ్మదగినవారేనా?

శ్రీని : నేనున్నాగా, సెటిల్‌మెంట్ చేయించడానికి. అతని మంచితో మనకేం పని?

విజయ: అది కాదు నేను అడిగేది......

శ్రీని అతను డబ్బు న్యాయంగా గడించాడా అనా ? దానికొస్తే న్యాయంగా ఎవడు గడించాడు చెప్పండి. అతను చాలా డబ్బుగలవాడు. అదే నాకు కావలసింది, మీకు కావలసిందని. డబ్బంతా ఒకటే. మంచి డబ్బుకు మంచివాసన, చెడ్డ డబ్బుకు చెడ్డవాసన కొట్టదు.

విజయ : అతని వ్యవహారాల్లో నీతిగా వుంటాడా ?

శ్రీని : అదా మీ అడిగేది ? ఆ విషయం మీకేం భయం లేదు. ఏ వినోదాలు ఎరుగడు. సిగరెట్టు కూడా కాల్చడు. "సామియారు"లాంటివాడు.

సీతమ్మ : ఇంతకూ మీకేమిటి ఈ వివాహంవల్ల కలిగే లాభం.

శ్రీని: మీమంచి, అమ్మాయి మంచి కోరే కదమ్మా?

సీతమ్మ: కూడను ఎప్పటినుంచి ఉదయించింది బాబూ?

శ్రీని: సీతమ్మగారూ మీ వ్యవహారాలనుగురించి అంటున్నారు. మీ హక్కులు కాపాడుకోడానికి మీదగ్గర డబ్బులేదని నాతప్పా? కోర్టులో డబ్బుగలవాళ్లకు జయం లభిస్తుంది. కేవలం న్యాయంవుంటే చాలదు. ఇప్పుడు బలం మీవైపు మొగ్గింది. లక్షాధికారి ఒకడు మీ బిడ్డకోసం కుక్కలాగ తిరుగుతున్నాడు. వెనుక ఇదే రంగంలో కుటుంబయ్య మిమ్మల్ని ఓడించాడు. ఇప్పుడు నా సలహా తీసుకోండి. కుటుంబయ్యను 'షా' కట్టించండి. ఇట్టి సలహాలు ఇవ్వటం మా వృత్తి, నీతి, ధర్మంగ కూడాను. అడగవలసిన విషయాలు ఏమైనా వుంటే అడగండి.

విజయ: మీరే చెప్పండి.

శ్రీని: కుటుంబయ్య చాలా ధనవంతుడు. అతను అనుకొన్నదానికంటే కూడాను. ఇంకేమయినా?

విజయ: కుటుంబయ్యగారు తమ అభిప్రాయం మీతో చెప్పారుగదా?

శ్రీని: చెప్పారు. ఇంక మీ అభిప్రాయమే తగువాయి. లాయర్లకు సర్దా పార్టీలు పరస్పరం పెనుగులాడుతూ వుండటమే.

విజయ: ఈ పెండ్లి నేను చేసుకుంటే కేవలం రోగికి ఔషధప్రాయమే.

శ్రీని: పొరబాటుపడుతున్నారు. కుటుంబయ్యగారికి మీరు తన అందానికి చూచి పెండ్లాడడంలేదని బాగా తెలుసు. అందుచేతనే ఆయన సగం ఆస్తిని మీ పేరున దాన విక్రయాల హక్కులతో డీడ్ వ్రాసి యివ్వడానికి సిద్ధంగా వున్నారు. అవతల దేవుణ్ణి మీరు ప్రార్థించాలి. ముసలివాడు ఎప్పుడు కండ్లు మూస్తాడా అని.. ... [సీతమ్మగారితో] విన్నారా, నేను అమ్మయితో అన్నమాట.

సీతమ్మ: విన్నాను.

శ్రీని: ఏమిటి మీ అభిప్రాయం?

సీతమ్మ: నా కూతురికి ఇప్పుడు కుటుంబయ్యగారి సగం ఆస్తి చూపించేదానికంటే అప్పుడే ఆమె తండ్రిగారి పూర్తి ఆస్తి నిలబెట్టివుంటే ఎంత బాగుండేది?

శ్రీని: దాన్ని మరచిపోండి. [విజయవైపు తిరిగి] మీకు ఈ సంబంధంవల్ల కలిగే లాభాలు అనేకం. మీరు ఎందుచేత వెనుకడుగు వేస్తున్నారో నాకు బోధపడటంలేదు. లోకంలో నేనెక్కడా ప్రేమను చూడలేదు. ప్రతీ మనిషి సంబంధం ఒక వ్యాపారం. వివాహం కూడా ఒక వ్యాపారమే. ఈ వేళ మీకు వచ్చిన లక్ష్మీభాగ్యం మరెవరికీ రాదు. మరెప్పుడూ మీకు రాదు.

విజయ: ఈ పెళ్ళిమాటలో మా వాళ్ళను గురించి ఏమన్నా కుటుంబయ్యగారు అన్నారా?

శ్రీని: లేదు. వారికికూడా ఏమయినా డబ్బువసతి కలిగించాలనా?

విజయ: లాయరుగారూ కుటుంబయ్యగారు ఒక విషయం మరిచారు. మా అమ్మవాళ్లను నేను విడిచివుండనని ఆయనకు తెలుసుగా?

శ్రీని: ఎంత హాస్యం? ఎందుకు విడచివుండాలి? మీ చెల్లెళ్ళు బంగారంలాంటి పిల్లలు. మీ అమ్మ మంచి ఆమె. అదీకాకుండా ఏ ముసలిమగడు వయస్సు పెళ్ళాం ఒంటరిగా వుండడానికి అనుమతిస్తాడు? ఇప్పుడు చెప్పవలసింది ఇంకొక విషయమే మిగిలి వుంది. కుటుంబయ్యగారు నాతో వచ్చారు. బయటనే వున్నారు. మీ జవాబుకోసం వేచియున్నారు. అవునో కాదో తేల్చెయ్యండి. అవునని చెప్పండి.

సీతమ్మ: చాలు, మీ తొందర. మీరేదో చెప్పాలిసిన విషయం చెప్పడానికి అనుమతించారు. ఒప్పుకోనేలేనిది అమ్మాయి బాధ్యత. అయితే ఈ ఒత్తిడికి నేను ఎన్నటికీ ఒప్పుకోను. ఏకాంతంగా అమ్మాయికి కొన్ని మాటలు చెప్పాలి. తల్లి బిడ్డకు చెప్పవలసిన మాటలు. ఇరవై ఏళ్ళు పెంచిన బిడ్డను ముసలివానికి....[అని కళ్ళనీళ్ళు తుడుచుకుంటుంది.]

శ్రీని: కోటీశ్వరులైన ప్రాయపుటల్లుళ్లు మీ బ్యాంకులో వున్నట్లు మాట్లాడుతున్నారు. మీ రజనమ్మ పెండ్లి ఎందుకు భగ్నమయిందో కొంచెం జ్ఞాపకం చేసుకోండి డబ్బులేక. డబ్బులేనిదే మీ మిగతా కూతుళ్ళు కూడా?...

సీతమ్మ: అసత్యం. నా పెళ్ళప్పుడు నాకూ డబ్బులేదు. వారికీ లేదు. మేము సుఖపడలేదూ?

శ్రీని : కాంతారావుగారు బ్రతికివుంటే ఈ పరిస్థితులు చూచి, ధనవశి యథార్థజ్ఞానంకలవారు కాబట్టి నేను చెప్పినట్టే చెప్పేవారు. ఆయన ఈ పెళ్ళికి తప్పక అంగీకరించేవారు. (విజయవైపు చూచి) విజయమ్మ శ్రీమంతుడి భార్య అవుతుంది. మేడలు, రవల నగలు, యౌవనం, పూచిన గుమ్మడిచెట్టులా వుంటుంది. ఒకవేళ కాంతారావుగారే ఇప్పుడు బ్రతికివుంటే ఇలా అనేవారు. "బ్రతికినన్నాళ్లు సంసారంకోసం కాయకష్టలా పని చేశాను. కడపట జీవితం ధారపోశాను కూడా. విజయా నీవుకూడా కొంత బలిదానం చేయకూడదమ్మా. అమ్మను నాన్న, రజనిని చూడు." అని—

విజయ: (కళ్ళు నీళ్ళతో నిండిపోతాయి గద్గదస్వరంతో) నేను ఒప్పుకొన్నానని చెప్పండి కుటుంబయ్యగారితో.

శ్రీని : బహుబాగా చెప్పావమ్మా! బుద్ధిమంతురాలివి. మీ పెళ్ళి సెటిల్‌మెంటు కాగితం తయారుగావుంది. ఇదిగో ముందుజాగ్రత్త పడ్డాను. నా శ్రమకు ఫీజు ముట్టుతుందో లేదో అని కూడా ఆలోచించలేదు. జాగ్రత్తగా చదువుకో. దానికి కావలసిందల్లా కుటుంబయ్యగారి చేవ్రాలు. నేను మీ తండ్రిగారి లాయర్నికదా. అలాగే మీ లాయర్నుగా కూడా ఉండాలనుంది; తర్వాత మీదయ. ఇదిగో కుటుంబయ్యగారిని పిలుచుకొస్తా. [వెళ్లిపోతాడు]

విజయ : [తల్లిదగ్గరకు వెళ్ళి కౌగలించుకొని ముద్దు పెట్టుకొంటుంది] ఏమీ అనవాక. లాయరుగారు చెప్పింది నిజం. ఈ వివాహం మనకాధారం. అమ్మా నీవు ఎలా బాధపడగలవు? [సీతమ్మ ఏమో చెప్పబోతుంది] లేదు—లేదూ. నీవు ధైర్యంగా ఎదుర్కొంటావు. రజని ఏం చెయ్యగలదు? వైద్యానికి డబ్బు ఎక్కడనుంచి తెస్తావు చెప్పు? డబ్బులేనికారణంచేత దానికేమన్నా అయితే ఎంత పశ్చాత్తాపపడి ఏంలాభం? శ్యాముల తెగించేపిల్ల. భయం విడచిందంటే కనికి నాదిగతుంది. సినీమాలో చేరుతుందట. నాకు తెలుసు. అబ్బా భారం తీరినట్లుంది. అవును ఇది

డబ్బుకోసం వెళ్ళేఅయినా అభిమానిస్తుంది. ఏడ్వకమ్మా వాళ్ళు వస్తున్నారు. [శ్రీనివాసన్ ప్రవేశిస్తుండగా కుటుంబయ్య గాబడి వస్తాడు. చిరునగవుతో విజయ తనదగ్గరకు వస్తావుంటే శ్రీనివాసన్ అగమని సీతమ్మగారివద్దకు ముందు వెళ్ళమని సంజ్ఞ చేస్తాడు.]

కుటుంబయ్య : [సీతమ్మగారితో] నమస్కారమండీ. [విజయదగ్గరకు పోతాడు] శ్రీనివాసన్ గారు చెప్పింది నిజమా?

విజయ : నిజం, నిజం.

కుటుంబయ్య : రేపు మనస్సు మార్చుకోవు కదూ? [విజయ తన చెయ్యి అతని చేతిలో పెడుతుంది.]

విజయ : ఒప్పు!! [విజయ సిగ్గునవ్వు నవ్వుతుంది. సీతమ్మగారి దగ్గరకు వెళతాడు]

కుటుం : మీరు అనుమతి ఇస్తే వచ్చే శుక్రవారం ముహూర్తం వుంది.

సుంద : [ప్రవేశిస్తుంది]

సీతమ్మ : ఏం? సుందరమ్మా?

సుంద : కొమ్మపల్లి సాంబయ్య వచ్చాడు. మీరేమో బాకీ ఉన్నారు—

సీతమ్మ : అంతా ఇచ్చేశానే నేను. చూడ్డానికి వీలు లేదని చెప్పు.

కుటుం : సీతమ్మగారూ అలా అనకండి. వాడికేమయినా రావలిసివుంటే ఇవ్వాలి. లేకపోతే వెళ్ళమనాలి. మీకు ఏమీ భయం లేదులెండి. నేను తోడు వుంది కదూ? [సుందరమ్మతో] సాంబయ్యను రమ్మను. విజయా వీడి భరతం కొంచెం పట్టించు చూద్దాం. [సీతమ్మ శ్రీనివాసన్ వెళ్ళిపోతారు]

కుటుం : [విజయతో] నేను తలుపువెనుక వుంటాను. [అని దాక్కుంటాడు]

సాంబ : [ప్రవేశించి] దణ్ణమమ్మా.

విజయ : ఊ!

సాంబ: సీతమ్మగారు బాగున్నారా అమ్మ?

విజ : బాగున్నారు.

సాంబ: చెల్లెల్లో?

విజ : బాగున్నారు. మా అమ్మగారు నీతో మాట్లాడమన్నారు తొందరగా చెప్పి వెళ్ళాలి.

సాంబ: ఎందుకొచ్చానో తెలుసుగదామ్మా?

విజ : తెలీదు.

సాంబ: అలాగా! డబ్బుకోసం అనుకోండి. నాన్నగారు పోయిన తరువాత "దానిబాయిసారించిలే; కొంతరావు గారిదగ్గరనుండి రావలసిన సొమ్ము రాకపోతే పోయిందా?" అనుకొన్నాను. మా నెత్తి ఇబ్బందిగా వుందమ్మా.

విజ : మా నాన్నగారు మీ కేమి బాకీ లేదని, నాకు గట్టినమ్మకం.

సాంబ: అలా అనకండమ్మా. నామనసుకు చాలా కష్టమేసుంది

విజ : వేస్తేవేయవచ్చు, మేము మీకేమి బాకీ లేము

సాంబ: నాకు కోపం తెప్పించకండమ్మా! ఎంతో లేదు. అయిదువందల రూపాయిలు. ఇప్పుడే నెత్తురు పిండి అడిగే వాణ్ణికాను అమ్మగారు నోటు వ్రాసిస్తే చాలు.

విజ : నీకేమీ బాకీ లేము. మా అమ్మగారితో నీ సమాచారం చెపుతా.

సాంబ: బాకీ ఇవ్వంది కదలను. [అని కూర్చీలో కూర్చుంటాడు] నాకు కోపం వచ్చిందంటే ఇల్లు తీసి పందిలేస్తాను. [కుటుంబయ్య ప్రవేశిస్తాడు సాంబయ్య లేస్తాడు]

కుటుంబయ్య: కూర్చో సాంబయ్యా! నీదగ్గర బిల్లుందా?

సాంబయ్య: లేకేం బాబూ?

కుటుంబయ్య: ఇలా తే.

సాంబయ్య: [విజయవైపు చూచి] ఇమ్మంటారా అమ్మా?

విజయ : ఆయన చెప్పినట్టు చేయి.

కుటుంబయ్య: [చదువుతాడు] "సీతమ్మగార్కి లెక్క ఫైసలు చేసి ఇచ్చిన రసీదు." ఇది బిల్లా, వివరా లేవి?

సాంబయ్య: ఎన్ని మాట్లండి బిల్లు తయారు చేసేది. అయిదారు సార్లు అయింది. మొదటి దానిలో వివరాలున్నాయి. కావాలిస్తే వెదికి చూడండి.

కుటుంబయ్య: సరే ఇప్పుడు సొమ్ము ఇస్తాను. బిల్లు ఆవతల సరి చూచుకొందాం.

సాంబయ్య: అలాగే చెయ్యండి.

కుటుంబయ్య: [రసీదు కండ్లదగ్గర పెట్టుకొని చూస్తాడు] నీ పేరు సాంబయ్య. ఈ చేవ్రాలు నీదేనా? సాంబయ్యకదూ నీవు?

సాంబ: అవునండి.

కుటుం : నీకు ఐదువందలిస్తాను.

సాంబ : సరిమామూలే అవతల ఇవ్వండి.

కుటుం : [డబ్బు చేతికి ఇవ్వబోతాడు] అయిదువందలు తీసుకో.

సాంబ : ముందు సరిచూచుకోండి బాబూ!

కుటుం : వెళ్ళు బయటికి. వెళ్ళతావా లేదా దగాకోర!

సాంబ : ఏమిటండీ అలా మాట్లాడుతున్నారు?

కుటుం : మళ్ళీ నిలబడ్డావంటే ప్రమాదం. పో.

సాంబ : నా రసీదు నాకివ్వండి.

కుటుం : వెళతావా లేదా. లేక కమ్మకు వెనక్కు పోతావా?

సాంబ : వెళుతున్నా. మళ్ళీ వస్తా. నా తడాఖా చూచుకో. [వెళ్ళిపోతాడు]

కుటుం : దొంగవెధవ! విజయా మనం జాగ్రత్తగా వుండాలి. అంతా దొంగలే! [తెర]

# హంసపదిక

శ్రీ యస్వీ జోగారావు

అభిజ్ఞాన శాకుంతలమున భావితాంతఃకరణుడైన నాయకుడు దుష్యంతునకు అబోధపూర్వములయ్యు భావస్థిరములైన జననాంతర సౌహృదములను వర్ణపరిచయ మాత్రమున స్మృతిపథమున బహూకరించిన యొక చిన్న చిత్రమైన నేపథ్యపాత్ర హంసపదిక. ఒకప్పుడా దుష్యంతుని నవయౌవన వసంత వాసరములలో అతని మధురానుభవ మాకందశాఖికపై ఏకాంతముగా అలవోకగా ఎలుగెత్తిన మత్తకోకిల యామె. అతడు పట్టాభిషిక్తుడై పట్టమహిషి వసుమతీదేవి హేలావిలాస హావ్యసంగవశంవదుడైనంత ఆ వసంతము అంతరించి, ఆ రసాలకిసలయము అందరాక ఆ మావి మోసలనే తన జీవితమంతా అంతులేని హేమంతముగా వేగించుచున్న వియోగిని యామె. ఆమె హృదయము విరహవిధురమైనదగాని ఆ మధుర గాత్రములో నొక జీరయైనను తొరడిన చొప్పు గానరాదు. ఆ కంఠమేకాంతమున సదా కలస్వర ప్రసురములగు కమ్మగీతికలాలపించుచునే యున్నది. రాచనగరిలో రాణివాసపు మోసల నొక సంగీతశాలలో ఒంటరిగా ఆమెలో నామె పాడుకొను ప్రతిగీతిక—ఒక మహోజ్జ్వల పూర్వ గాఢానుభవస్మృతి ప్రతీక. ఆ యనుభవమున కిక పునర్భవము లేదు. ఆ స్మృతి మాసిపోదు. మనసు మరుడిరాదు. మరియొక ఆలంబన మసలు ప్రసక్తమే కాదు. ఆ స్థితి యెంత దయనీయమో చిత్తగింపుడు.

శాకుంతలము పంచమాంక ప్రారంభమున నేపథ్యమున జరిగిన దీ పాత్ర జీవిత ప్రస్తావన. అవునామె నేపథ్య జీవియే—హంసపదిక గదా. ఆ పాత్రకు రంగప్రవేశయోగ్యత లేదు. అసలా పాత్ర జీవితప్రయోజనము నాటకమున ప్రధాన పాత్రల తత్త్వమున గతార్థమై లయమును బొందినది. అయినను కథ నెదుటికి నడిపించుకొనుపోవు నాయకపాత్ర హృదయ తత్త్వమును నది నిగూఢముగ పరిపాలించుచునే యున్నది. దుష్యంతుడు శకుంతలతో మధుర బాంధవ్యము నెరపి కణ్వాశ్రమమునుండి రాజధానికి మరలి వచ్చినాడు. ఒకనాడు రాచనగరిలో విదూషకుడగు మాధవ్యునితో సుఖాసీనుడై యున్నాడు. ఇక శకుంతలా యాగమనమనంతర సన్నివేశముగా నిదియొక అవాంతర సన్నివేశము. 'అభిజ్ఞాన' సంజ్ఞాపూర్వకమైన నాటకమునందలి ప్రధాన ఘట్టమున కిదియొక ప్రాతిపదిక. దుష్యంతు నిక దుర్వాసశ్శాపప్రభావ మావహింపనున్నది. శకుంతలాస్మృతిరాహిత్య మది యావహింపనున్నదనగా దుష్యంతుని విదూషకుడు:

"భోభో వయస్య, సంగీతశాలాంతరేఽవధానం దేహి. కలవిశుద్ధాయాః గీత్యాః స్వర సంయోగః శ్రూయతే. జానే, తత్రభవతీ హంసపదికా వర్ణపరిచయం కరోతీతి."

అనగా—'అదిగో సంగీతశాలనుండి స్వరసంయుక్తముగా ఒక కలవిశుద్ధగీతిక వినవచ్చుచున్నది. అది హంసపదిక చేయుచున్న వర్ణపరిచయము మనుకొందును. సావధానముగా చిత్తగింపుము' అని హెచ్చరించుచున్నాడు. 'భోభో' యను పునరుక్తిలో ప్రకృతవిషయమును నా సంగీతము నెడ నొక వినయము ఆదరత్వర గమ్యమాన మగుచున్నది. మరి యిది సంగీతశాలలో వేతనజీవనులగు గాయనులు పాడిన పాట కాదు; మరి వేదనాజీవనమగు హంసపదిక పాడినపాట. వర్ణపరిచయమాత్రమున అది హంసపదిక పాటయని తెలిసిపోవుట. విదూషకునకును ఆ విషయము విశదమైనదనగా ఆమెపాట యొక్క ప్రత్యేకత తెలియగలదు. హంసపదిక పాట కాబట్టియే సావధానుడవు కమ్మని రాజును హెచ్చరించినాడతడు. అనుదినము సంగీతశాలలో ఎవరో ఏదో యొకపాట పాడుచునే యుందురు. ఆయన ఎన్నో పాటలు వినుచుండును. ఆ వినుటను ముందెల్ల నతనికట్టి హెచ్చరికల యక్కర లేదు. ఇది హంసపదిక పాట కనుకనే ఈ హెచ్చరిక. హంసపదికతోడి దుష్యంతుని పొత్తు నెరిగిన నర్మసచివుడు మాధవ్యుడొక్కడే యుండును. హంసపదిక యొక్క ప్రకృతావస్థను గూడ గమనించి యామె యెడల నతడు సానుభూతిని గూడ చూపుచున్నట్లున్నాడు. (ఈ విషయము తరువాత స్పష్టపడినది.)

పావధానుడవు కమ్మనుటలో అతఃపూర్వము దుష్యంతు డిట్టిస్థితిలో లేడనుట అనుక్తో (గ్రాహ్యము గదా అవు నతడిప్పుడు శకుంతలనుండి యొకపడి యొకవాక సుదకువపోగనుండుచే ఆవరింపబడుచున్నవాడు వోలె నున్నాడు. అయితే అదియు పొంగుపడని పూర్వ మధురానుభవమును గూర్చిన ఏదో ఆరాట మతని గుండెలలో గుసగుసలాడుచునే యున్నది. అందుచే వెంటనే విదూషకునితో 'నీవూరకుండుము, నేవింటును' అన్నట్లు "తూష్ణీంభవ, యావదాకర్ణయామి" అన్నాడు. అనగా హంసపదిక పాటయెడల అప్రుడే పురాస్మృతి ప్రేరేచినదో ఔత్సుక్యము ప్రకటించినాడను

ఆ కలకంఠి కంఠమునుండి ఆ కూతూహల కుహూకుహూవు లొసరి విసరిన సాకూతకూజిత మా కలవిశుద్ధగీతిక యెట్టిది:—

'అభినవ మధులోలుప స్త్వం
తథా పరిచుంబ్య చూతమంజరీమ్,
కమల వసతి మాత్ర నిర్వృతో
మధుకర విస్మృతో ఒస్యేనాం కథమ్"

అనగా—

'ఓ తుమ్మెదా! క్రొత్త క్రొత్త తేనియలానుట యందాసక్తికలవాడవై నీవు (ఇంతదనుక) చూత మంజరిని చుంబించి చుంబించి (ప్రకృతము) పద్మ పత్రముల మాటున నింత చోటు చేసికొని సుఖించుచు దాని (చూతమంజరి) నెట్లు మరచితివి?' అని.

ఇట్లు వైచిత్ర్యరామణీయకరసికులైన నాయకు లను భృంగాపదేశ వ్యాజమున నాయిక లుపాలంభిం చుట కాంతాసమ్మితమగు నొక కావ్యసంప్రదా యము. ఇది సముఖములోనే రాయబారము. ఇట చూతమంజరి సుఖ మవ్యక్తము. మధుకరసుఖాను భూతి సువ్యక్తము. అందుచేతనే యిది కలవిశుద్ధగీతిక యైనది. రాగములో అనురాగధ్వని మేళవించినది హంసపదిక. పాట విన్నంతనే 'అహో రాగ పరివాహిణీ గీతిః' అని బహిస్స్వగతముగా ననుకొన్నాడు దుష్యం తుడు, సంగీత శృంగార సారజ్ఞుడు. 'అహో!' యను టలో నత డబ్బురంపడుటయే కాదు. ఒక జాలి నిట్టూర్పను జారవిడచిన సడియు సన్నగా వినవచ్చు చున్నది. కాని మాఢవ్యుడు మాత్రము ఆపాట మర్మము తన కొక్కనికే మహా తెలిసినట్లు "కింతావద్గీత్యా అవగతో ఒక్షరార్థః" అని 'ఆ సంగీతపు రాగము సంగతి కొదయ్యా, అసలా పాటలోని అక్షరాల అర్థమేదో ఆకళింపుకు వచ్చినదా?' అని నిలదీసి యడిగినాడు దుష్యంతుని తన సానుభూతి ప్రకటించి. అందులకు మహారాజు సమాధాన మొక సుందరహాసము. ఆ పాటను, పాటలోని మాటను, మాటలోని మర్మ మునకు చేసినచో అనుభవశాలి దుష్యంతుడే చేయవలె వ్యాఖ్యానము. అట్లే చేసినాడు: 'ఈమె ఒకానొక ప్పుడు నాకు ప్రియురాలు. ఇప్పుడీమె నన్నిట్లు వసు మతీదేవి (అతని పట్టమహిషి యగునో లేక భూదేవి యనియో!) వ్యాజమున నేను గంటకు గురియైతిని' అనుచునే, 'తిట్టిన నేమి? ఏమి నేర్పుగా తిట్టినావు!' అని యామె ఉపాలంభనైపుణిని మెచ్చుకొని కళ్ళి యిది నా మాటగా హంసపదికతో చెప్పి రమ్మని మాఢవ్యుని పంపినా డామె కనుకు ('సఖే మాఢవ్య, మద్వచనా దుచ్యతాం హంసపదికా! నిపుణ ముపా లబ్ధో ఒస్మీతి'). ఎంత రసరహస్యపారవశ్యసంవేది యాతడు! మరి యట్టివాడు తన వసుమతీపతిత్వము విధి విహితమైన నిరంతరబాధ్యత యగుటచేతను గాబోలు సకృత్కృత ప్రణయములను విస్మరించుచుండును.

ప్రకృత సన్నివేశమునకును, దీనిని వెన్నంటి వచ్చు శకుంతలా విస్మృతి సన్నివేశమునకును బింబ ప్రతిబింబ భావము గలదు. నాటక సంవిధానమున అచిర భావియగు నైకాంతికమునకు దాని కిది యొక కావ్యార్థ సూచన మనవచ్చును. ఆ హంసపదిక పాట యెంత మధురార్థ బంధురము! ఎంత సందర్భసుందరము! అంచనడకవలె లఘు బహుళ ప్రారంభ ధీరముగా, క్రమక్రమ గతిగంభీరముగా నడచిన దా స్వరరోహ ప్రక్రియ. అసలా పాట నా యొడుపుతో నడిపిన వాని నడవలె హంసపదిక కంఠమువలె వాని దెంత గడి దేరిన గంటము!

అంతటితో ఆగినాడా కవి కాని, యాతని కథా నాయకుడు దుష్యంతుడు గాని—అక్షరార్థ వ్యాఖ్యా నము చేసి హంసపదిక నభినందించి రమ్మని విదూషకుని పంపుటతోడనే నాయకుని ఏకాంతత చేకూరినది. ఏకాంతము సుప్తానుభవస్మృతి ప్రతిబోధకము. ఇక ఆ గీతికపై నత డొక స్వానుభవ భాష్యము చెప్పు కొన్నాడు.

"యేమిటే గీతార్థము నాకర్ణించినంతనే ఇష్టజన విరహాప్రసక్తి లేనివాడనయ్యు నింత యుత్కంఠితుడ

వసుమతీ నీ!" ("కిన్ను ఖలు గీతార్థ మాకర్ణ్యేష్టజన విరహాదృతేఽపి బలవ దుత్కంఠితోఽస్మి!") అని తన యనుభూతికి తానే యచ్చెరువందుచున్నాడు. అప్పట్టున మహాకవి కాళిదాసు లేఖిని కల్పశాఖితో శ్రుతికెక్కి గీర్వాణ కావ్యవాణి శ్రావ్యగానముగా అద్భుత భావనా ప్రపూర్ణతతో ఒక అపూర్వ రమణీయమైన మధురోపనిషత్తువంటి మహాశ్లోకము నవతరింపజేసినది. అదే

"రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకీ భవతి యత్సుఖితోఽపి జంతుః,
తచ్చేతసా స్మరతి నూనమబోధపూర్వం
భావస్థిరాణి జననాంతర సౌహృదాని."

అను శ్లోకము. అందమైన ఆకృతులను జూచియు, శ్రావ్యములైన శబ్దములను వినియు, సుఖితుడై యుండియు నుత్కంఠితుడగు నొక వ్యక్తి అంతకుముందెరుకకు రానివయ్యు ఏ జన్మాంతరమునందో పరిచిత పూర్వములై యిప్పటికిని ఆత్మనిష్ఠములై నిలిచియున్న ప్రియమిత్రుల యొక్క స్మృతిసిద్ధి నందుచున్నాడు—అని తాత్పర్యము. హంసపదికా గీతాక్షరముల నిమిడియున్న అక్షరమైన అర్థమీ శ్లోకపరమార్థమున ప్రకాశించినది. ఇది యొక గొప్ప సత్యము. అంతరమైన భావప్రపంచమును సంబంధించిన యొకానొక ధర్మసూక్ష్మము వివిధ లలిత కళాకలితమైన రమ్యానుభవ పారమ్యమును జూచిన భావితాంతఃకరణుల యంతరస్వామియును స్పృశించి సద్యోజాతమైన వారి యుత్కంఠను యుగపజ్జాగృతముగా సందీప్తింపజేయు దివ్యప్రబోధన మిదియే. అది ముహుర్ముహుః కుతూహల దోహల ముగ్ధమానసులై ముఖాముఖి నేకశయ్యాసుఖోపవిష్టులైయున్న యువదంపతుల అమనస్కీన మధురానుభవోపక్రమ రమణీయమైన సుముహూర్తస్మృతి వంటిది. అట్టి పరమమైన అనుభూతివిశేషము నే శకుంతలరూప వీక్షణము నందును, హంసపదికాగాన శ్రవణమునందును పొందియున్నాడు దుష్యంతుడు. ఆ పూర్వానుభవమున కిది పునరుద్దీపకము. అనంతర సన్నివేశరచన కిది ప్రాంగణ రంగవల్లిక. అతని భావితాంతఃకరణతా నిరూపణ కిది శాణరేఖ. అవ్యవహితానంతర సన్నివేశమున శకుంతలా నిరాకరణము చేయబోవు స్వీయకథానాయకుని దుష్యంతుని సామాజిక కోపతాపాదిక భావప్రకోప ప్రస్తావము తగులకుండ ఆ నిరాకరణమున కొంత నిమిత్తము (ముని శాపము) గలదు. అంతియకాని దాని కాతని ప్రకృతి కాదు కారణము. పాత్రమాతని స్వభావ భావితాంతఃకరణుడు—అని నిరూపించుటకునై కల్పించిన ముందు జాగ్రత్త యిది. చతుర్థాంకమున ఆశ్రమపదమును వీడిన శకుంతల పంచమాంకమున పతిగృహమున పతిచే అనాదృత కానున్నదనగా ఆ రెండు సన్నివేశముల సంధిలో తదుభయ స్వభావోచితముగా సంకలితమైనది చిన్న సన్నివేశము. మరి యిది యెంత దయనీయమైనది! చతుర్థాంక దర్శనమున ఆర్ద్రభావనా తరంగితమైన సహృదయ సామాజికుని అనుభవస్రోతస్వినియందిది యొక ఆవర్తము. మాచితిరా హంసపదికా మధురగీత కారస్రగ్రంథిని కథ నెట్టి ఆయువుపట్టున పొదిగినాడో కవి! దాని ప్రసక్తి ప్రాసంగికమాత్రమైనను అటు నిటునెంత పటుతర వ్యాప్తిగలదు! ఆ చిన్న సన్నివేశమా దుష్యంతుని అనుభవ భూగర్భమును దొలుచుకొని వచ్చిన జలధార, బాహిరిల్లినంతట అతని స్మృత్యనుభవములను ఉభయకూలముల నొరసి పారు మహాప్రవాహమైనది. దానితో పాటు సామాజికుని భావనా ప్రపంచమును కావ్యప్రయోజన సాగరోన్ముఖముగా తరలించుకొనిపోయినది. రంగస్థలప్రసక్తి రహితమైన యొక చిన్న నేపథ్య పాత్రచే ప్రవృత్తమైన యొక సంగీతముచే నెంత సాహిత్యమును సాధించినాడు కవి! హంసపదికతోడి యతని అనుబంధము సంగీతానుభవము వంటిది. శకుంతలతోడి యతని బాంధవ్యము సాహిత్యానుభవము వంటిది. ఆ హంసపదిక పేరు గూడ సాభిప్రాయమైనట్లు తోచును.

ఇట్లు ప్రతి చిన్న సన్నివేశమును పూర్వసన్నివేశ స్వభావమున కొక వ్యాఖ్యానముగా, అనంతర సన్నివేశ స్వభావమున కొక ప్రాతిపదికగా మలచుట కాళిదాస మహాకవి రూపక శిల్పమునందొక మేలిమెలకువ.

# సాహితీ సుగతుని స్వగతం

శ్రీ నిడదవోలు వేంకటరావుగారు కడచిన నెల భారతిలో "శివతత్త్వసారపాఠాల మార్పు తగునా?" అన్న వ్యాసంలో కన్నడ శివతత్త్వసారం గురించి ప్రస్తావించి, "...ఇనాటికి సుపరిష్కృతములగు బసవపురాణాది గ్రంథములు బయలువెడల లేదు. ఇది యిట్లుండగా, మరికొన్ని యేండ్లకు (ఇప్పటికి ఇరువదియైదేండ్ల క్రితము) కన్నడభాషలో కూడ శివతత్త్వసారము లభ్యమైనది—పై రెండింటి వలన శివతత్త్వసారము నింకను నెట్లు సమీచీనముగా ప్రాచీనాంధ్రభాషాలక్షణానుసారముగా సంస్కరింపగలమో విశదము కాగలదు. కన్నడభాషాకృతి కూడా మల్లికార్జున పండితకృతమే." అంటూ తెనుగు శివతత్త్వసారములోని లోపాలను కన్నడ శివతత్త్వసార సహాయంతో పూరించవచ్చునని, రెండుదాహరణా లిచ్చారు. "ఇట్లే పెక్కు చోట్ల పూరణములను, పాఠభేదములను నీ కన్నడ కృతిసాహాయ్యమున కనిపెట్టవచ్చును" అని అన్నారు. నేను మరికొన్నిటిని ఇక్కడ జిజ్ఞాసువులకు నివేదిస్తున్నాను.

(1) పుట్టనని చచ్చి, చావని
పుట్టెడు (పువ్వులు) విధమున బురహరు భక్తిన్
ముట్టని మనుజులు సచ్చుచు
బుట్టుచు నుందురు ముక్తిపురి కెడదవులన్. 199

ఈ పద్యం లఘుటీకలో శ్రీ లక్ష్మణరావుగారిలా వివరించారు—"పుట్టనని చచ్చి చావని పుట్టెడు=పుట్టనని పుట్టినట్లుగనే లెక్కలేకుండ జచ్చుచున్నటు వంటివి యని యర్థము స్ఫురించుచున్నది. ఈ ప్రయోగము చింత్యము. పుట్టునని చచ్చి చావని పుట్టెడు= పురుగులు చచ్చునప్పుడు మరల బుట్టుదమని యనుకొనును. పుట్టునప్పుడు చావనని తలంచును. అనగా బురుగులకు బ్రదికియున్నప్పుడు తన కొక్కప్పుడు తప్పక చావు గలదన్న జ్ఞానముండదు. చచ్చునపుడు పునర్జన్మ జ్ఞానముండదు. ఇట్టి వివేచనమైన జ్ఞానము లేక మరల మరల బుట్టుచు జచ్చుచు నుండును. అట్లే శివభక్తిలేని మనుజులు మరల మరుజన్మ మెత్తుచు ముక్తికి దూరముగ నుందురు.

'పుట్టగని చచ్చి, చాగని పుట్టెడు—అని కాని, పుట్టగనె చచ్చి, చాగనె పుట్టి—అని కాని దిద్దవచ్చును. పుట్టిన కొలదికాలమునకె చచ్చి చచ్చిన కొలదికాలమునకె పుట్టునని యర్థము."

కన్నడ పద్యంతో దీనిని పోల్చితే అర్థం సుగమం ఔతుందేమో చూద్దాం. కన్నడ పద్యమిది:

'పుట్టలొడసత్తు సాయలె
పుటిద పుళుగళవొల్ భవభక్తియ నెంటుం
ముట్టద మనుజర్ సాయుత
పుట్టుత్తం ముక్తి పురకె దూరదొళిర్పర్. 208

పుట్టలొడసత్తు = పుట్టడానికోసం చచ్చి, సాయలె పుట్టిద = చావడానికే పుట్టిన—అని మొదటి పాదం అర్థం. దీని ప్రకారం తెనుగు పద్యాన్ని—

పుట్టగను చచ్చి చాగను
పుట్టెడు (పువ్వులు) విధమున...

అని చిన్న మార్పులు చేసుకోవడంతో అర్థం విశద మౌతుంది.

(2) శ్వపచుండైనను శివభ
క్తి పరుండగు నేని నతడె ద్విజవర్యుండా
శ్వపచునకు గీడు శివభ
క్తి పరాఙ్ముఖుడైన యట్టి ద్విజుడు మహేశా. 194

దీని టీకలో — "శ్వపచునకు గీడు = శ్వపచునకు గ్రిందివాడు, వానికంటె తక్కువవాడు." అని వ్రాశారు. 'కీడు' అన్న పదం కీళ్ నుంచి పరిణమించినది. క్రింద అనికూడా మారింది. శుభానికి తక్కువది. కనుక చెడ్డది కీడు. తక్కువ అన్న అర్థంలో ఈ ప్రయోగం అపూర్వం కనుక పలువురు పండితులు ఆక్షేపించారు కూడా. ఈ పద్యార్థం కన్నడపద్యం చూస్తే అర్థం స్పష్టమౌతుంది.

శ్వపచనుమాగల్ శివభ
క్తపరం తానాగ లాతనే ద్విజవర్యం
శ్వపచం గనముం శివభ
క్తి పరాఙ్ముఖనప్ప విప్ర నగజారమణా. 204

శ్వపచం గనమం - శ్వపచుని కంటే అధముడు - అని కీడు శబ్దానికి అధముడనే అర్థం స్పష్టం.

(3) నిన్నెఱుగుచు దన్నెఱుగని
యన్నరుడు శివయోగమున్న డనబడు (మదిలో)
నిన్నును దన్నును తెలిసిన
యున్నతుడు శివయోగమున్న డనబడును శివా. 269

ఈ పద్యానికి రెండు అర్థాలలోను అనబడును అని ఉండటంవల్ల అర్థం కాక శ్రీ రావుగారు టీకలో చర్చించి "లేదా యుత్తరార్ధమున శివయోగమున్న డనబడడు" అని సవరింప వచ్చును. ఈ సందర్భమున పాఠకులకు సోమనాథుని చెన్నమల్లు సీసములోని యీ క్రింది పద్యము చూడదగును" అని అనబడడు అనే మంచి సవరణ సూచించారు. కన్నడ పద్యం చూస్తే ఈ సవరణ ఎంత సమంజసమో తెలుస్తుంది.

నిన్ననె యాతివుత నఱితం
తన్నం శివయోగమున్న నెనిపం బుధరో
ళ్నిన్నం తన్నను నఱిది
ప్పన్నం శివయోగమున్న నెనిప నుమేశా. 280

శివయోగి ప్రధాన లక్షణ మేమిటంటే శివునితో తాదాత్మ్యం పొందడం. నా అన్న భావానికి తావు లేదు. ఉంటే శివయోగి కాడు. "శివయోగ మున్న నెనిప నుమేశా" అని—ఎనిపను—అనిపించుకోడు అనే కన్నడ పాఠాన్ని బట్టి "శివయోగమున్న డనబడడు శివా" అని గనం లక్ష్మణరావు గారి సవరణను సమర్థించవచ్చు. రెండవ పాదం చివరి 'మదిలో' అనడానికి మారు 'బుధులన్' అని కన్నడంలోని బుధరోళ్ ను బట్టి పూరించవచ్చు.

(4) అష్టాంగయోగ భక్తిన
భీష్ట ఫలప్రదుడవైన యీశ్వర నిన్నుం
దుష్టిసన గొలిచి ముక్తి వి
శిష్ట సుఖాఢ్యులగు టరుదె శివయోగాఢ్యుల్. 271

ఈ పద్యం నాల్గవపాదంలోని శివయోగాఢ్యుల్ అన్నది అన్వయించనందున "శివయోగాఢ్యుల్—అని దిద్దవలయును" అని టీకలో శ్రీ రావుగారు సూచించారు. కన్నడపద్యం చూడండి.

అష్టాంగయోగ భక్తియు
నిష్టఫలప్రదను మానుమేశనె నిన్నం
తుష్టియి నర్చిసి ముక్తి వి
శిష్ట గుణాఢ్య రహరు దరిదె శివయోగి శివా. 282

శివయోగి ముక్తివిశిష్ట గుణాఢ్యుడు కావడం అరుదా— అని కన్నడపద్యం నాల్గవపాదంలో కర్త ఏకవచనంలోనే ఉంది. టీకలోని సవరణ ప్రకారం శివయోగాఢ్యుల్ అని సవరించడంవల్ల అధ్యాహారం పునరుక్తమౌతుంది గనుక "శిష్టసుఖాఢ్యుడగు టరుదె శివయోగి శివా" అని దిద్దుకోడం సముచితమను కుంటాను.

(5) ఆడుదురు జతులు వెట్టుచు
పాడుదురు (న్) గతులు వేసి పరమానంద
క్రీడా సంగతి బ్రమథులు
కూడి వినోదింతు రిట్లు గొమరుగ రుద్రా. 346.

దీనిటీకలో— "జతులు-దీనిని జతులు అని దిద్దవలయును. జతి గతి యనునవి నాట్య సంగీతశాస్త్రములోని పదములు. జతి యనగా నాట్యయోగ్యతగల శబ్దసంతతి. (శబ్దగత్యాకరము) ఇది సంస్కృత యతి శబ్దమునుండి పుట్టినది. యతి యనగా వాద్యాంగ ప్రబంధ విశేషము. గతి యొక గమనవిశేషము." అని ఉంది. శ్రీ రావుగారి సవరణ ఎంత నిక్కమైనదో కన్నడపద్యంవల్ల గ్రహించవచ్చు.

ఆడువరు జతియ నిక్కృతి
పాడువ రాకృతిగళం వినిర్మిసి ముదదిం
క్రీడా గతి యిం ప్రమథర్
కూడి వినోదసువ రింతు చెల్వాగి శివా, 358

ఈ పద్యం మొదటిపాదంలో 'ఆడువరు జతియ నిక్కృతి' అని స్పష్టంగా జతి ఏకవచనంలోనే ప్రయోగించినందున తెలుగు పద్యంలోని జతులను జతులు అని బహువచనరూపంగా మార్చడంలో విప్రతిపత్తి ఏమీ ఉండదు.

(6) పృథువిధి నిషేధలోక
ప్రథితోభయ కర్మరాశి బ్రాపించెన్ నీ
పథవర్తిని "కేహో మను
యథాతథా" యనుటజేసి యంబారమణా. 461.

"దీని యర్థము చింత్యము" అని టీకలో ఉంది. కన్నడపద్యం చూస్తేనన్నా కొంత అర్థమౌతుందేమో అనుకుంటే అది సగంలో గ్రంథపాతం.

..............................
....................యుగమొ భవ
త్పథవర్తిగె తేహం మను
యథా తథా యెంబ కతదె నగజారమణా. 476.

తెలుగు పద్యం నాల్గవపాదంలోని 'పథవర్తిని' కన్నడపద్యంలోని 'పథవర్తిగె' అనేదాన్ని బట్టి 'పథ

వర్తికి' అని 'తేషామను'ను 'తేషాం మను' అని సవరించుకొంటే, నీ పథవర్తికి పైనపేర్కొన్న కర్మరాశి ప్రాపించింది. 'తేషాం మను యథాతథా' (నా కిట్లో నావారికి అట్లే) అనే భగవద్వాక్యం ప్రకారం-అని కొంచెం సమన్వయించవచ్చు.

(7) శ్రీయును గులమును శీలము
నాయువు నష్టమగు (నతి) రయంబున ముక్తి
శ్రీయుక్తుల శివభక్తుల
బాయక నిందించునట్టి పాపాత్ములకున్. 206

రెండవపాదంలో 'అతిరయంబున' అన్నమాట లోని అతి అనే పదం ఉన్న స్థలం ఖిలమైనందున సంపాదకులు ఆమాట చేర్చి సంస్కరణం చేశారు—అది అయివుండవచ్చుననే భావంతో. కన్నడ పద్యంవల్ల నిస్సందేహంగా అదేనని అర్థమని తేలుతుంది.

శ్రీయుం కులముం శీలము
మాయుష్యం నష్టమక్కు నిమిషదె ముక్తి
శ్రీయుత శివభక్తర నురె
నోయల్ నిందిసుతిర్ప్ప పాపాత్మర్గం. 216

రెండవపాదంలో 'నష్టమక్కు నిమిషదె' (నిమిషంలో నష్టమౌతుంది) అని వుండడంవల్ల అతి రయమునన్ అన్న సవరణ సముచితమైనదే.

(8) బ్రహ్మాభివంద్య ముఖ్యులు
బ్రహ్మకపాలావళీ విరాజితులు పర
బ్రహ్మాకారులు.........
బ్రహ్మేశ్వర నీ గణాధిపతులు కపర్దీ. 356.

దీనిలోని లుప్తభాగాన్ని కన్నడపద్యంలోని 'బ్రహ్మాకారంగళ ధీరరు' (268) అన్నదానినిబట్టి 'బ్రహ్మాకారులు ధీరులు' అని పూరించుకోవచ్చు.

(9) వివిధాబ్ధి మహా జలచర
రవులు గణేశ్వరులు మలయరాజప్రియ...
............కొండ(లు)
భువనత్రయ సుందరులు త్రిపురసహాన శివా. 358

దీనిలోని ఖిలభాగాలను కన్నడపద్యం పూరిస్తుందేమో చూద్దాం.

వివిధాబ్ధి మహా జలచర
రవరు గణేశ్వరరు మలయరాజప్రియ శ్రీ
శివరాజప్రియ కెలబర్
భువనత్రయ సుందరరి పురత్రయహరణా. 370.

దీనిని బట్టి

రవులు గణేశ్వరులు మలయరాజప్రియ శ్రీ
శివరాజప్రియ కొండలు

అని పూరించుకోవచ్చు.

(10) గురిత శిఖాములు ముందుగ
గురు లఘువులు స్థూలసూక్ష్మకుంజర దీర్ఘుల్
పరికింప గామరూపులు
హర కొండ(లు) మీ గణంబు లతిశాంతాత్ముల్. 379

రెండవ పాదంలోని 'స్థూల సూక్ష్మకుంజర దీర్ఘుల్' అన్నచోట కుంజర శబ్దం అతకడం లేదు. స్థూలార్థక మనుకుంటే అంతకుముందే స్థూలపదం ఉంది. కనుక కన్నడ పద్యం చూద్దాం.

గురిత శిఖంగళ్ ముండగ్
గురు లఘుగళ్ స్థూలసూక్ష్మకుబ్జర్ దీర్ఘర్
పరికిసలు కామరూపర్
హర కెలబర్ నిజగణేశ్వరతిశాంతాత్మర్. 391.

దీనిలోని రెండవ పాదంలో కుబ్జర్ (పొట్టివారు) అని స్పష్టంగా ఉంది. లావుపాటివారు, సన్నటివారు, పొట్టివారు, పొడుగువారు రకరకాల కామరూపులని అర్థం సరిగా ఉంటుంది. కనుక తెలుగు పద్యం రెండవ పాదంలోని కుంజర శబ్దాన్ని "కుబ్జులు దీర్ఘుల్" అని సవరించడం సముచితం. కుబ్జను ఏ లేఖకుడో కుంజగా వ్రాసుకొన్నదానివల్ల ఈ పొరపాటు కలిగివుంటుంది.

ఈవిధంగా లభించినంత మట్టుకు ఇంకా ఎన్నో పాఠాలను సక్రమంగా సరిదిద్దుకోవచ్చు. ఈ కన్నడ, తెలుగు శివతత్త్వసారాలను కలిపి ప్రకటించడం కూడా అవసరం.

—రామచంద్ర.

# శ్రీరామునికి భార్యలెందరు!

## శ్రీ గొట్టిముక్కల కృష్ణమూర్తి

శ్రీమద్రామాయణము, సంస్కృతములో విశేష వ్యాప్తిగలది, వాల్మీకి రచించి యుండినను వసిష్ఠుడు, దూర్వాసుడు, అగస్త్యుడు మొదలగు మహర్షులు రామాయణములు వ్రాసినట్లుగా వారి పేర్లతోనున్న రామాయణములగపడుచున్నవి. ఇవి కాకయితర రామాయణములు మరికొన్ని గలవు. భారతదేశములో అనూచానముగా 'రామునివంటి కొడుకు, లక్ష్మణునివంటి తమ్ముడు, సీతవంటి భార్య' అన్న సామెత పలుకని భారతీయ జిహ్వ, తెలియని భారతీయుడును లేడు. కాని యీ వివిధ రామాయణములను పరిశీలించినయెడల శ్రీరామునికి సీతాదేవి మాత్రమే కాక యింకను అనేకులు భార్యలుండినట్లుగా, ఆభార్యల పేర్లు సహితము వివరింపబడియున్నవి. వాల్మీకి వ్రాసిన రామాయణమందునూ అందందుండు శ్లోకములనుబట్టి శ్రీరాముడేకపత్నీవ్రతుడు కాడా అను అనుమానము కలుగుచున్నది. కాని సర్వసర్వత్రా శ్రీరాముని సీతాపతి, జానకీపతి వంటి యెన్నిసంబోధనలను పరిశీలించినను ఒక్క సీతా భర్తృత్వము తప్ప అన్యభార్యలున్నట్లు గోచరించదు. ఈ విభిన్నాంశములను ఒకకొలికికి తెచ్చుట సరస్వతీమూర్తులైన పండితుల నిర్ద్వంద్వ నిష్పాక్షిక విధి.

వాల్మీకి వ్రాసిన రామాయణములో వివిధ సందర్భములలో శ్రీరాముని బహుపత్నీత్వము ద్యోతకమగుచున్నది.

(1) హృష్టాః ఖలు భవిష్యంతి
రామస్య పరమాః స్త్రియః,
అప్రహృష్టా భవిష్యంతి
స్నుషాః తే భరత క్షయే. (అయో. 8-12.)

(2) య స్సుఖే ష్వాపథానేషు
శేతే చందన రూషితః.
వీజ్యమానో మహార్హాభిః
స్త్రీభిః మమ సుతోత్తమః. (అయో. 42-15.)

(3) పితు ర్నిదేశం నియమేన కృత్వా
వనా న్నివృత్త శ్చరితవ్రతశ్చ,
స్త్రీభిస్తు మన్యే విపులేక్షణాభిః
త్వం రంస్యసే వీతభయః కృతార్థః.
(సుంద. 28-18)

(4) వరకాంచన కేయూర
ముక్తా ప్రవరభూషణైః,
భుజైః పరమ నారీణాం
అభిమృష్ట మనేకధా. (యుద్ధ-21-8)

(5) మాతర శ్చైవ సర్వా మే
కుమార్యః స్త్రీ గణానిచ,
అగ్రతో భరతం కృత్వా
గచ్ఛంత్వగ్రే సమాహితా. (ఉత్తర కాండ.)

ఈ అయిదు శ్లోకముల దృష్ట్యా శ్రీరాముడు ఏకపత్నీవ్రతుడు కాడా? అను సంశయము కలుగుచున్నది. ఈ శ్లోకములలోని పరమాః, స్త్రియః, స్నుషాః, మహార్హాభిః, స్త్రీభిః, పరమ నారీణాం, స్త్రీభిస్తు మన్యే, సర్వా మే కుమార్యః స్త్రీ గణానిచ, అన్న పదములు గమనార్హాములు. సీతాదేవియే చెప్పిన 'త్వం రంస్యసే వీతభయః కృతార్థః' అనునది మిక్కిలి విచారణీయాంశము.

బ్రహ్మాండ పురాణము, దూర్వాస రామాయణము ఇత్యాది గ్రంథములలో సీతావివాహానంతరము ఆమె అంగీకారముతోనే భూదేవి, నీలాదేవి ప్రభృతి రాజకన్యలను శ్రీరాముడు వివాహమాడినట్లు స్పష్టముగా పేర్కొనబడినది. దూర్వాస రామాయణములో

కోసలో భానుమంతశ్చ
మగధ శ్చిత్రభూషణః,
యుధాజిత్ కేకయాధీశో
కాశీనాథః ప్రతర్దనః,
పృథక్ షోడశ సంఖ్యాకాః
దుహితౄః పుణ్యలక్షణాః,
భూనీలా విమలా ఖ్యాశ్చ
అష్టా వింశాధికం శతం.
సర్వాభరణ సంపన్నాః
సుమధ్యా రామమోహితాః,
తాసాం సంభవ వేళాయాం
రాఘవార్థే నిరూపితాః.
రఘువాయ దదుః శ్రీమత్
శుభలగ్నే గ్ని సాక్షికం,

తత స్సీతాజ్ఞయా రామః
పాణిం గృహ్ణాన్ స్వపాణినా,
ఏకపత్నీవ్రతే స్థిత్వా
సర్వగృష్టాన్మహామతిః,
వశిష్ఠ వామదేవాది
మునిప్రవర సన్నిధౌ.

అన్న భాగములో కొన్ని ముఖ్యపదములను గమనింపవలయును. కోసలాదిదేశాల రాజుల కుమార్తెలను సీతాదేవి అనుమతి పూర్వకముగా నే శ్రీరాముడు అగ్ని సాక్షిగా పెండ్లియాడినాడని తెలుచున్నది.

బ్రహ్మాండపురాణములో బ్రహ్మనారద సంవాదములో

శ్రీభూమి నీళా సహితం
శ్రీరామం జగదీశ్వరం,
పత్నీశత సమాయుక్తం
పద్మనాభం చతుర్భుజం.

అన్నచోటనూ జగన్నాథుడైన శ్రీరామచంద్రుడు శ్రీ అనగా లక్ష్మీ స్వరూపిణీ భూమి నీలా సహితుడునూ, నూరుగురుభార్యలతో సమాయుక్తుడును అని గలదు ఇవి ఆధారముగా ఆలోచించిచో సీతాదేవిని కలుపుకొన్న శ్రీరామునికి నూటయిరువది తొమ్మండుగురు భార్యలున్నట్లు ధ్రువపడుచున్నది వాల్మీకి చరిత్రలో

కౌసల్యాద్యాశ్చ రాజానో
దాక్షిణాత్యాశ్చ బాంధవాః,
రాఘవాయ దదుః కన్యాః
బంధు ప్రాబల్య దర్శినః.

అనడంలోనూ ఆయా రాజులు వారి కన్నెలను శ్రీరామునికర్పించినారని తెలుచున్నది.

స్కాందపురాణంలోను, బ్రహ్మాండములోను—

సా తులా వ్యాగమో భూమి
నీలాద్యైః మధుపద్మజః,
అష్టావింశోత్తరం కన్యా
శతేంచోద్వాహనం శుభం.

అనుటలోని అష్టావింశోత్తరకన్యాశతం, ఉద్వాహనం అను మాటలునూ శ్రీరాముని బహుపత్నీత్వమును సమర్థించుచున్నవి.

పాంచరాత్రములలో పద్మసంహితలో శ్రీరాముని నూటయిరువదితొమ్మండుగురు భార్యలలో కొందరి పేర్లు చెప్పి 'ఇత్యాది' అను శబ్దముతో ముగించబడినది:

సీతా శతాంశసంకాశా
భూమిర్నీళా మహాయశాః,
విమలోత్కర్షిణీ జ్ఞాన
క్రియాయోగాభిధా చ సా
ప్రహ్వా సంధీ తథేశానా
సుగ్రహా తులసీ బలా,
శాంతీ సరస్వతీ ప్రీతీ
రతీ కాంతీ ప్రభావతీ.
భద్రా సుభద్రా విజయా
ప్రజ్ఞా కాంతి ర్దయా మతిః,
మహీజలా మధుమతీ
భద్రాంగీ పద్మినీ హ్యుషా.
లజ్జా ప్రభాసా వసుధా
రేవతీ సుబలా కళా,
ఇత్యాది పుణ్యనారీణాం
నవవింశోత్తరం శతం."

ఇంకలి 'ఇత్యాదిపుణ్యనారీణాం నవవింశోత్తరం శతం' అన్న వాక్యము శ్రీరాముని పత్నీ బాహుళ్యత్వమునకు గట్టి ఆధారమై నిలచినది.

బ్రహ్మాండములో శివాశివరహస్య బ్రహ్మవిష్ణు సంవాద ఘట్టములో:—

ఏవం నిత్యానపాయిన్యో
మహిష్యో జానకీ పతేః,
గృహీత్వా రామగాన్ దివ్యాన్
సుధాకర సమప్రభాన్.
వీజ్యమానాన్ సదా భక్త్యా
మోదంతే శివ మచ్యుతం,
దివ్యాప్సరస గంధర్వ
కన్యాసంఘాశ్చ భూషితాః.
అంతఃపుర నివాసిన్యః
పుర్యావరణ పాలికాః.
పద్మహస్తాశ్రితాః సర్వాః
కోటి వైశ్వానరప్రభాః.
సుషుప్త్యాంతర తంత్రజ్ఞాః
పరమానంద నిర్భరాః,
తాభిః పరివృతః శ్రీమాన్
శుశుభే పరమః పుమాన్.

ఇత్యాది వాక్యములలోని నిత్యానపాయిన్యో మహిష్యః, సుషుప్త్యాంతర తంత్రజ్ఞాః, వైశ్వానరప్రభాః మొదలగునవియు ఈ ఏకపత్నీవ్రతవాద పూర్వపక్షమునకు సహాయపడుచున్నవి.

అడవికి శ్రీరాముడు వెళ్లుసమయమున తనతల్లి కౌసల్యతో చెప్పినమాటలుగా అగస్త్యరామాయణములోస

# శ్రీరామునికి భార్యలెందరు?

రామః తత స్సమాహూయ
కౌసల్యాం వాక్య మబ్రవీత్,
భార్యాః తిష్ఠంతు హే మాతః
స్త్రియో మే తవ సన్నిధౌ.
మదాగమన పర్యంతం
త్వచ్ఛుశ్రూషా పరాయణాః,
చతుర్దశ వర్షాణి
పాలయ త్వం మదీయకాః.
ఇత్యుదీర్య తదా రామః
ప్రణిపత్య చ మాతరం,
మైథిలీ (సీత) లక్ష్మణాభ్యాం చ
సహ రామో వనం యయౌ.

శ్రీరాముడు తల్లితో తాను సీతాలక్ష్మణులను వెంటబెట్టుకొని అరణ్యవాసమునకు పోవుచు "మిగతా భార్యలను నీ శుశ్రూషార్థము నేను వచ్చువఱకును నీవద్ద నుంచుము" అన్న శ్లోక పంక్తులలోని భార్యాః, మే, మదీయకాః అన్న శబ్దములు బహుపత్నీత్వమును రూఢపరచునవిగానున్నవి.

వాశిష్ఠ రామాయణములో శ్రీరామునికి పత్నీ బాహుళ్యత్వమును సమర్థించుచూ శ్రీకృష్ణునకు 1608 మంది భార్యలుండినను బ్రహ్మచారిగా వ్యవహరింపబడినట్లే భగవంతుడగు శ్రీరామచంద్రమూర్తియూ బహు స్త్రీపతి అయినా ఏకపత్నీవ్రతుడే అని నిర్ణయము చేయబడినది:

కృష్ణో ష్టమహిషీ భర్తా
షోడశ స్త్రీ సహస్రశః,
అనాది బ్రహ్మచారీతి
యథా విజ్ఞాయతే నృభిః
తథైవ రామో విశ్వాత్మా
సచ్చిదానంద రూపధృత్,
బహుస్త్రీకోపి ధర్మాత్మా
హ్యేక పత్నీవ్రతో భవత్.

కాని అనేకులు పై బహుపత్నీకత్వ వాదమును పూర్వపక్షము చేసి, శ్రీరాముని ఏకపత్నీవ్రతునిగా సిద్ధాంతము గావించినారు. ఏకపత్నీవ్రత సిద్ధాంతులునూ వాల్మీకిరామాయణము నుండియే ప్రమాణములను చూపుచు, మిగతా రామాయణములందలి వానిని ప్రక్షిప్తత్వర్థముల బలముతో ఖండించినారు.

ఈ ఉభయ వాదములకూ ప్రమాణములుగా శ్లోకముల వ్రాసిన వాల్మీకి మహాకవి హృదయ దర్శనము సాధ్యమగుట యెట్లు? గోవిందరాజీయము, వాల్మీకి హృదయము విరోధ భంజిని మొదలగు వ్యాఖ్యానములు శ్రీరామచంద్రునికి సీతయొక్కతెయే కాని ధర్మార్థము కానీ కామార్థము కాని యితరభార్యలు లేరు అని నిరూపించ యత్నించినవి. వారి వాదములకు ప్రమాణముగా ఉత్తరకాండలో 99 వ సర్గ 8 వ శ్లోకము వాల్మీకి కంఠోక్తిగా

"ఇష్టయజ్ఞో రఘుపతిః
పుత్రద్వయ సమన్వితః,
న సీతాయాః పరాం భార్యాం
వవ్రే స రఘునందనః."

అన్న శ్లోకమును ఆధారముగా చూపుచున్నారు. ఈ శ్లోకమువలన శ్రీరామునికి సీతతప్ప ఇతర భార్యలు లేరని గ్రాహ్యమగుచున్నది. కాని వాల్మీకివే అయిన శ్లోకాలలో వధూః, స్త్రియః, స్నుషా, భార్యాః మొదలగు స్త్రీవాచక శబ్దముల బహువచనములు ఈ పై శ్లోకమునకు విరుద్ధముగా నున్నవి. ఈ ఆక్షేపణకు పై వ్యాఖ్యాతలు వ్యాకరణములో బహువచనము వ్యాయము సమ్మతము కనుక వాల్మీకి అవిధముగా వాడినాడనీ, వారందరును పరిచారికాగణములే కాని భార్యలు కారని సిద్ధాంతీకరించినారు.

బ్రహ్మఖండములో శివాశివరహస్య బ్రహ్మవిష్ణు సంవాదఘట్టములో చెప్పబడిన శ్లోకములోని "సుగుప్తాంతరతంత్రజ్ఞాః" ఇత్యాదులను సమర్థించు వ్యాఖ్యాతలు "సుగుప్తాంతరతంత్రజ్ఞాః పుత్రవత్ పాలకాః ఇత్యనేన ఔపచారికం కర్మకర్తృమత్తీర్ణ దేవతా స్త్రీబాహుళ్యమపి శ్రీరామస్య సంభవతీతి అవగమ్యతే" అని సాధించినారు.

స్కాందపురాణంలోని బ్రహ్మఖండములో చెప్పబడిన "మాతులాభ్యాగమో" అన్నదానిలోని ఉద్వాహన శబ్దానికి "ఉద్వాహన మిత్యస్య వివాహ పరత్వావభోధేన-ఉత్ =ఉత్కృష్టం, వహనం=పాదసంవాహనాది సేవా యస్యేతి త్వేతాదృశ పరిగ్రహకరణేన- శ్రీ రామచంద్రస్యపాద సేవార్థం ఉద్వాహితా ఇతర కన్యా పరిగ్రహకరణేన ఇతి అర్థకల్పనేన విరోధ నివృత్తిః" అని సమన్వయము చేసిరి అనగా ఉత్ అంటె ఉత్కృష్టమైన వాహనం అనగా పాదసంవాహనాది సేవకొఱకు నిమిత్తము ఆనాటి యిరువదియొను మంది రాజకన్యలను శ్రీరాముడు స్వీకరించినాడని వ్యాఖ్యానించి తద్ద్వారా విరోధనివృత్తి కాగలదు అన్నారు.

అగస్త్య రామాయణ మందలి "భార్యాః తిష్ఠంతు" అన్నదానిలో భార్యా శబ్దమునకు "భృఞ్ భరణే. భ్రియత ఇతి భార్యా - భరింపబడునది భార్య - అన్న వ్యుత్పత్త్యర్థ బలముతో, రఘువంశీయాధికత్వముచేత తాను భరించుచుండిన తన దాసీజనాన్ని తాను తిరిగి వచ్చువరకు తల్లిని తన శుశ్రూషలో నుంచుకొమ్మన్నాడు మాత్రమే అని సాధించినారు.

శ్రీరామునికి భూమీ, నీలా, విమలా, సుభద్రా ఇత్యాదిగా అనేక భార్యలుండిన పక్షమున ఆయనను సీతాపతీ, జానకీపతీ అని సంబోధనలలో సీతా నామము మాత్రమే కనబడుచున్నది కాని మిగతా వారి పేరులతో నీలాపతి సుభద్రాపతి అని యొక్కడా కనబడుట లేదనీ, అశ్వమేధయాగ సందర్భములో భార్య లేకుండ యాగము చేయరాదనందున సీత యొక్కతయే భార్య కాబట్టి ఆమె దూరస్థ యగుటతో, ప్రత్యామ్నాయముగా బంగారు సీతను తయారుచేయించి జరిపినారనీ, మిగతా భార్యలు లేనందుననే సీతాదేవికై అంతగా తపించినాడనీ, శ్రీరాముని రాజ్యభాగ ప్రకార క్రమములో లక్ష్మణపుత్రద్వయము, భరతపుత్రద్వయము, శత్రుఘ్నపుత్రద్వయము (రామ (స్వ) పుత్రద్వయము పేరులే కనబడుచున్నందునను సీతాదేవికి మాత్రమే లవకుశులున్నందునను, వివాహానంతర ఆరోజులలో 'ప్రజార్థే గృహమేధినాం,' అన్న ప్రకారము పితృదేవతలు లుప్తపిండోదకులు కాకుండునట్లు వంశము తరించుటకే కేవల కామతృప్త్యర్థము కాదని, అందువలన యితర భార్యలూ, పుత్రులూ ఉన్న వారి పేరులున్నూ వివరించబడియుండెడివా? అనియు శ్రీరామ ఏకపత్నీ వాదులు ప్రశ్నించి, కనుక శ్రీరాముడు ఏకపత్నీ వ్రతుడే అని సిద్ధాంతీకరించినారు.

దౌర్వాసరామాయణములోని, 'శ్రీరామ సౌందర్య మోహితాః స్వస్వకన్యాః కోసలరాజాదయోష్టౌ రాజానః శ్రీరామాయ ప్రత్యేకం దదుః', అన్నచోట 'తతస్సీతాజ్ఞయా రామః పాణీన్ గృహ్ణన్ స్వపాణినా' అనియున్నందున సీతాదేవి అనుమతి మీద ఆ రాజకన్యలను దాసీలుగా పరిగ్రహించినాడు అని భావము—అన్నారు. అంతేకాక వ్యాఖ్యాతలు పాణిగ్రహణశబ్దమున్న మాత్రమున భార్యాత్వముని అర్థము కాదని పాణి=చేయి. గ్రహణం=గ్రహించుట లేక చేయి చేయి కలుపుట అనిమాత్రమే అనీ, అగ్ని సమక్షములో చేయు ప్రమాణములలో అదియొక పద్ధతి అనీ అందుకాధారముగా, వాల్మీకి రామాయణము లోని కిష్కింధాకాండ అయిదవసర్గలోని

గతోఽసి యది వా సఖ్యం
బాహురేషః ప్రసారితః,
గృహ్యతాం పాణినా పాణిః
మర్యాదా బధ్యతాం ధ్రువా.
ఏతత్తు వచనం శ్రుత్వా
సుగ్రీవేణ సుభాషితం,
సంప్రహృష్టమనా హస్తం
పీడయామాస పాణినా.

అన్న సుగ్రీవోక్తి చూపుచున్నారు. ఇందులో మైత్రీ దార్ఢ్యమునకు మాత్రమే అగ్నిసాక్షికము పాణిగ్రహణము. కనుక పాణిగ్రహణ మన్నంతమాత్రాన పెండ్లాడినట్లు కాదనీ సీతాదేవి సమ్మతితో అగ్ని ముందు ఆ రాజకన్యలను దాసీలుగా అంగీకరించినాడు శ్రీరాముడు అని అనుచున్నారు. తక్కిన పురాణముల వాక్యములకును ఇట్టే వ్యాఖ్య చేయుచున్నారు.

రామాయణకాలమున సమాజములో బహుపత్నీత్వము కడు సమ్మతమైన ఆచారమగుటను దశరథుడే ప్రమాణము. శ్రీరాముడు శ్రీకృష్ణునివలె ఆదర్శము కావచ్చును. కాని ఆతనికి బహుభార్యాత్వ నిషేధము లేదనీ, బహుభార్యలు లేరని నిర్దుష్టముగా తెల్పుటకు సాధ్యము కాకున్నది. శ్రీ వాల్మీకి రామాయణమున ఏకపత్నీ వ్రత వాదులకు నొక ఆధారముండుటతో మిగత రామాయణముల త్రోసి రాజందురా? ఆ రామాయణకర్తలునూ తపస్సంపన్నులైన మహర్షులే. ఈ వ్యాఖ్యాతలు రూఢ్యర్థముల నిచ్చు శబ్దములకే వ్యుత్పత్త్యర్థముల గ్రహించినారు. అయినచో ఆ శబ్దములకు రామాయణ కాలము నాటికి ఏవిధమైన రూఢ్యర్థములుగా నిలచిపోలేదా? ఆ తర్వాతనే ఆ విధముగా రూఢియై నిలచినవా కానీన శబ్దము మాదిరిగా? కోసలాది దేశముల రాజులే తమ బిడ్డలను వివాహాలు చేయకుండ రామునివారికి దాసీత్వమునకై అప్పగించిరా?

వాల్మీకి రామాయణము అయోధ్యకాండ యెనిమిదవ సర్గలోని పన్నెండవ శ్లోకములో స్నుషా శబ్దమునకు కోడలు, వధువు అని రెండర్థములున్నవి. స్నుషా శబ్దమునకు "గృహవ్యాపారాయ జలం స్నాతి ఇతి స్నుషా" - యింటిపనులకు నీళ్లు తెచ్చునది - అని వ్యుత్పత్త్యర్థమును అంగీకరించి, వధూ శబ్దమునకున్న

# శ్రీరామునికి భార్య లెందరు!

ఊహ్యతే పుత్రేణయితి నధూః-పుత్రుని చేత వహింప బడునది-అన్న అర్థమును పరిత్యజింప డగునా? యుద్ధకాండములో యిరువదియొకటవ సర్గ మూడవ శ్లోకములోని "... పరమ నారీణాం అభిసృష్ట మనేకధా," అన్నచోట నారీ శబ్దమును కేవలము స్త్రీ పరిచారికగానే యెట్లు అన్వయించగలము? ఇచట వ్యుత్పత్త్యర్థము పనికిరాదా? "నృ=నయే నృణాతి నయతి ఇతి స్వవశం పురుషం ఇతి నారీ."-పురుషుని తన స్వవశము గావించుకొన్నది అని అర్థమిచ్చుటతో భార్యాత్వము స్ఫురింపదా?

దౌర్వాస రామాయణములోని "తతః సీతాజ్ఞయా రామః పాణీన్ గృహ్ణాన్ స్వపాణినా" అనుచోటగల వారి నందరినీ దాసీలుగానే అన్వయించెద మనిన, దాసీలను నియమించుకొనుటకు సీతాదేవి అనుజ్ఞ తీసుకొనవలసి వచ్చినదా? ఆ కన్యలు కోసలాదిరాజుల స్వ స్వకన్యలు. ధారాదత్తము చేసినది స్వంతము తండ్రులు. ఆకన్యలు పుణ్యలక్షణలు, అవివాహితలు, శ్రీరామ సౌందర్యమోహితలు, సుమనస్కలు శుభలగ్నమున అగ్ని సముఖమున వశిష్ఠ వామదేవాది మహామునులు సదస్సులో సీతానుమతి ప్రకారమే శ్రీరాములు స్వపాణిచేత వారి చేతులను పట్టుకొన్నాడు. ఆ రాజులు తమ బిడ్డలను రాఘవుని కొరకే పిలిపించినారు. ఇన్ని శబ్దములును వివాహమున్న భావమునే స్ఫురింప చేయుచున్నవి కేవలము దాసీలుగా గ్రహించుటకు ఇన్ని యేర్పాట్లు తంతువులూ జరుగవలెయునా?

అయితే దౌర్వాసరామాయణములోని పాణిగ్రహణ శబ్దమునకు ఏకపత్నీవ్రత వాదులు వ్యుత్పత్త్యర్థమునే ప్రమాణీకరించి రూఢ్యర్థమును త్రోసిపైచినారు. మైత్రికై సుగ్రీవునితో చేసికొనిన పాణిగ్రహణము వంటిదన్నారు. కాని సుగ్రీవునితోడి పాణిగ్రహణము ఒక మహోన్నత లక్ష్యసిద్ధికొరకు, లోకకంటకుని సంహారార్థము కనుక సరిపెట్టుకొందము. ఇచట సుందరవతులై అసూర్యంపశ్యలైన రాచకన్యలను దాసీలుగా అంగీకరించుటకు, పరస్త్రీ పరాఙ్ముఖుడైన శ్రీరామచంద్రుడు వారి చేతులుపట్టుకొని అగ్నిచుట్టూ ముమ్మారు ప్రదక్షిణములుచేసి ప్రమాణము చేసినాడా? ఇది ఎబ్బెట్టుగా కనిపించుట లేదా?

బ్రహ్మఖండములోని బ్రహ్మవిష్ణు సంవాదఘట్టములో చెప్పబడిన, "ఏవం నిత్యానపాయిన్యో మహిష్యో జానకీపతేః" అన్నచోట, అనపాయ శబ్దమునకు శాశ్వతము, నిర్భయము అని అర్థములు. మహిషీ శబ్దమునకు మహ్యతే పూజ్యతే ఇతి మహిషీ అని అర్థము. అనగా అప్రమాదలూ శాశ్వతలూ అయినవారు అని తెలుచున్నది. అందులోనూ వారందరూ కోటి వైశ్వానర ప్రభలు. అయితే "గృహీత్వా చామరాన్ దివ్యాన్ ...... వీజ్యమానాన్ సదాభక్త్యా ..." ఇత్యాది వాక్యములవలన సేవికా వృత్తిద్యోతకమగు నందమున్న వింజామర వీచు వంటి పనులవలన భార్యాత్వమునకునూ న్యూనత రాజాలదు. దాసీత్వము కులస్త్రీ కర్తవ్యములలో నొక ముఖ్యధర్మమేకదా?

పైవివిధ ఘట్టములందన్నిటా గల స్త్రీ వాచక బహువచనప్రయోగ సంశయము నివృత్తిగా వ్యాఖ్యాతలు "క్వచిత్పూజార్థే బహువచనమితి న్యాయ మ్యాశ్రయించ నేన క్వచిత్పరిచారికాస్త్ర్యభి ప్రాయ కల్పనేన నవిరోధ ప్రసక్తిః" అని యూహించినారు. బహువచనప్రయోగము పూజార్థములో న్యాయమే. గురువుగారూ మామగారూ ఇత్యాదిగా పెద్దలను గౌరవంగా సంబోధించుట న్యాయము. కాని దాసీలనూ సేవకులను గూడా, ఏమండి వంటకత్తెగారు పుత్రరత్నముగారూ అని యజమానులు పిలుచుట సమంజసమా? సభ్యతయా? సహేతుకమా? కాజాలదు కదా?

శ్రీరాముడు ఏకపత్నీవ్రతుడే అని వివిధ రామాయణములందలి ప్రమాణములనునూ వ్యాఖ్యానములు చేసి సిద్ధాంతము గావించబడిననూ రెండు వాదములనూ ఆయాగ్రంథములందలి శ్లోకములను, వానిలోని పదములను నిదానముగా పరిశీలించినయెడల యింకను సంశయనివృత్తి కాకున్నది. గణయతి ప్రాసలకై వ్యర్థన్యస్త పదములతో గట్టెక్కెడి కవిత్వములు కావుకదా మహర్షులవి? ఇంకను ఈ అంశమును సరస్వతీమూర్తులైన విద్వాంసులు సంపూర్ణముగా విమర్శించి జిజ్ఞాసు లోకమునకు యథార్థమును తెలుపవలయును. ఈ నా వ్యాసముయొక్క కారణము జిజ్ఞాస మాత్రమే కాని శ్రీరామచంద్రుని ఏకపత్నీవ్రతత్వమును శంకించుటయు నాక్షేపించుటయు కాదు.

# కలగూరగంప

## భాస్కర రామాయణకర్త తకతోల భాస్కర కవియా?

శ్రీ కె. హెచ్. వి. శర్మ

భాస్కర రామాయణ కర్తృత్వమును గూర్చిన వాదము లనేకము బయలుదేరినవి. ఇంకను కొన్ని బయలుదేరుచునే యున్నవి. మార్చినెల భారతి కలగూరగంపలో శ్రీ దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డిగారద్భుతమైన నూతనవాదము నొక్కదానిని లేవదీసిరి. కవితరంగిణి కర్తల వాక్యములతో "భాస్కర రామాయణమును గూర్చి యింకను బరిశోధనము విశేషముగా గావలసి యున్నద"ని యుపక్రమించి "ఇప్పుడీ గుంటూరు భాస్కరమంత్రికి తోడుగా తకతోల భాస్కరమంత్రి యొకడున్నట్లు తెలంగాణా శిథిల శాసన భాగమువల్ల తెలియుచున్నది. ఇరువురికి మల్లన-మల్లయలను కుమారు లున్నారు. కాని ఇంటిపేర్లు మారియున్నవి. నివాస స్థలములు గుంటూరు, వరంగలు జిల్లాలుగా వేరుపడియున్నవి. ఏకశిలా నగరమను వరంగల్లప్పుడు కాకతీయ రాజధానిగా నుండెడిది. తెలంగాణా శిథిల శాసనములో క్రింది చరిత్రాంశములు కనబడుచున్నవ"ని తప్పుల తడకయు, అబద్ధముల పుట్టయునగు తెలంగాణా శాసనములలోని ధర్మసాగర శిలాశాసనము నీ క్రింది విధముగ పొందుపరచిరి.

"[శ్రీ] కాకతియాన్వయ మానసజ్జి [త*] దన్వయక్షీరనిధౌ మహా [జా:] రాజేందు రాసీద్గణ [పత్య (తీ) ధీ] శః—

సర్వాజ్ఞా హ్యాసం కల యతి కలానా [ం] వేత తుజ్ఞా థ (?)—స్త స్మిం నాపీ [(ద్రి) తుక్క] తీ తక తోల భాస్కరమంత్రి వర్య్యజః— —సకల స్వామి [కా] ర్య్యజ్ఞ మపి లక్ష్మ్యావాసః [శ ?] శ [వ ?] పద [స*] రాగాంభోజ చిత్తద్విరేఫః తత్పుత్రో యం— మంత్రి మల్లన్న — (స్రష్టా ... సదర్మయూలీలా యుగేస్మి (న్)......... ..."

గత సంవత్సరము శాసన పరిశోధనశాఖవారి తరఫున వరంగల్లుతాలూకాలో వరంగల్లునకు 12 మైళ్లలో గల ధర్మసాగర శిలాశాసన ప్రతిబింబమును స్వయముగ తీయించి పరిశీలించితిని. దాని స్వరూప మిట్టిది. ఆ యూరిలోని వేణుగోపాలస్వామి ఆలయమున కెదురుగ నిప్పుడా శిలాఖండము పడియున్నది. మొదట నది యెచ్చట నుండెడిదో యెవ్వరికి తెలియదు. చక్కని నల్లరాతిపై సుందరముగ తెలుగు లిపిలో నాల్గువైపుల చెక్కబడి యున్నది. ప్రస్తుతము మనకు రెండడుగుల ఎత్తు, ఒకటిన్నర అడుగుల వెడల్పుగల చివరభాగము మాత్రమే లభ్యమగుచున్నది. సగమునకు పైగా శాసనముగల భాగము విరిగిపోయినది. దానికై ఆ గ్రామమున చుట్టుప్రక్కల కూడ విచారించితిని గాని లభ్యము కాలేదు. ఉపలబ్ధమైన భాగమునుబట్టి ఈ క్రింది విషయము తెలియుచున్నది. మొదటివైపు— కాకతీయరాజ లాంఛనమగు వరాహావర్ణన—విష్ణునాభికమలమున నుద్భవించిన బ్రహ్మ భూలోకకల్పద్రుమరాజసంభూమగు శ్రేష్ఠమైన కాకతీయాన్వయమును సృజించెను. ఆ వంశాంబుధిలో ప్రభవించిన గణపతిరాజచంద్రుడు స్వప్రకాశముచే శత్రు పద్మములను ముకుళింపజేసి లోకచకోరములను వృద్ధినొందించెను. అతడు ప్రతాపాగ్ని సాక్షిగా వసుంధరాదేవి కరగ్రహణము జేయ శత్రుభూపాలు రందఱు దిగంతముల నాశ్రయించిరి. రెండవవైపు—చంద్రునివలె సమస్త ప్రజలకు ఆహ్లాదకరమైనట్టియు స్వామిభక్తిపరాయణుడగు అతనియందు (భాస్కరుని తండ్రి పేరు పై భాగములో పోయినది) కపటరహితుడగు భాస్కరమంత్రి కల్గెను. అతని పుత్రుడు చెన్నగన్నయ చంద్రునితో సమానమైన కాంతిగలవాడు, సర్వకళాపరుడు, వంచనలేనివాడు. వానికి గణపతి యను నాతడు పుత్రుడు. అతడు సంతతదానార్ద్ర హస్తములచే ద్విపేంద్రభృంగముల నాకర్షించుచు,

స్వామికార్యపరాయణుడై, శివపాదయుగాంభోజము నర్చించుచుండెడివాడు. ఈతని కుమారుడు ధర్మమూర్తియు, బుద్ధిమంతుడగు మల్లన మంత్రి. మూడవ వైపు—దత్తక్షేత్రముయొక్క సీమావధులు గలవు. ఆ క్షేత్రము మూడు భాగములుగా విభజింపబడి అందు రెండు భాగములు ఈశ్వరునికి, ఒక భాగము స్వభుక్తి, కై అను మల్లనచే నియమింపబడెనట. తదుపరి ఆలయ పరిచారకులగు సంగీతమువారికి, భోగమువారికి, మృదంగ వాదకులకు, రంధ్రపూరకులకు, జలజకరండవాదకులు మున్నగువారి కివ్వబడిన అంశములు చెప్పబడినవి. నాల్గవ వైపు—వ్యాపగీతములతో సంస్కృత విభాగ మంతమయినది. బహుశః పైన సంస్కృతములో చెప్పబడిన విషయమే మరల క్లుప్తముగ తెలుగులో నిట్లు గలదు. "శ్రీ ప్రసన్న విశ్వేశ్వర వాక్యార్థము॥ విశ్వేశ్వర సముద్రమూను వెలివోలమూను యూండుపాండ్లు సేసి అందులోను ఒక పాలుగలంత మల్లయ్యకు ఉవ్వికె రెండుపాళ్లు ఎలుకుర్కి ప్రసన్న విశ్వేశ్వరదేవరకు సమర్పించినందుల వినియోగము."

శ్రీ కృష్ణారెడ్డిగారు తెలంగాణా శాసనములలో నుండి ఎత్తి వ్రాసిన పై పంక్తులకు మాత్రము సరియైన పాఠమును ఈ క్రింద నిచ్చుచున్నాను.

## మొదటి వైపు

..............................॥శ్రీశ
స్య నాభీశతపత్రజన్మా లోకాన్విధా
యాథ సిసృక్షు రగ్రియం।
భూలోక కల్పద్రుమరాజసింహా
శ్రీ కాకతీయాన్వయ మాససర్జ॥
తదన్వయ క్షీరనిధౌ మహౌ
జా రాజేందు రాసీద్గణ ప
క్షితీశః। యః శత్రు పద్మాని
నిమీల్య భాసా వ్యవర్ధ యల్లో
క చకోర వర్గాన్॥...

## రెండవ వైపు

పినాకే। సర్వాహ్లాదం కలయతి కల(లా)నా
దవ ద్భర్తృ భక్తః తస్మిన్నాసీ గ్లితః ప
టో భాస్కరో మంత్రివర్యః॥ తస్య
పుత్రో భం చ్చెన్నగన్నశ్చంద్ర సముద్యుతిః। సదా
సర్వకలా యుక్తో నతు వక్రః కదాచన॥
తస్యాత్మజో భాతి గణాధిపోయం ప్రథా
......కతేవ సేవ్యః। దానార్ద్ర హస్తే
......లిత ద్విజేంద్ర భృంగో గణనాథ
...॥...మ్యగ్రాకలిత సకలస్వామి కా
ర్యేషు నిజ లక్ష్మ్యావాసః। శివపద యు
గాంభోజ చిత్త ద్విరేఫః॥ తత్పుత్రోయం
......మంత్రీ మల్లశ్చకాస్తి."—

పై శాసన పాఠమును పరికించినచో శ్రీ కృష్ణారెడ్డిగా రపోహపడినట్లు 'తకతోల' ఇంటి పేరుగల భాస్కరమంత్రి లేడు. అతనికి మల్లన యనువాతడు పుత్రుడు కాడు. 'తకతోల' యను నింటి పేరే వింతగా 'తలతోక' లేనట్లున్నది. నిజమునకు భాస్కరమంత్రి కులగోత్రములు, తండ్రి, తాతల పేర్లు రెండవవైపున విరిగిపోయిన భాగముతో పోయినవి. ఇక అతని పుత్రుడు చిన్నగన్నయ్య, పౌత్రుడు గణపయ్య, ప్రపౌత్రుడు మల్లయ్యలు మాత్రము మిగత భాగములో చెప్పబడినారు. శ్రీ రెడ్డిగారు పై శాసనములోని భాస్కరమంత్రిని పేర్కొని తదుపరి రెండు పురుషాంతరములు విడిచిపెట్టి "తత్పుత్రోయం మంత్రీ మల్లశ్చ"—అని అభిప్రాయపడి తీవ్రమైన ఈ వాదమును లేవదీసిరి. ఇదే శాసనము సప్రతిబింబముగ, మూలము, అనువాదములతో గూడ డాకర్ పుట్టపర్తి శ్రీనివాసాచారిగారు తమ హైదరాబాదు శాసన సంపుటములో మొట్టమొదటి నంబరుగ ప్రకటించిరి. శ్రీ రెడ్డిగారీ నూతన వాదమున కుపక్రమించుతరి దానినైనను జూడరైరి.

ఇక కవిచరిత్రకారుల అభిప్రాయములను నిరసించుచు తమ నూతన సిద్ధాంతమును స్థిరపఱచుటకు గాను శ్రీ రెడ్డిగారు కొన్ని యుపపత్తు లిట్లు జూపిరి. "తాతయు, తండ్రియు, మనుమడును సమకాలములో యుక్తవయస్కు లగుట సులభసాధ్యము కాదు. అపురూపము. కవిచరిత్రకారులు నిశ్చయించినట్లు తిక్కన కాకతీయ గణపతి రాజ్యపాలన కాలములో నివాసని తీర్మానించినయెడల అతని తాత గుంటూరు భాస్కర మంత్రి క్రీ. శ. 1158–95 ప్రాంతమందలి కాకతీయ రుద్రదేవరాజు కాలమునాటి రామాయణ కావ్యకర్త కానోపు. అప్పుడు కృతిపతిమారయసాహిణి కాలము

కలసిరాదు. కావున భాస్కరరామాయణ కావ్యకర్త తిక్కన తాత భాస్కరమంత్రి కాడనియు, తదన్య భాస్కరమంత్రి భాస్కర రామాయణ కావ్యకర్త కాబోలనియు నేర్పడుచున్నది. గుంటూరు—తికతోల ఇంటిపేర్లుగల భాస్కరులకు భిన్నములుగా కనబడుచున్నవి. ఈ వ్యక్తిభేదము సూచించుటకొరకే కాబోలు ఒకరికి హుళక్కి భాస్కరమంత్రి యను వ్యవహారనామ మేర్పడినట్లు తోచుచున్నది."—కాని ప్రస్తుత ధర్మసాగర శిలాశాసనములోని భాస్కర మంత్రి కాలము వారనుకొనిన గుంటూరు భాస్కరుని కాలముకంటె నింకను వెనుకకు పోవును. ఈ శాసన దాతయగు మల్లన కాకతి గణపతిదేవుని సమకాలికు డనుకొనిన అతని ప్రపితామహుడగు భాస్కరమంత్రి అనయము గణపతి దేవుని పితామహుడగు కాకతి రెండవ ప్రోలరాజు కాలమువా డవగా క్రీ. శ. 1110-1158 ప్రాంతవా డగును. అప్పుడు వారు చెప్పిన కృతిపతి మారయసాహిణికాలము బొత్తిగ కలసిరాదు. వారిరువురకుగల అంతరము మరింత ఎక్కువగును. దీనిని బట్టి వారుచేసిన "పూర్వాపరాంతర కాల సమన్వయము అనగా క్రీ. శ. 1232-1262 ప్రాంతములలో తికతోల హుళక్కి భాస్కరమంత్రి కవియు, 1250 80 ప్రాంతములలో మంత్రి మల్లికార్జున భట్ట కవియు, 1280-95 ప్రాంతములలో నిశ్శంక కుమార రుద్రదేవ కవియు, భాస్కర రామాయణ కృతిపతి బుద్ధయ—మారయ సాహిణియు సమకాలికులై కృతిరచన సాగించిరనుట యెంతమాత్రము పొసగదు. ఇక "తికతోల భాస్కర మంత్రి పేరనే భాస్కర రామాయణము వ్యవహారము చెల్లుబడి యగుచున్నది. యువకవులకు బాలకాండాదు లప్పగించి వృద్ధు లరణ్యాదులను సాగించుటచేత భాస్కరకవి కీర్తి తరగదు; తరగలేద"ని ఈ తికతోల భాస్కరమంత్రిని గూర్చి వారు పడిన శ్రమ యంతయు వ్యర్థము.

సుమారు 13, 14 వ శతాబ్దుల సంధికాలమున పరిమిత ప్రదేశమునకు ప్రభువైన సాహిణిమారన ఆస్థానమునందుండి పుత్ర, మిత్ర, ఛాత్రుల సహాయమున రామాయణము నాంధ్రమున వెలయించిన సుప్రసిద్ధ భాస్కరకవి పై ధర్మసాగర శిలాశాసనములో పేర్కొనబడిన భాస్కరమంత్రి ఎంతమాత్రము కాడు. కాడు. కాజాలడు.

# సోరణగండ్లు

## శ్రీ వేటూరి ఆనందమూర్తి

ఆముక్తమాల్యదలోని ఈ క్రింది పద్యంలో ఒక అనుమానం వచ్చింది. అది యిది.

"సోరణగండ్ల రాఁ గొదమ
చుక్కలు పట్ట సతుల్ కవాటము
ల్వేరుప మౌక్తికంబులని
చిల్లులు పుత్తురు దమ్మటంచుఁ బొ
ల్పారు వితానహారముల
యం దొక హారత వ్రేలి ప్రొద్దుపో
గా రతి డస్సి గాడ్పులకు
గాఁ దెఱువన్ జను విప్పి మేడలన్."
(2—18)

దీనికి వ్యాఖ్యానాలలో అర్థం ఇలా వుంది: "పిన్న నక్షత్రములు గవాక్షముల నుండి రాగా ఆ నక్షత్రములను పట్టుకొనుటకై యువతులు కవాటములను మూయుగా తమ్ము (వారు) ముత్యములను భ్రమతో చిల్లులు పుత్తురేమో (అని భయమొంది) సుందరమైన మేలుకట్లయొక్క హారములందు ఒక దండవలె వ్రేలియుండి, విశేషకాలము గతింపగా రతిక్రీడచేత డస్సి వాయుసంచారముకొరకై (ఆ స్త్రీలు) తలుపు తెఱువగా (ఆ మేడలనుండి ఆ నక్షత్రములు) వెడలి చనినవి"

ఇందులో నా సందేహం ఇది. నక్షత్రాలు కిటికీలనుండి గదులలోనికి ప్రవేశించినవి. అక్కడి యువతులు వానిని పట్టుకోడానికే తలుపులు వేసినట్లైతే తర్వాత పద్యంలో ఆ భావం కొనసాగవలెకదా. మరి అదిమాని 'రతి డస్సి గాడ్పులకై దెఱువన్' అనడంలో మొదటిభావానికి విచ్ఛిత్తి కలుగలేదా? అసలు అవి రాగా వాటిని పట్టుకోడానికే తలుపులు మూసి, పట్టుకోవడం చేతకాక ఎందుకో తలుపుతెరిస్తే అవి పారిపోయినవనుకోడం, గదిలో పెట్టిన దొంగని అందులోనే వుండి పట్టుకోవడం చేతకాక, మరచి వేరే పనికై తలుపు తెరిస్తే పారిపోయినా డనుకోవడం వంటిదికాదా?

ఆలోచింపగా నాకింకొక విధంగా పద్యం

అర్థమవుతున్నది. అన్వయం దూరమో దగ్గరో, మార్పు సరియో కాదో మీరు చెబితే తెలుసుకొంటాను.

'సోరణగండ్లరాఁ గోదుమమక్కలు, పట్టి సతుల్ కవాటముల్ చేరుప' అని అంటే! కోదుమమక్కలు సోరణగండ్లనుండి వచ్చినవి. సరిగా అవి వచ్చే వేళకే వారు (నక్షత్రాలను పట్టడానికి కాదు — మరెందుకో, రతికోసమై) కవాటములు చేర్చినారు. అప్పుడు ప్రమాదవశమున లోపలపడిన నక్షత్రములు తమ్మువారు పట్టి మౌక్తికములని చిల్లులు పుత్తురేమో అని భయపడి దాగినవి. వారు పొద్దుపోగా (నక్షత్రములధ్యాసయే లేని వారు కొబట్టి) రతి సస్పిగద్పులకై తలుపులు తెరచిరి. బ్రతుకు జీవుడా అని అవి పారిపోయినవి. ఇట్లే పద్యానికి అర్థం వుంటే సబబు కాదా అనిపిస్తుంది. (ఇక్కడ 'కవాటముల్ పట్టిచేరుపక్' అని గాని 'కవాటముల్ చేరుపక్, పట్టి తమ్ము చిల్లులు పుత్తురు' అని గాని అన్వయించుకోవచ్చు.) అన్నీ ఎరిగిన మనుష్యులే చేతకానివారైనారనీ నక్షత్రాలే తప్పించుకొన్నవనీ అనడంకన్నా ఏమీ తెలియని నక్షత్రాలే భ్రమపడ్డాయనీ సందుదొరకగా పారిపోయాయనీ అనడం బాగుండదూ? పైగా కోదుమమక్కలు వచ్చే వేళకే వారు తలుపులు చేర్చుకొన్నారనడం సారస్యం కూడాను. మీరేమంటారు?

## నవలా రచయితగా బెర్నార్డ్ షా

ఇరవైమూడు, ఇరవైయేడు సంవత్సరాల వయస్సులో (1879-83) అయిదు నవలలు వ్రాశాడు బెర్నార్డ్ షా. ఇక అంతటితో ఆపేసి ఇకయేమీ వ్రాసి ఉండకపోతే మరి షా పేరు ప్రపంచంలో ఎంతమంది వినివుండేవారో అనుమానం. వాటిలో ఒకటి 'కాషెల్ బైరన్స్ ప్రొఫెషన్' మాత్రం ఒక చవుకబారు పత్రికలో ప్రచురితమైంది. కొంతమటుకు ప్రశంసలనందుకొన్నదనే అనాలి. రాబర్ట్ లూయిస్ స్టీవెన్సన్ చాలా బాగున్నదని ఇంకా ప్రచురించమన్నాడు. షా వ్రాసిన మిగతా నవలలకంటే చదవడానికి బాగుంటుంది ఇది.

ఈ అయిదు నవలల్లో ఆఖరిది "ఏన్ అన్‌సోషల్ సోషలిస్ట్." స్వాన్‌సోన్‌స్బీన్ ద్వారా పుస్తకంగా అచ్చయింది. సమీక్ష చేసినవారు దానిపట్ల కొంత మర్యాదగానే వ్యవహరించారుగాని ప్రజలలో అంత ఎక్కలేదని వీన్‌ట్రాబ్ అంటున్నారు. "ఇంగ్లీష్ ప్రజలు చాలాగొప్పవని పరిగణిస్తున్న లక్ష్యాలనూ, సంప్రదాయాలనూ. వ్యవస్థలనూ అపహాస్యం పట్టిస్తున్న పుస్తకాలను కొనరని ప్రచురణకర్తలు వీటిని నిర్లక్ష్యం చేశారేమోనని" యీ నవలలను సంకలనం చేసిన రచయిత అంటున్నారు. వాస్తవానికి తెలివిగా రాసినవే యివి. స్పష్టంగా ఇంకా యివి షా భావాలని చెప్పదగిన అంశాలు బీజప్రాయంగా ఉన్నాయి వీటిలో. అయితే ఇవి అంత మంచినవలలు కావు. షా యువరచయిత అప్పుడు. విడివిడి తెలివితేటలు అదోరకంగా కనిపించి ఉండవచ్చు.

షా ఆరవ నవల—'ఏన్ అన్ ఫినిష్‌డ్ నావెల్' అయి ఉండేది. 1887 లో ప్రారంభించాడు తరువాత అవతల పెట్టాడు, అసలు మరచిపోయాడు. ఆ తరువాత 41 సంవత్సరాలకు షా కార్యదర్శి దానిని బయటికి తీసి మిగతా వ్రాతప్రతులతోపాటు ఐర్లెండ్‌లోని నేషనల్ లైబ్రరీకి బహూకరించాడు వారు దానిని ముచ్చటయిన పుస్తకంగా ప్రచురించారు. మరి ఈ నవల వ్రాసే దశలో ప్రారంభంలో ఉన్న రచయిత కాదు షా అన్న సంగతి మరచిపోరాదు; అప్పటి వయస్సు 31 సంవత్సరాలు. పత్రికా రచయితగా కొంత పేరు సంపాదించాడు. ఫేబియన్ ఉద్యమం ప్రముఖులలో ఒకడు. ఉపన్యాసాల వేదిక మీద పేరు సంపాదించి సోషలిజం, సాంఘిక వ్యవహారాలను గురించి తన అభిప్రాయాలను స్పష్టంగా చెప్పనారంభించిన రోజులవి.

ఏరకం నవలగా తయారు కాబోతున్నదీ సూచించేటంత సరంజామా మాత్రమే ఉన్నది ఇందులో. ఈనవలలోని పాత్రలనూ, ఆశయాలనూ ఆతర్వాత రాసిన నవలల్లో షా బాగా చిత్రించాడన్న సంగతి ఆశ్చర్యం కలిగిస్తుంది. షా నాటకాలలో మాదిరిగానే ఇందులోకూడా నాయకుడు జార్జి బెర్నార్డ్ షా యే. మోటనిపించేంత నిష్కర్షగా మాట్లాడతాడు. స్త్రీలకు అందంగా కనిపిస్తాడు. అతిగా వాగడు—సరయిన పోషణలేక జబ్బుపడిన పిల్లలను గురించి ఇచ్చిన ఉపన్యాసంలో తప్ప.

అప్పటికే వైద్యవృత్తి అంటే అభిమానం ఏర్పడుతోంది షాకు. "ది డాక్టర్స్ డైలమా"కు ఇతివృత్తం దొరికింది. మరి ఇందులో మాత్రం నాయకుడు మంచి వైద్యుడు; అర్హతలు లేకుండా వృత్తిలోకి వచ్చిన ప్రతినాయకుడు (విలన్) విరోధి. జీవితగతినిబట్టి పురుషుణ్ణి స్త్రీయే చేరపడుతుంది ఎప్పుడూ. లొంగే దాకా బాధించుతుంది. చివరికి పెండ్లి చేసుకొంటుందనే అభిప్రాయాన్నే 'మాన్ అండ్ ది సూపర్ మాన్'లోనూ ఇతర నాటకాలలోనూ చిత్రించాడు షా. ఈ నవలలోకూడా అదే అభిప్రాయం—అయితే కొంచెం తేడా ఉన్నది. ఇద్దరు స్త్రీలు. యువకుడైన కిన్‌కెయిడ్ కోసమే ఇద్దరి ప్రయత్నమూ. మరి ఇద్దరూ అప్పటికే వివాహితలు. ఈ చిన్న చిక్కును ఎట్లా పరిష్కరించినదీ వివరించేదాకా పోలేదు యీ కథ.

ఇతివృత్తంలోని ప్రధానాంశాలన్నింటినీ మొదటి రెండు అధ్యాయాలలోనే చిత్రించినట్లు తోస్తుంది. మిస్టర్ మడ్డిక్ అర్హతలు లేని వైద్యుడు, డాంబికుడు, బలహీనుడు. ఆస్పరోగుల మంచాల దగ్గర పొద్దుపుచ్చడం అలవాటు. శ్రీమతి మడ్డిక్‌కు భర్తంటే యిష్టం లేదు. కిన్‌కెయిడ్ అంటే యిష్టం. సహోద్యోగిగా మడ్డిక్ ఇంటికి వస్తాడు డాక్టరు కిన్‌కెయిడ్. లేడీ లారీ ఉన్నతాధికారి భార్య. డాక్టరు కోసం కబురు పెడుతుంది. మడ్డిక్ లేనందున డాక్టరు కిన్‌కెయిడ్ వెళ్తాడు. లేడీ లారిని చూస్తాడు. అందాలు చిమ్మే ముఖం. (నీలి) నల్లని—ఉత్సాహం కలిగించే కళ్ళు. అందమైన కనురెప్పలు. చిన్న నోరు. పసిపాప పండ్లవంటి పలువరుస.

అంత మాత్రాన ఆవేగానుభూతి కలిగించేట్టు షా వ్రాయబోవడం లేదనుకోండి. గదంతా చాలా వెచ్చగా ఉంది. ఫర్‌లను కప్పుకొన్నది లేడీ లారీ. యువ డాక్టరు దేవతా మూర్తిలా వ్యవహరిస్తాడు. కిటికీ తలుపు తీస్తాడు. ఫర్‌లను తీసేస్తాడు. రాత్రి ఏమి తిన్నారండీ? అని అడుగుతాడు. ఏమీ లేదండీ—సూప్, సలాడ్, వేపుడు మాంసం, షాంపెయిన్ తప్ప ఏమీ లేదండీ అంటుంది ఆమె. చాలండీ—చాలు. మీరు తిన్నదన్నీ తింటే ఏనుగంత వాడికయినా జబ్బుచెయ్యక తప్పదు అంటాడు డాక్టరు. ఇటువంటి ఆక్షేపణలు షా నాటకాలలోని నాయకుల నోటివెంట తరచు వస్తూనే ఉంటాయి. నిజానికి అసలు ఈ నవలలో చాలా భాగం నవల మాదిరి కాక నాటక ధోరణిలోనే నడిచినట్లు కనిపిస్తుంది, అంతే కాదు. రెండో డాక్టరు వచ్చి కిటికీలను మూసేస్తాడు ఆమెను ఫర్‌లతో కప్పుతాడు. సుతారంగా ఎట్లా వుందండి అంటాడు.

ఈ నవలలోని మడ్డిక్, శ్రీమతి మడ్డిక్ పాత్రలు ఫేబియన్ ఉద్యమం నాయకుడు హ్యూబర్డ్ బ్లాండ్, ఆయన భార్య ఎడిత్ నెస్‌బిత్ అయి ఉంటారని కీన్ ట్రాబ్ సూచన. అయితే అయి ఉండవచ్చు. అయితే ఒక వ్యక్తిని మాత్రమే దృష్టిలో పెట్టుకుని ఒక పాత్రను పూర్తిగా షా యెన్నడూ చిత్రించలేదు. ఒక్కొక్క పాత్రకు ఒక్కొక్క ఉద్దేశం ఉంటుంది; ఒక్కొక్క పని ఉంటుంది. నాయకుడు—అదే షా—మాత్రమే సమగ్రమైన వ్యక్తి. ఇంతకూ ఇది అసంపూర్ణమైన నవల. పనుపెట్ట నారంభించాడు కలానికి ఈ నవలలో రచయిత, ఆయుధాలవాడకం మాత్రం ఇంకా అంతంతమాత్రంగానే ఉన్నది. బాగా కోపం ఎప్పుడు చిత్రించవలసినదీ—వాదనలో కొంత నిగ్రహం ఎప్పుడు అవసరమైనదీ యీ నవల వ్రాసేదశలో రచయితకు ఇంకా స్పష్టం కాలేదు.

(బ్రిటిష్ ఇన్ఫర్మేషన్ సర్వీసెస్ సౌజన్యంతో.)

# గ్రంథవిమర్శనము

నన్నెచోడుని కుమారసంభవ మెన్నికైనకావ్యము. ఏబదియొక్క యేండ్లకుముందు శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారిందలి మొదటి యెనిమిదాశ్వాసములను పిదప నైదేండ్లకు మిగిలిన యెనిమిదాశ్వాసములను బ్రకటించుటతో నీకావ్య మాంధ్ర సాహిత్యక్షేత్రమున కొన్ని క్రొత్తవిషయములఁ జిలుకరించి చర్చల కాకరమైనది. అవి క్రొత్తలగుటచేతను వానిని గూర్చి సిద్ధాంతములు చేయుటలో నెన్నియో చిక్కు లుండుటచేతను ఆ నాటి చర్చ లీనాటికిని ముగిసినట్లు కానబడవు. ఎందరో పండితులు పరిశోధకులు తలకొకవిధముగా తలపోసినారే కాని యాయావాని నిదమిత్థమని తేల్చిన ట్లగపడదు.

నన్నెచోడుని కాలనిర్ణయమే తొలిసమస్య. నన్నయకు పూర్వుడని, సమకాలికుడని, తిక్కనకు పూర్వుడని, తర్వాతివాడని ఈ విషయమున నాల్గు మతములున్నవి. నన్నయ తిక్కనల నడిమి కాలమువాడని చాలమంది యభిప్రాయము. చోడుని కావ్యములోని కొన్ని పద్యముల యనుసరణము తిక్కన, కేతన, నాచన సోమనాథుల కావ్యములందున్నది. కుమారసంభవమున బ్రక్కినట్లుగ ముద్దుగనున్న ఆ పద్యములు తిక్కనాదుల రచనలలో తేరి స్ఫూర్తిమత్త్వముతో బ్రయోజన పరిమితి నెఱిగి తీర్పబడియున్నట్లు సర్జనమార్గపరిచితిగలవారికి తెలియవచ్చును.

రెండవది వస్తుకవిత్వము. వస్తువనగా తత్త్వము; సత్పదార్థము. వస్తుకవిత యనగా తత్త్వకవిత. వస్తుకవు లన్నను నిసర్గకవులన్నను నొక్కటే. తాత్త్వికులగు కొందఱిని 'సృష్టించెదు' లని ఉపనిషత్తు వింగడించినది. కవులా మార్గమువారు. సంజ్ఞానముగల కవి భగవంతుని నాయకునిగా జేసి ప్రజ్ఞానాత్మకమగు చరాచర సృష్టి రూపుడైన హిరణ్యగర్భు నుపాసించుటయే వస్తుకవిత. సత్పదార్థముమీఁది స్పృహలేక వ్రాసినది వర్ణకకవిత. కన్నడసాహిత్యమందలి వస్తు — వర్ణక కవిభేద మిట్టిదే యనుకొందును. కాని ఈ వస్తుకవిత ప్రభాత చంద్రోదయాదులవంటి యాధ్యాత్మిక కవిత (Metaphysical Poetry) కాదు. యోగమార్గమునకు చెందిన మర్మకవిత్వమును (Mystic Poetry) గాదు. వస్తువుల బాహ్యస్వరూపమునకు ప్రాధాన్యమిచ్చి విస్తరముగా వర్ణించు సాహజికపద్ధతియు (Realism) గాదు. చోడుడు తన కవిత్వమును గురు సమర్పణ చేయుచు వ్రాసిన

'శరధినీరులు పయోధరములు కొనివచ్చి
కురిసి వారిధియందు గూర్చినట్లు
చేన బండిన విత్తు చేనికే ఫలకాంక్షఁ
జేర్చి క్రమ్మర వెదవెట్టినట్లు
రోహణాచలపతి యూహించి వరరత్న
సంచయంబున విభూషించునట్లు
తీర్థాళికర్థిఁ దత్తీర్థోదకంబుల
సేసకంబుగా నర్ఘ్య మిచ్చినట్లు"

అన్న సీసపద్యచరణములు

'అతః సముద్రా గిరయశ్చ సర్వే
అస్మాత్ స్యందంతే సింధవ స్సర్వరూపాః।
అతశ్చ సర్వా ఓషధయో రసశ్చ
యేనైష భూతై స్తిష్ఠతే హ్యంతరాత్మా'

అను ముండకోపనిషత్తు జ్ఞాపకముతో హిరణ్యగర్భోపాసన కనువుగా మార్చి వ్రాయబడినవి. చోడుడు విశేషక 'దివ్యకథాసూత్రము;' 'దివ్యకావ్యాంగనా సృష్టి' ఇత్యాదిగా బలుకుట సాభిప్రాయమే. దీనిని గూర్చి సాంగముగా వివరించుట కిచ్చట అవకాశము లేదు. కవిత్వమునకు తత్త్వమునకు ఎడతెగని లంకెయే గనుక తర్వాతి కాలమున దీని మాసిన పేరు మాసి రెనయు కవిజనాశ్రయములో విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణిలో నొకట రెంట నామమాత్రావశిష్టమైనది. ఉపనిషన్మార్గము నవలంబించిన నన్నెచోడుడు వీరశైవుడు కాడు. భైరవయోగులను నవనాథులను శైవాగమములను పేర్కొన్నను చోడుడు తాంత్రిక శైవమున దక్షిణాచారముగల కాలాముఖ

సంప్రదాయము వాడే ననుకొందును. 'సిద్ధాంతమున' అనుమాన ప్రమాణ మొప్పుకొనడు. శైవ సిద్ధాంతాను యాయి కాడనుట నీశర్మతో నిర్ణయింపబడియున్నది. జంగము మల్లికార్జునుడు కాలాముఖ సంప్రదాయము వాడనుట స్పష్టము. శిష్యుడుగూడ నా సంప్రదాయము వాడగుట సహజము గదా!

మూడవది జాను తెనుగు. జానుశబ్దము తెలుగు కన్నడములలోని మాట. తమిళమున దీనికి సమానార్థకము పదము 'చెమ్మెయ్'. కనుక జాను శబ్దము జ్ఞాన శబ్దభవమనుకొనక తీరదు. చోడుడు చెప్పిన 'ఇంపు సొంపు', పాలకురికి సోమన చెప్పిన 'ప్రసన్నత' 'సర్వ సామాన్యము'?, కన్నడిగుల 'సమ సంస్కృతోక్తి' అనువాని కవిలోకముగా జాను తెను గనగా Idiomatic Telugu అని యనుకొందును. చింతామణి లోని 'ప్రవాహినీ దేశ్యా' అన్న కారికను గాని, 'తేర నాడిన' పలుకులు దేశ్యములన్న కేతన మాటను గాని, 'బహుదేశా న్యేయాము' లు దేశ్యములన్న విన్నకోట పెద్దన మాటను గాని ఋతి గలుగనక్కరయే లేదు. మరి పొందికయే కుదురును. తెలుగునాట నాయా ప్రాంతములందు సర్వ సామాన్యముగ నుండిన 'జాణుడి' యే కాలక్రమమున 'నానుడి' గా సంకుచితార్థమున కొన్ని పలుకుబడులకు సంకేతముగా రూఢియైనది.

నాలుగవది దేశి. సంస్కృత సంప్రదాయమునకు దాస్యము చేయక స్వస్థాన వేష భాషాదికము మీద ప్రీతి ప్రకటించి దేశియ తాముద్రతో వ్రాయుటయే దేశి సంప్రదాయమని 'దేశి మార్గములు దేశియములుగా' వ్రాయుదునన్న చోడకవి హృదయమును కొందును. అతని కుకవినింద మార్గ దేశి సంప్రదాయముల నసమర్థముగా నిర్వహించువారిని గూర్చి వ్రాసిన దని నా యూహ. 'మార్గకు మార్గము' ని ప్రసిద్ధమునను విప్పయు, దేశియు మార్గమని క్రొత్తదాని కొక సారియు చెప్పుకొని 'వదలంగ' అను పాఠముతో జత వినచో 'మార్గములఁ' 'సుఖములన్' అను మార్పులు చను త్కారము గూడ పొంథ సరమైన విమయాంతర స్ఫూర్తి చెడదు. అనగా అలంకారము చెడదన్న మాట. చోడుడు కుకవినింద బాణుని జూచి వ్రాసియుండుట సంభావ్యమే. మంగళాచరణమున స్రగ్ధరావృత్తము వాడుటకు, షష్ఠ్యంతములకు, సప్తసంతానముల ప్రసక్తికి తెలుగు కావ్యముల నీతడే యాద్యుడనుకొందును. శైవుల శరణాగతి; వైష్ణవుల ప్రపత్తి షష్ఠ్యంత రచన యేర్పడుటకు చోదక శక్తులు గావచ్చునని నా యూహ. కుమారసంభవము తొలి తెలుగు ప్రబంధమే యగును.

## నన్నెచోడుని కవిత్వము

[కర్త: భాషాప్రవీణ అమరేశం రాజేశ్వరశర్మ, బి.ఏ.. ప్రతులకు: అజంతా పబ్లికేషన్స్, సికందరాబాదు. 8+276 పుటలు వెల 4 రూ.]

ఈ విమర్శ గ్రంథమున నన్నిచోడుని అతని కావ్యమును గురించిన విషయములు తత్సంయుక్త గ్రంథ సూచితో గూడ నిరువదియొడుశీర్షికలలో చర్చింపబడెను. చారిత్రక పరిశోధనమీదకంటె కవిత్వముపై దృష్టి యెక్కువ. సప్తసంతానముల చరిత్ర నీయన తడవినట్లు కానరాదు. చోడుని కాలము తిక్కనకు పూర్వమని తొలుత నే యంగీకరించిన అనేకులమ్మతమూరయు నాశ్రయించినారు. 1170 క్రీ. శ. నాటి గంగారకవి శాసనమున మంగళాచరణము తెలుగున జూపి కావ్యమున నన్నిచోడుడే దీనికాద్యుడని అభిప్రాయపడినారు. రాజరాజేంద్రునికి బిజ్జ సోముల దేవి శాసనము చూపి తర్వాత కావ్యములో మొదట స్రగ్ధరావృత్తము వాడు సంస్కృతసంప్రదాయమును తెచ్చిపెట్టినవాడనియు చూపినారు. భారవి కావ్యమున ఇంద్రకీలనగ్నాగారోహ ఘట్టమునమాత్రమే వస్తుకవిత యున్నదను కొనుట సరికాదు. భారవిలోని అర్థగౌరవము నా చెప్పిన 'వస్తు' గౌరవ మనుకొందును. 'ప్రకృతి వర్ణనాత్మకమైన కవిత వస్తుకవిత' యన్న (19 పు) మాట కొంత వరకు సరియేగాని 'ప్రకృతిని వాస్తవముగా వర్ణించు కవిత వస్తుకవితయనియు, వస్తుకవులనగా ప్రకృతిశోభను వాస్తవముగా వర్ణించు కవులనియు ననుటయే' (22 పు) యన్న సారాంశ వాక్యము Nature Poetry, Realism in Poetry అను భ్రమలు గొలుపుచు నస్పష్టముగా నున్నది. ఇది యొప్పుకొన్నచో 'వర్ణక కవు' లెవరో చెప్పవలసి యుండును. నన్నెచోడుని కాలమున శైవులు బ్రాహ్మణులనుగూడ జంగము శబ్దముతో వ్యవహరించువారనుట, చోడుడు వీర శైవుడు కాదనుట నిజమే. అతని కావ్యలక్ష్యము మతప్రచారము కాదనుటయు సరియే. చోడుని పద్యౌచిత్యమను శీర్షిక క్రింద శర్మగారు అశ్వాసాంతముల 'మాలిని' వ్రాయుటలోను, స్త్రీపర్వమున నానావిధ వృత్తములు వ్రాయుటలోను తిక్కన చోడు ననుస

రించెనని యభిప్రాయపడుట సరిగా తోపదు. చోడుడు మూడుచోట్లనే మాలినులు వ్రాసినాడు. నన్నయ యొకచోట వ్రాసినాడు. నన్నయనే తిక్కన యనుకరించినాడని యేల యనరాదు? ఇంతకును ఆపద్ధతి విశేషముగా నాటించిన తిక్కన 'సుకృతితిలకము' ననుసరించి నడచియుండుట సంభావ్యమని తలతును. ప్రయోజన దృష్టితో తిక్కన శివతత్త్వసారకర్తను, చోడుని అనుసరించినంతమాత్రమున అన్నిచోట్ల ఆయన కను కరణదౌర్బల్యము నంటగట్టుట అపచారము. చోడుని యుద్ధవర్ణనలతో తిక్కన యుద్ధవర్ణనలు పోల్చిచూపి నిట్టిదే. 'మంగళమహాశ్రీ'ని చోడుడు దేశీయసంప్రదాయముగ కావ్యాంతమున ప్రవేశపెట్టియుండుట సంభావ్యమే తరువోజనుండి ద్విపద పుట్టినదను శర్మగారి యూహ సహేతుకముగా నిరూపింపబడినది. 'సుజ్ఞాన యోగ తత్త్వ విధిజ్ఞు' (12-27) లను చతుర్థ్యంత కందమున మూడు నాలుగు పద్యములు ఎత్తుగడను బట్టియు ప్రధానక్రియకు ముందే కర్తృపదముండుటను బట్టియు శర్మగారు చెప్పినట్లే యుండవచ్చు యనుట సమంజసము. చోడుని లయగ్రాహిరూపములు చమత్కారభేదమని నాయూహ. జాను తెనుగునుగూర్చి 'పెద్దన చెప్పిన దేశ్యమును చోడుడు చెప్పిన జాను తెనుగును ఒక్కటియే యయి యుండునని తెల్లముచున్నది' (78 పు) అన్నమాట బాగున్నది. తరువాతి యారు శీర్షికలు నన్నిచోడునిపై భారవి, కాళిదాస, బాణ, భట్టభట్ట, వాల్మీకి వ్యాసుల ప్రభావమును గవేషించునవి. చోడుడు కథకొంత బాణునినుండి గ్రహించినాడనుట సరియే కాని శరవణమును సరసుగా చెప్పుటకు రామాయణము మూలమని తలచుటకు వీలులేదు. శరవణము అపరిమిత పురాణములలో నున్నది. శివపార్వతుల రహస్య విహారస్థలమనియు నున్నది. గంగ యొడ్డున నున్నట్లు మత్స్యపురాణము. నాకు జూడగా ప్రధాన కథయంతయు హిమవంతమున జరుగగా చోడుని తన 'శరధి నీరుల' న్న ప్రథమాశ్వాస పద్యమునన్న నాల్గువిషయములు మూసి మాత్రము హిమవంతుని కన్యయింపగా 'శరధి'త్వము నన్వయింప జేయుటకు శరశబ్దమాధారముగా దానిని సరసుగా మార్చి హిమవంతమున బెట్టినాననుకొని తృప్తిపడినట్లు తోచుచున్నది. మరిదారిద్ర్యవిద్రావణ దళకము వ్రాసినంత మాత్రమున — ఒక వేళ నున్నచో నా పూర్తి శతకము దొరకునంతవరకు — చోడుడు తెలుగున శతక వాఙ్మయమున కాద్యుడనుట న్యాయము కాదను కొందును.

తరువాత. కవిత్వము మీది దృష్టిచే గ్రంథమంతయు నొడ్డగెడ నగునట్లుగా చోడుని యష్టాదశ వర్ణనలు 126 పుటలలో పరామర్శింపబడినవి. ఈ పరామర్శ యంతయు ముఖ్యముగా 'సాహిత్యదర్పణ విశ్రుతి పూర్తి'ననుసరించి జరిగినది. అష్టమాశ్వాసమున 'రంజిల్లుపూర్వదిక్సతీ' త్యాది (108) పద్యము 'సంధిల్లు పూర్వదిక్సతీ' త్యాదిగా శర్మగారు పఠించుట బాగున్నది. మరి కాళిదాసు పార్వతి తపమును వర్ణించుచు గ్రీష్మవర్షా హేమంతములు మాత్రము వర్ణించుట ఆమె నిష్ఠుర తపమును చెప్పుటకు గదా. చోడుని షడృతు వర్ణనవల్ల విశేష సౌచిత్యము వచ్చినదని తోపదు. ఆచోటి అతని కేళియుత విశేషము కాదు...ఇతర వర్ణనలగూర్చి చెప్పుచోట కన్యాంగ సౌందర్య వర్ణనమును వర్ణించుచు చోడుడు వ్రాసిన 'స్మరమందిర' త్యాది పద్యము మ్లేచ్ఛమనజెల్లదు. తంత్రమెఱిగినవారు కట్టియూహా రాదు. కుమార సంభవము మహాకావ్యమునుం పరేగాని దేశిమార్గముల జెప్పినవారిలో భియయ పండడొక డున్నాడని గమనింపలేను. చదివినకొలఁదు, చేసినపని కనుపించెడి పుస్తకమిది. చూడదగినది.

## 'కవిరాజ శిఖామణి'

[కర్త శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్య, ఎం. ఏ. బి.ఓ.ఎల్., ఆంధ్రభాషా శాఖాధ్యక్షులు, సర్ త్యాగరాయ కళాశాల, మద్రాసు. ప్రచురణ: సారస్వత కుటీరము, మద్రాసు-21. ప్రతులకు: గ్రంథకర్త, త్యాగరాయ కాలేజి, మద్రాసు-21. 8+200 పుటలు. వెల: రు. 3-50 న. పై.]

పరిశోధకులుగా, విమర్శకులుగా శ్రీ కోదండరామయ్యగారాంధ్రులకు చిరపరిచితులు. నన్నిచోడ

కుమారసంభవ కావ్యమును ప్రియముగా జదివి పెద్దగా పరిశోధించిన కొద్దిమందిలో నాయన యొకరు. 'కవిరాజ శిఖామణి' యను ఈ గ్రంథ మాయన నన్నెచోడునిగూర్చి వ్రాయదలచిన - బహుశః వ్రాసిన దానిలో తొలిభాగము. ఇంగ్లీషు భాషలో Studies అను పద్ధతిగా వ్రాయునట్లు వ్యాసతుల్యము లైన పదమూడు శీర్షికల క్రింద ఆయా విషయములను మట్టముగా చర్చించిన గ్రంథమిది. హెచ్చులొచ్చులు లేక చారిత్రక దృష్టి యెంతో సాహిత్యదృష్టియు నంత మాపెడి వారగుటయే గాక మత సాంఘికాది విషయక దృష్టియు నుండుటచే ఈ గ్రంథము చక్కగా నమరినది. తెలుగు విమర్శ సాహిత్యమున ఇది కొంచెము క్రొత్త పద్ధతియే యనుకొందును.

'కవిరాజ శిఖామణి'లో గ్రంథకర్త చోడుని కాల నిర్ణయము చెయ్యలేదుగాని పరిచయము వ్రాసిన శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారు వ్రాసినట్లు 'సంవాది రచనల'ను భాగమున "అతని కాలనిర్ణయమును ఒక నూత్న విధముగ సమర్థించి కోదండరామయ్య ధన్యులయ్యేను." చోడుడు తిక్కనకు సద్యఃపూర్వుడని గ్రంథకర్త యభిప్రాయము కానోపును. ఈ గ్రంథమున తొలి రెండు వ్యాసములు చోడుని అనువాద సౌరస్యమును, కవితా శిల్పమును వివరించునవి. అనువాద సౌరస్యమున చోడుడు సృష్టించిన 'రతీమన్మథ సంవాదము' సమర్థింపబడినది. 'కవితాశిల్పము' చోడుని కవితాశిల్పమును దిఙ్మాత్రముగ ప్రదర్శించుచు వాని ననుకరించిన తిక్కన త్రిపురాంతక తిక్కనల రచనలుగూడ జూపించునది. 'శరణు మహేశ' (10 ఆ-84 ప) అన్న నాగబంధమున నున్న పద్యము 'సారసుఖప్రద' 'విస్తరితరమాదయా' 'ఉరుపలబ్ధిప' అని అర్థసంగతి కుదురునట్లు, బంధ నిర్బంధమున చిక్కులు రాని యట్లు సవరింపబడిన దని వ్రాసినారు. కాని మద్రాసు యూనివర్సిటీవారి ప్రతిలో 'సారసుఖప్రద' 'విస్తరితరమాదయా' అనియే యున్నది కనుక విషయము నిష్టంకింపవలసినది. మూడవది మాత్రము 'శరీర దుఃఖ దుస్తర కములాపహార' 'ఉరుపలబ్ధిప' అని వచ్చునట్లు 'ఖి' ని 'ప'గ మార్చుట సరిక్రొత్తమార్పే. అట్లే 'స్థిరమతి శుభసితమూర్తీ' అన్న ఆచోటి కంద పద్యము మురజబంధమని యున్నదిగాని యూనివర్సిటీ ప్రతిలో గోమూత్రికాబంధముగ జూపినారు. అదియు సరిగా నున్నట్లు తోపదు. 'తనుభిదురిత జనకసుకీర్తీ' అన్న చివరిమాట 'తనుభిదురిత జనకసుకీర్తీ' యని యున్నచో గోమూత్రికా బంధమునకు సరిపోవును.

'మార్పులు కూర్పు'లను మూడవభాగమున కవి శివపురాణమునకు భిన్నముగా (1) శివదక్షులకు భేద మేర్పడిన పద్ధతి (2) సతీదేవి పిలువని పేరంటమునకు బోవ దక్షుడు తన విభవము జూపింప బిలిపించుట (3) సతి యోగాగ్ని దగ్ధమైనదను మాట నించుక మార్చుట (4) వీరభద్ర జన్మవృత్తాంతము పరిహరించి గణాధీశ్వరునిచే నధ్వర ధ్వంసము చేయించుట (5) దక్షునికి పశుముఖానుసంధానము జేసిన వృత్తాంతమును మార్చుట యనువానిని ప్రయోజనాపేక్షతో నెట్లు సంతరించినదియు జెప్పబడినది.

నాల్గవది వస్తుకవిత. దానినిగూర్చి నా యభిప్రాయము ముందే చెప్పితిని. 'భవునర్చితము లైన పత్రపుష్పములు, భవునకుఁ దగ సమర్పణ చేసినట్లు' (బసవ పు.) అన్న సోమనాథుని రచన అచ్చముగా భక్తిమార్గమునకు జెందిన సామాన్యమైన-అథవా వీరశైవమైన-రచన. చోడుని రచన కుపనిషత్తు మూలమని చూపితిని. 'కవితామృతోదయాంబుధిఁ గవితా సజ్జనకు' అన్నది కోదండరామయ్యగారు పఠించినట్లు 'కవిసజ్జన కనకు వస్తుకావ్యజ్ఞరవిన్' అని పఠించుటయే లెస్స యనుకొందును. మరి వస్తుకవితలో మృగురీతి సూక్తులు వీడరాని గుణమన వీలు లేదుగాని యానుషంగికము లనుకొందును (48 పు). రామాయణ కిరాతార్జునీయము లేకవస్తు ప్రతిపాదకము లగుటచే వస్తుకావ్యము

అనుట, ఆ ప్రాధాన్యముచే చోడుడు దానిని వస్తుకవిత యనె ననుట (52 పు) పొసగదు. అప్పుడు భారతము కాకున్న రఘువంశ మేల వస్తుకావ్యము కాలేదు? చోడుడు కాళిదాసును వస్తుకవిగా జేర్కొనలేదుగదా! అట్లే 'ఈ వస్తుకావ్యములలోను రెండు తెరగు లున్నట్లున్నవి. గూఢ వస్తుకావ్యములు, వ్యక్త వస్తు కావ్యములు' (52 పు). రెండు తెఱఁగులు లేవు. ఉన్న దొక్కటే. వ్యక్తవస్తు కావ్యప్రసక్తి ఎచ్చటను లేదు గదా! 'అలంకారము గూఢవస్తువును కావ్యముగా' అన్న దానిని 'అలంకారముగూడ వస్తువును కావ్యముగా' నని పఠించి ఉచ్ఛటుని కావ్యాలంకారమున కన్వయించువారును ఉన్నారు. దానిచే నించుక అన్వయసారళ్య మేర్పడు ననుట నిజము. మరి 'గూఢ వస్తు'వని పఠించినను నాయూహ ప్రకారము హిరణ్యగర్భుని గర్భస్థ హిరణ్మయ తేజమని చెప్పవీలున్నది. చోడుడు భారత భాగవతములు భిన్నవస్తు ప్రతిపాదకము లగుటచే వస్తు కావ్యములుగా పరిగణించి యుండక పోవచ్చు (55 పు) నని గ్రంథకర్త లూహ చేసినారు. భారత ప్రతిపాదిత మేకవస్తువైనను భిన్నవస్తువులైనను భగవంతుడు నాయకుడు గాక పోవుటచేతను, భాగవతమున భగవంతుడే నాయకుడనుకొన్నను హిరణ్యగర్భోపాసనము గాక ఆధ్యాత్మిక వేదాంతమే (Mataphysics) చెప్పబడుటచేతను చోడుడు వానిని వస్తుకావ్యము లనలేదని నాయూహ. మరి 'కుమారసంభవము వస్తుకావ్య మనగానే వస్తు వేది యని జిజ్ఞాస పొడము'నని చెప్పి కథాసూత్రము నందించిన చోట నట్లూహ చేయరా దనుకొందును. వస్తు కావ్యము కానిదానిలోను కథావస్తు వుండునుగదా మరి!

తర్వాత జాను తెనుగు. నా తలచిన ప్రకారము 'తెనుగుదేశము వాడుకలోనున్న తెలుగుమాటలను జాను తెనుగని వాడిరి' అన్నంతవరకు శ్రీ లక్ష్మీపతిశాస్త్రి గారి యభిప్రాయమును, కర్ణాటకులు 'సమసంస్కృతోక్తి'యన్నారని చూపిన డాక్టర చిలుకూరి నారాయణరావుగారి యభిప్రాయమును అవిరోధముగా కుదరగలవు. 'లోక వ్యవహారబద్ధములైన సంస్కృతాంధ్ర పదములలో వెలయవలయు'నన్న నారాయణరావుగారి వాక్యమే సారాంశము. ఇంక 'జానతి పశుపతి' నన్న పద్యమున గ్రంథకర్తలు చెప్పినట్లు జానతి=తెలివిగాలి అని యర్థము చెప్పినచో పైనవచ్చెడి 'అజ్ఞానికి' అను దానిలో కొంచె మించుమించుగా శబ్దార్థ పునరుక్తి యేర్పడును. జానతి=gracelessly అని చెప్పకొనక తీరదు. పోగా కేతన 'తేరనాడిన' పలుకులుగా జెప్పిన వానిలో వ్యస్త సమస్త పదము లున్నవి. లాక్షణిక దృష్టితో కేతన వింగడించినాడు. చోడుడు వ్యవహార దృష్టితో వాడుకొన్నాడు. 'ఎల్లవారికి తెలిసెడి యా పలుకులు' కాని దేశిపదములు ప్రధానముగాఁ బ్రయోగించిన తెనుఁగని, దానికి ప్రసన్నతయు సర్వసామాన్యతయు ప్రత్యేకగుణములని తెలియవలయునని (71 పు) వ్యతిరేక మార్గమున సాధింపనక్కర లేదు. ఎల్లవారికి దెలిసెడి పలుకులకు 'ప్రసన్నత, సర్వసామాన్యత' ప్రత్యేకగుణములుగ నుండవను విపరీతార్థ స్ఫురణమున్నది గ్రంథకర్తలు గమనించినట్లు లేదు. దేశి సంప్రదాయమను వ్యాసమున గ్రంథకర్తలు చేసిన నిర్ణయము (81 పు) చాలా సమంజసమైనది. 'మార్గకు మార్గ' మన్న పద్యము నేను పఠించినట్లు పఠించినచో గ్రంథకర్తలకు తోచిన కుదురమి తీరిపోవునను కొందును. 'కృత్యవతారణిక'లో షష్ఠ్యంతములు కాళిదాసాదుల జూచియు, సంప్రదాన చతుర్థికి మారుగా షష్ఠీవిభక్తి చేర్చుకొనియు వ్రాసియుండవచ్చునని అభిప్రాయపడినారు; ఇష్టదేవతా స్తుతి కన్నడ కవులనుండి గ్రహించియుండునన్నారు. సప్తసంతానముల చరిత్రవిషయమున మానసోల్లాసమున నైదు చెప్పబడెనని ఏడుగా జెప్పినవాడు చోడుడని యాయన యభిప్రాయము.

తొలి తెలుగు ప్రబంధమను వ్యాసమున గ్రంథకర్తలు చోడుడు కాళిదాసు గ్రంథము చూచియే

ప్రబంధనిర్మాణము చేసెనని తలచి కన్నడకవుల యనుసరణ లేదని యభిప్రాయపడినారు. కాళిదాసు కావ్యముకంటె చోడుని కావ్యము విపులముగదా! కన్నడిగులును ఉత్తరులును సంస్కృత కావ్యము ననుసరించియుండురనుట సాధ్యమే గాని చోడునికి కన్నడ కావ్యముల యనుసరణ లేదనుట సంభావ్యము కాదేమో!

సంస్కృతానుకరణము నున్నది వక్కాణి ఖండము. భావోపజీవనముగా చోడు డనుకరించిన కవుల రచనలు, చాటువులు, శాసన పద్యములు చాల చూపినారు. తమిళ కన్నడముల ప్రభావమున్నది ఈ గ్రంథమునకు నూటాయునానమైన భాగము. పరిశ్రమించినది. 'నవనీతపాటి యూర్' అను తమిళాలంకార గ్రంథమున కవి గమకి వాది వాగ్మి ప్రశంస చూపినారు గాని వివరించిన భాగుండెడిది. ఆశు మధుర చిత్ర విస్తర కవిత్వములకు ఈ నలుగురికి సంబంధమున్నట్లు తోచుచున్నది అప్పుడు ఆశువు జెప్పువాడు కవి, మధుర కవిత చెప్పువాడు గమకీ త్యాగా జెప్పకోన వలెనా లేక కవి, గమకముతో చదువువాడు, తార్కికుడు, పౌరాణికుడు నని చెప్పకొన్న చాలునా? నాకుమటుకు నాకు మొదటి యూహ సమంజస మనిపించుచున్నది. 'పిడిక్కై కూందల్' అనే తమిళ పదబంధమునకు హస్తి హస్తమును ఉపమానమునకు సంబంధము కానరాదు. పట్టెడు పట్టెడు వెంట్రుకలనుట నేటికిని స్త్రీజన వ్యవహారము. మరి 'ఈనని తలచుచు జాగియు' నన్న పద్యము, దానితో పంవదించు కన్నడ పద్యము

'కృపాణేన కథం కారం కృపణ స్సహాగన్యతే।
పరేషాం దానసమయే య స్సర్వాశం విముంచతి।'

అనే కవి రాక్షస శ్లోకమునకు మెఱుగులేమో!

'సంవాదిపద్యము'లన్న భాగమున చోడు ననుకరించిన పాలకురికిసోమన, తిక్కన, కేతన ఎఱ్ఱన, నాచనసోమన, గోపరాజు, రాములు, రామకృష్ణుడు, సంకుసాల, పింగళి సూరన్న, నూతన కవి సూరన్న, ఎఱ్ఱన, ప్రెగ్గడ పల్లి పోతయ్య, వెంకటకవి, రఘునాథ నాయకుల రచనలో నొక్కచోట ప్రదర్శించి ఇతర కవులపై చోడుని ప్రభావమును వెలార్చినారు. ఈ గ్రంథమున నిదియొక యుత్తమఖండము. 'మత' మను భాగమున జంగమ మల్లికార్జునుడు కాలాముఖ సంప్రదాయము వాడని చూపి చోడుడు ఆగమశైవము వాడని యభిప్రాయపడినారు. 'శివగౌరీ సహితంబు' అన్న (180 పు) పద్యమున మొదటి పాదమున 'మైతెంచి' అన్న దొరిపోయినది.

సాంఘిక జీవనమును చివరిభాగమున చోడుని కాలము నాటి యాచార వ్యవహారములను క్రోడీకరించి యా సంఘమును కనులకట్టినారు. 'మగండ్రు' విషయము జెప్పియున్న చోట నిఖండము సమగ్రమయ్యెడిది.

ఇట్టి గ్రంథము సరళమైన భాషలో పాఠకుని క్రమముగా నడుగులు వేయించుచు ననేక విషయముల నవధానముగా జదివించునది. బహువిధమైన శ్రమ ఈ రచనలో కాన్పించును. దానికి తగిన ఫలమునే గ్రంథకర్తలు పుస్తకరూపమున సాధించినారు. కవిరాజ శిఖామణి గ్రంథము చదువువారికీ పాత్రము కైపాత్రము (Hand Book) గా నుండదగినది. గ్రంథకర్తలు రెండవ భాగమును త్వరలో ప్రకటింపగలరని యాశించుచున్నాను.

ఎస్. కె.

# గ్రంథ స్వీకారము

## గీత గోవిందము

జయదేవుని అష్టపదులకు శ్రీ ఉప్పులూరి కనకయ్య పద్యానువాదం. డెమ్మీ 42 పుటలు. వెల: తెలియదు. ప్రాప్తిస్థానం: శ్రీ బందా కనకరాజు, వకీలు, ఎడిటర్, లా జర్నల్, గుడివాడ, కృష్ణాజిల్లా.

## శ్రీ వెంకటేశ్వర విజయము

శ్రీ కోట సోదరకవులు. పుటలు: 40. వెల: 50 న. పై. ప్రాప్తిస్థానం: కవిచంద్ర గ్రంథమాల, 147, మింట్ స్ట్రీటు, మదరాసు - 1.

## ప్రకాశ ప్రభ

ఆంధ్రకేసరి జీవిత సంగ్రహం - పద్యకావ్యం, శ్రీ కోట సోదరకవులు. పుటలు: 30. వెల: 75 న. పై. ప్రతులకు: కవిచంద్ర గ్రంథమాల, 147, మింట్ స్ట్రీట్ మదరాసు - 1.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.

